

31.8.88 న ప్రారంభం

వివాహాది శుభకార్యములకు అందాలనిచ్చే
బొమ్మనవారి వస్త్రాలు!!






కంచి, ధర్మవరం మొదలైన
అన్ని రకాల సిల్కు చీరలు,
సూటింగులు, షర్టింగులు,
ఫర్నిషింగ్స్ మరియు డ్రస్
మెటీరియల్స్ కొరకు
దర్శించండి.

పట్టు చీరలకు
మా ప్రత్యేకత.

రాజమండ్రి
బొమ్మన వారి

హోల్ సేల్
ధరలకే
రిటైల్
అమ్మకం.

Alfavision 884

# బొమ్మన శారీ మందిర్

ఎ. సి. షోరూం

సూర్యా థియేటర్ ఎదురుగా, తిలక్ రోడ్, అబిడ్స్, హైదరాబాద్.

# న్యూఢిల్లీ లేఖ

డా. జయ్ దుబాషి



# పంజాబ్ సమస్యకి పరిష్కారం ఎప్పుడు?

ప్రతి రోజూ సాయంత్రం టెలివిజన్ చూస్తూ ఇజ్రాయెల్ లోనో ప్రపంచంలో మరే భాగంలోనో జరిగిన రక్తపాతాల్ని, కల్లోలాన్ని కళ్ళకొద్దీ చూసే మనకు స్వయంగా మనమే ఒక అగ్ని పర్వతం మీద కూచున్నామని కూడా తెలియక పోవచ్చు. గత నాలుగు నెలల్లో మిగిలిన ప్రపంచంలో చనిపోయిన మొత్తం మంది కంటె పంజాబ్‌లో ఎక్కువ మంది కాల్చివేయబడ్డారు. లండన్‌కు చెందిన పదాల కోసం ఎప్పుడూ వెతుక్కోని పత్రిక ఎకానమిస్ట్ పంజాబ్‌లోని భయంకర హత్యల జాబితాను చూసి అవాక్కు అవుతున్నది. ఇది ప్రపంచంలో కెల్లా ఘోరమైన టెర్రరిస్టు యుద్ధమని ఆ పత్రిక అభివర్ణించింది. పంజాబ్ పూర్తి పతనం లోకి జారిపోతున్నదని ఆ పత్రిక రాసింది. ఇప్పటి వరకు జరిగిన అనుభవాల కంటే ఘోరమైనదిగా ఒక అంతర్యుద్ధం వైపు పరిస్థితి దారి తీస్తున్నదని కూడా ఆ పత్రిక జోడించింది.

పాటియాలో అతి భయానకమైన కాల్పులు జరిగిన తర్వాత రెండు రోజులకు నేను అక్కడికి వెళ్ళాను. అక్కడ తమ వీడియోలో 'లావారిస్' సినిమా చూస్తున్న 14 మంది అమాయక స్త్రీ, పురుషులను కాల్చి చంపేశారు. హంతకులు రైలు పట్టాలకు అవతలి పక్క నుంచి వచ్చారు. ఆ పట్టాలు అరమైలు కంటే లోపలే ఉన్నాయి. వాళ్ళు వచ్చిన వెంటనే కాల్పులు జరిపారు. ఆ కుటుంబం అప్పుడే వివాహపు విందుకు సిద్ధపడుతోంది. వాళ్ళందర్నీ కూడా క్షణాల్లో ఒక ప్రధానమైన ట్రంక్ రోడ్డుకు అంచున ఉన్న పొలంలో మట్టి కరిపించి వెళ్ళిపోయారు. ఆ ట్రంక్ రోడ్డు పాటియాలా నగరానికీ, రాష్ట్రంలోని మిగతా ప్రాంతాలకూ వారధి. హంతకులు బంజారాలు. ప్రతి నెలా మొదటి వారంలో వాళ్ళు అక్కడ బస చేస్తారు. పశువులను అమ్ముతూ, కొంటూ ఇతర వ్యాపారాలు కూడా చేస్తూ ఉంటారు. ఆ మొత్తం కుటుంబం తుడిచి పెట్టుకు పోయింది. కొందరు పిల్లలు మాత్రం మిగిలారు. ఆరేళ్ళు, నాలుగేళ్ళు, రెండేళ్ళు వయసున్న ముగ్గురు చిన్నారి పాపల తల్లిదండ్రులు మరణించారు. ఆ పాపలకు ఆ సంగతి తెలియదు. నాకు కూడా చెప్పాలనిపించలేదు.

1985లో అంటే ప్రధాన మంత్రిగా రాజీవ్‌గాంధీ మొదటి సంవత్సరంలో పంజాబ్‌లో హత్యకు గురయిన వారి సంఖ్య 61. తర్వాతి సంవత్సరం ఈ మరణాల జాబితా దాదాపు పది రెట్లు పెరిగిపోయి 520కి చేరుకుంది. చనిపోయిన వారిలో కొందరు టెర్రరిస్టులు కూడా ఉన్నారు. కానీ చనిపోయిన వారిలో ఎక్కువమంది అమాయకులే అనాలి. 1987లో ఈ సంఖ్య దాదాపు మూడు రెట్లయింది. 1280 ప్రాణాలు బలయిపోయాయి. హత్యలు జరుగుతున్న తీరును బట్టి చూస్తే ఈ సంవత్సరాంతానికి హత్యల సంఖ్య 2500 కావచ్చు. ఈ స్థాయిలో ప్రపంచంలో మరెక్కడా హత్యాకాండ సాగడం లేదు. చివరికి పూర్తి స్థాయి అంతర్యుద్ధం జరుగుతున్న అంగోలాలో గాని, తన సొంత యుద్ధంలో అరబ్‌లకు వ్యతిరేకంగా పోరాడుతున్న ఇజ్రాయెల్ లోపల గాని, చుట్టుపట్ల గాని ఇటువంటి హత్యలు జరగడం లేదు.

మనకు ఢిల్లీలో ఉన్నది ఒక అధమ శ్రేణి ప్రభుత్వం. దాని ముందర ఒక పూర్తి స్థాయి యుద్ధం ఉన్నదని కూడా అది గుర్తించడం లేదు. అవతలి పక్షంలో ఆధునిక ఆయుధాలు ఉండగా మన [illegible] ఎప్పుడో కాలం చెల్లిన తుపాకులతో సంతృప్తి పడవలసి వస్తోంది. మన తుపాకులు టెర్రరిస్టులు సరిహద్దు అవతలి నుంచి పొందుతున్న ఎకె - 47 లతో పోలిస్తే [illegible] వంతు శక్తి గలవి. ఈ విషయాన్ని పార్లమెంటులో లేవనెత్తిన వ్యక్తి అరుణ్‌సింగ్. ఆయన రాజీవ్ గాంధీ మంత్రి వర్గంలోనే రక్షణ మంత్రిగా పని చేశారు. హార్వర్డ్‌లో ఎన్నో నెలలో, రోజులో గడిపిన అనుభవంతో ఏ. చిదంబరం ఈ ప్రశ్నకు ఒక ఆశ్చర్యకరమైన సమాధానం ఇచ్చారు. ఆయుధాలు సంపాదించడంలో ప్రభుత్వానికి ఇబ్బందులు ఉన్నాయని ఆయన అన్నారు. ఆయుధాల కొనుగోళ్ళపై డబ్బును మంచినీళ్ళలా ఖర్చు పెట్టే ప్రభుత్వం నుంచి ఈ జవాబు వచ్చింది. ఆ ప్రభుత్వంలో సభ్యులు ప్రతి వ్యాపారం పైన ఎంతో కొంత ముడుపు పొందుతారు. వాళ్ళు అందరికీ ముడుపులతో వందలాది కోట్ల రూపాయలు ఖర్చు పెట్టి హెలికాప్టర్స్ కొంటారు గాని ఎకె -47 తుపాకులు కొనలేరు. బహుశా తన ఇంటి పెరట్లో ఏమి జరుగుతున్నదో చిదంబరంకు తెలియకపోయి ఉండాలి. లేదా ఏదో అనుమానాస్పదమైనది జరుగుతూ ఉండి ఉండాలి.

సర్వశక్తులూ వినియోగించి తీవ్రవాదులను మట్టు పెట్టాలనే విషయంలో ప్రభుత్వానికి శ్రద్ధ లేదని, ఎన్నికలు జరిగేవరకు ఈ సమస్యను అది సజీవంగానే ఉంచదలచుకున్నదని చాలా మందికి నిర్ధారణ అయింది. రాజీవ్‌గాంధీ అండ్ కంపెనీకి దేశం ఆరోగ్యంగా ఉండడం కన్న కాంగ్రెస్ (ఐ) ఆరోగ్యంగా ఉండడం పట్లనే ఎక్కువ శ్రద్ధ ఉన్నది. గత ఎన్నికలలో లాగనే ఈసారి ఎన్నికలలో కూడా రాజీవ్ గాంధీ అండ్ కంపెనీ సిక్కు సమస్య మీదనే ఎన్నికలలో పోటీ వేసి గెలుస్తుంది. అంత ఖచ్చితమైన రగులుకునే మంటల్లాంటి సమస్యలు చేతిలో ఉన్నప్పుడు అంతకంటే కావలసిందేమీ లేదు. నాకు ఏమనిపిస్తున్నదంటే ఎన్నికలు దగ్గర పడిన కొద్దీ పంజాబ్‌లో పరిస్థితి దిగజారుతుంది. ఎన్నికల సమయానికి మొత్తంగా ఒక రక్తపాత

( 21 వ పేజీ చూడండి)



# ఎంతో కాలంగా ఉత్తమత్వంలో తమకు గల గుర్తింపును హెచ్ ఎమ్ టి వెలుగు లోనికి తెస్తోంది

హెచ్. ఎమ్. టి గడియారాలకు, ట్రాక్టర్లకు, యంత్ర పరికరాలకు, సి.ఎన్.సి. యంత్రాలకు నాణ్యతలో ఖచ్చితత్వంలో గల అంతర్జాతీయ ఖ్యాతికి హెచ్. ఎమ్.టి బల్బులు మరియు ట్యూబులు ప్రతిబింబాలు.

హెచ్. ఎమ్. టి ల్యాంపులోని ప్రతి భాగమూ హెచ్. ఎమ్. టి వారే తయారు చేస్తారు. ఇవి 75 అతి కఠినమైన నాణ్యత పరీక్షలకు గురై మీ డబ్బుకు మరింత విలువ నిస్తాయి.

అందుకే, హెచ్. ఎమ్. టి బల్బులు మరియు ట్యూబులను ఎన్నుకోండి. అవి తమ పేరుకు తగ్గట్లు గా చిరకాలం మన్నుతాయి.




పటిష్ఠమైనవి. విశ్వసనీయమైనవి.







మీ జీవితంలో వెలుగు.

MAA COMMUNICATIONS/HMT/C1/TEL/88

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు : (1938-1972)

12.8.88; 19.8.88

శ్రీ విభవ నామ సం. ఆషాఢ అమావాస్య; శ్రావణ బ. సప్తమి

సంపుటము 80 : సంచికలు 51; 52

ముఖ్య సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు :

మతుకుమల్లి మాధవరావు

విడి ప్రతి వెల రు. 3.00

పోస్టులో 6 నెలల చందా రు. 87.10

పోస్టులో 12 నెలల చందా రు. 174.20

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
హీరో చిరంజీవి
ఫొటో - ప్రసాద్





## ఉత్తరాలు

### శుభాకాంక్షలు

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజెంట్లు, ప్రకటన కర్తలందరికీ స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలు —సం.

### సీరియల్స్

రాధ ముఖ చిత్రంతో వెలువడిన పత్రిక రమ్య మనోహరంగా వున్నది. "తమస్" సీరియల్ ముత్యాల్లో "ఆణిముత్యం"గా చాలా బాగుంది. రచయిత గార్కి మా అభినందన చందనాలు....

— సిహెచ్. సత్యనారాయణ, దేవి, పాలకొల్లు

★ ★ ★

రాధ ముఖచిత్రం సూపర్బ్‌గా వుంది. సీరియల్ "తమస్" ఈ వారం నుంచి ప్రారంభించి నందుకు మా ధన్యవాదాలు.

— ఎల్. వి. సుబ్బయ్య, వి. కళ, గూడూరు

★ ★ ★

17-6-88, 24-6-88 రాధ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో డా. భీష్మ. సాహనీ సంచలనాత్మక సీరియల్ నవల "తమస్"ను మాకు అర్థమయ్యేలా తెనుగు అనువాదం చేసిన డా. యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్ గారికి మా శుభాభివందనం.

— పెయ్యేటి చాముండేశ్వరి, కుటుంబ సభ్యులు, శ్రీకాకుళం

★ ★ ★

"తమస్" సీరియల్ ఆరంభంలో నే నన్నెంతగానో ఆకట్టుకుంది. సంచలనం కలిగించిన ఈ సీరియల్‌ని తెలుగులోకి అనువదించటం అద్భుతమైన ఆలోచన. యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్ గార్కి ధన్యవాదాలు.

"వినాయకరావు పెళ్ళి" సరదాగా, ఆసక్తిగా సాగుతోంది. ఈ వారం సంచికలో వినాయకరావూ, అతని తండ్రి డాంబికేశ్వర్రావుల మధ్య సంభాషణ హాస్యంగా సాగింది. మల్లాది గారికి అభినందనలు.

"పవిత్రపాపి" సీరియల్ అద్భుతంగా సాగుతోంది.

— పి. శ్రీధర్, సికింద్రాబాద్

★ ★ ★

చల్లా సుబ్రహ్మణ్యం "పవిత్ర పాపి" సీరియల్ చదువుతుంటే "రాకా" పాత్రలో మనల్ని మనమే ఊహించుకోవాలనే చక్కని అనుభూతిని కలిగిస్తున్నది.

— చోడవరపు విజయకుమార్, సికింద్రాబాదు

★ ★ ★

"చల్లా సుబ్రహ్మణ్యం" గారి సీరియల్ "పవిత్ర పాపి" చాలా సస్పెన్స్‌గా, థ్రిల్లింగ్‌గా, ఇంట్రస్టింగ్‌గా వుంది. — కె. సతీష్, పూనా

★ ★ ★

"పవిత్ర పాపి" చాలా ఇంట్రస్టింగ్‌గా ఉంది. రచయితకు మా ధన్యవాదాలు.

— జి. అను, పెంటపాడు

★ ★ ★

హరికిషన్ గారి కలం నుండి వెలువడుతున్న "ఆడపిల్లలు- అనుభవాలు" సీరియల్ ఎంతో సహజంగా వుండి మమ్మల్ని ఆహ్లాద పరుస్తోంది. క్రొత్త సంచిక ఎప్పుడు వస్తుందా అని ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తున్నాము.

— సి. ప్రతాప్, విశాఖపట్నం

★ ★ ★

"రాధ" ముఖచిత్రం రమణీయంగా ఉంది. మల్లాది గారి "వినాయకరావు పెళ్ళి" సీరియల్ కడుపుబ్బ నవ్విస్తోంది. క్రొత్త సీరియల్ "తమస్" అనువాదాన్ని అందించిన రచయిత యార్లగడ్డ గారికి నా అభినందనలు. "నిత్య నూతన" సీరియల్ "వేయిపడగలు" రియల్లీ సూపర్బ్.

— ఎస్. మహమ్మద్ రఫీ, కాశీబుగ్గ

# ఉత్తరాలు

## సీరియల్స్

చల్లా సుబ్రహ్మణ్యం గారి "పవిత్రపాపి" మొట్ట మొదటి నుంచి ఇప్పటి వరకు ఎంతో సూపర్బ్‌గా ఆకట్టు కుంది. "రాకా" పాత్ర చదువుతూ ఉంటే ఆ సీన్ కళ్ళ కెదురుగా ఉన్నట్టుంది. ప్రముఖ రచయిత చల్లా సుబ్రహ్మణ్యం గార్కి మా థాంక్స్.

– చింతపల్లి రవీంద్రబాబు,

సిహెచ్. రామజ్యోతి బసు, పొలమూరు

★ ★ ★

మా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించ బడుతూన్న సీరియల్ నవల "పవిత్రపాపి" అద్భుతంగా ఉంది. మొదటి నుంచి సస్పెన్స్‌తో కూడి చాలా ఉత్కంఠతతో సాగుతోంది. చదివిన కొలది యిక ముందు ముందు ఏం జరుగుతుందోనని ఆత్రుతగా ఉంది. రచయితకు మా హృదయపూర్వక ధన్యవాదములు.

– తొడుపునూరి శ్రీనివాస్, ఇతరులు, నిజామాబాద్

★ ★ ★

మా అభిమాన రచయిత శ్రీ చల్లా సుబ్రహ్మణ్యం గారి కలం నుంచి వెలువడుతున్న మరో పరిశోధనాత్మక నవల "పవిత్రపాపి" ఎంతో థ్రిల్లింగ్‌గా వుంటూ మమ్మల్ని ఎంతగానో ఆకట్టు కుంటున్నది. అడుగడుగునా పోలీసుల గుండెల్లో రాయిగా నిల్చిన "రాకా" ముందు ముందు ఎటువంటి సాహస కార్యాలను చేస్తాడో ఊహించ లేకుండా వున్నాము. ఇటువంటి చక్కని సీరియల్‌ను అందించిన రచయితకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియ జేసుకుంటున్నాను.

– సి. ప్రతాప్, విశాఖపట్నం

## కథలు

"రాధ" ముఖచిత్రంతో వెలువడిన మీ (మా) పత్రిక చాలా ఆకర్షణీయంగా ఉన్నది. "మనస్వి" కథ ఆలోచింప చేసేదిగా ఉంది. అరుణ పాత్రను రచయిత చక్కగా వర్ణించినారు.

– కె. వి. వి. రవికుమార్, మైలవరం

★ ★ ★

"వసపిట్ట" కథ చాలా బావుంది. మాకు చిన్నప్పటి పూర్వు అవి జ్ఞాపకం వచ్చి ఎంతో సంతోష మయినది. – వింజా వరలక్ష్మి, నాగపూరు

## శీర్షికలు

రాధ ముఖచిత్రంతో వెలువడిన సంచికలో "రాజ్‌కపూర్ జీవితంలోని వెలుగు నీడల"ను చూపుతూ వ్రాసిన వ్యాసం ఎంతగానో బాగుంది. సుమారు నాలుగు దశాబ్దాల క్రితమే రాజ్‌కపూర్ చిత్రం "బర్సాత్"పై ఆంధ్ర సచిత్ర వారపత్రిక సమీక్ష వ్రాస్తూ రాజ్‌కపూర్ భవిష్యత్తును ముందుగానే ఊహించి చెప్పగలగటం నిజంగా విస్మయం కలిగించింది. రాజ్‌కపూర్‌పై మీరు ప్రచురించిన ఈ వ్యాసం చదువు తూన్నంత సేపూ గతంలో ఆయన తీసిన మహత్తర చిత్రాలు మరోసారి కళ్ళ ముందు కమనీయంగా కదలాడిన అనుభూతి కలిగింది. రాజ్‌కపూర్ భౌతికంగా మన ముందు లేకపోయినా ఆయన నిర్మించిన కొన్ని చిత్రాలు ఆయనను చిరంజీవిని చేశాయి. ముఖేష్ గొంతుతో ఇంకా ఎక్కడి నుంచో, దూర దూర తీరాల నుంచి రాజ్‌కపూర్ "జిస్ దేశ్‌మె గంగా బహతీ హై" అని పాడుతూన్నట్లే అనిపిస్తోంది.

– వక్కలంక రామారావు, అనపర్తి

★ ★ ★

"రాధ" ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో "దాదాఫాల్కే అవార్డు గ్రహీత" "శ్రీ రాజ్‌కపూర్" గురించి వ్రాసిన వ్యాసం చాల బాగుంది. "క్రాంతి" గారికి మా కృతజ్ఞతలు.

– ప్రియాంక సువర్చల, మహబుబాబాద్

## ★గమనిక★

29-7-88; 5-8-88 సంచికలోని 8వ పేజీలో ఉన్న న్యూఢిల్లీ లేఖ తరువాయి భాగంలో 2వ కాలమ్‌లో ఉండవలసిన మొదటి రెండు పంక్తులు పొరపాటున ఆ కాలమ్‌లో 11, 12 లైన్లుగా పడ్డాయి. పాఠకులు గమనించగోరుతున్నాము. పొరపాటుకు చింతిస్తున్నాము.

–సం. ◼

సీరియల్






# మల్లాది వెంకటకృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

నాదకర్ణి మర్నాడు ఉదయం వచ్చాడు. కామేశ్వరరావు మర్నాడు బారెడు పొద్దెక్కాక కాని లేవలేదు. లేచాక అతనికి విపరీతమయిన నీరసం, అంతే ఆకలి, గత రోజు తిన్నదేమీ వంటబట్టక పోవడంతో....

అతని అనారోగ్యం గురించి తెలిసిన నాదకర్ణి "పైత్యం అయి వుంటుంది. రోజుకి పది లెమన్ టీలు తాగు తూంటాడు. వద్దంటే వినడు" అని కొట్టిపారేసాడు.

నాదకర్ణితో రహస్యంగా తనకీ పెళ్ళి ఇష్టం లేదని చెప్పే అవకాశం ఆ ఇంట్లో కామేశ్వరరావుకి లభించ లేదు. తను ఆదిలక్ష్మిని చేసుకుంటే ఆమె కాల్చుకుని మరణిస్తుందని, తర్వాత తనని పోలీసులు పట్టుకుని ఏడేళ్ళ శిక్ష పడేలా చేస్తారని చెప్పలేకపోయాడు అతను.

రమణమూర్తి కూడా ఎలా "నో" అనాలా అని సతమత మవుతున్నాడు. "నో" అంటే నాదకర్ణి మండి పడతాడు. తమ కుటుంబాల్లో ఆర్థికంగా సాంఘికంగా పైకి వచ్చిన వాళ్ళల్లో అతనొక్కడే. నిజానికి తన లాంటి మధ్య తరగతి వాడి కూతుర్ని తన కోడలుగా చేసుకునే కంటే, ఏ చిత్ర నిర్మాత కూతుర్నో చేసుకో వచ్చు. కాని అయనకి డబ్బుకాక, అనురాగం, ఆప్యాయతలే ముఖ్యం. 'ఈ పెళ్ళి వద్దు మిత్రమా' అంటే కోరి వైరం తెచ్చుకున్నట్లే. అలా అని చూస్తూ చూస్తూ తన కూతుర్ని ఓ ఎయిడ్స్ వ్యాధిగ్రస్తుడి కిచ్చి వివాహం జరిపించ లేడు. నిజం చెబితే కామేశ్వరరావు ఆఖరి రెండు సంవత్సరాలు సుఖంగా బ్రతక లేడు. రోజు రోజుకీ తను చావుకి దగ్గరవు తున్నానన్న భీతితో బ్రతికి చావాలి.

ఈ డ్రామా ఎలా ముగుస్తుందా అని వినాయకరావు ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు. ఆఫీసుకి వెళ్ళినాతను పని చేయలేనన్న భయంతో శెలవ పెట్టి ఆ రోజు ఇంట్లోనే వుండి పోయాడు.

ఆ రోజు ఆఫీసుకి వెళుతుంటే అడిగాడు వినాయకరావు.....

"రెండు పథకాలు ఓకే అయాయి. మరి మూడో పథకం మాటేమిటి? నాదకర్ణికి ఆదిలక్ష్మిని తన ఇంటి కోడలు చేసుకోకుండా వుండేలా చేయాలి కదా?"

శాస్త్రి చిన్నగా నవ్వి చెప్పాడు....

"ఇంత దాకా ఎప్పుడు అడుగుతావా అని చూస్తున్నాను. నీవు నాకు మంద్ర గబ్బ పార్టీ ఇస్తావా ఇవాళ ఈ పెళ్ళి రద్దయితే?"

"ఓ"

"అయితే నే సాయంత్రం వచ్చేసరికి తయారుగా వుండు."

* * * * * * *

శాస్త్రి ఆదిలక్ష్మి చేతికి ఓ గాజు గ్లాసు ఇచ్చాడు. దాన్నిండా పాలున్నాయి.

"నిన్న మీ దగ్గర అప్పు తీసుకున్న పాలు" చెప్పాడు.

"పాలకి అప్పేమిటో య్మరీను." చెప్పాడు నాదకర్ణి.

"నేను అద్దెకున్న వాళ్ళతో నిక్కచ్చిగా వుంటాను." చెప్పాడు రమణమూర్తి.

జరిగిన కథ 16 : ఆదిలక్ష్మి పెళ్ళి చెడగొట్టడానికి శాస్త్రి ఆలోచనలు చెపుతుంటాడు. కామేశానికి ఎయిడ్స్ ఉందని చెప్పాలనుకుంటారు కామేశంతో పెళ్ళయితే ఆత్మహత్య చేసుకుంటానని, ఆ నేరం కామేశం మీదికే వస్తుందని బెదిరిస్తుంది ఆదిలక్ష్మి. వినాయకరావు, శాస్త్రి పథకం ప్రకారం ఒక నకిలీ డాక్టరు ద్వారా కామేశ్వరరావుకి ఎయిడ్స్ ఉందేమోననే అనుమాన బీజాన్ని రమణమూర్తి మనసులో నాటుతారు. కనకమహాలక్ష్మి, ఆదిలక్ష్మి ఇచ్చిన కాఫీ ఫలహారాల వల్ల కామేశానికి వాంతులు, విరేచనాలయితే రమణమూర్తి అనుమానం మరింత బలపడుతుంది.

# వినాయకరావు పెళ్ళి

ఆదిలక్ష్మి గ్లాసులోని పాలని ఓ స్టీల్ గిన్నెలోకి వంచింది. గ్లాసు అడుగున అతికించిన తెల్ల కాగితం మీద ఏదో రాసి వుండటం చూసి గబగబ చదివింది. అది ఓ ఇంగ్లీషు గూఢచారి సినిమాలోని ట్రిక్ తప్ప శాస్త్రి స్వంత ఆలోచన కాదు.

అందులో రాసి వున్న చిన్న సందేశం చదివి ఆదిలక్ష్మి చిరునవ్వు నవ్వింది.

"ఏమిటే నీలో నీవు ఆ చిరునవ్వులు?" అడిగింది కనక మహాలక్ష్మి అది గమనించి.

"శాస్త్రి గారు మరో ఐడియా ఇచ్చారే అమ్మా" చెప్పింది తల్లికి.

ఆ సలహాని క్షణాల్లో పాటించింది.

డియర్,

నాకీ పెళ్ళి తప్పేట్లు లేదు. మా కామ్ బావ ఎలాగయినా సరే నన్నే చేసుకోవాలన్న పట్టుదల మీదున్నాడు. నేను పుట్టింటికి వచ్చినప్పుడల్లా మనం కలుసుకోవచ్చు.

నీ

ఆది

ఈ వాక్యాలని లేటెస్ట్ "సినిమా రంజని"లో ఎ. ఐ. పి. వాళ్ళ అండర్‌వేర్ ప్రకటనలో వున్న ఖాళీ తెల్ల కాగితం మీద రాసింది ఆ సినిమా వార పత్రికని నాదకర్ణి చూసేలా పట్టుకుని ఎదురింటి కుర్రాడిని పిలిచి చెప్పింది

"దీన్ని తీసుకెళ్ళి అద్దె షాపులో ఇచ్చిరారా"

"ఏవిటది?" అడిగాడు నాదకర్ణి సినిమా వాసనని పట్టేసి.

"ఏం లేదు" చెప్పింది.

ఆదిలక్ష్మి తడబాటుని సహజంగా అభినయించడంతో అది తెచ్చిపెట్టుకున్న నటన అని గ్రహించలేక పోయాడు చిత్ర దర్శకుడు నాదకర్ణి.

"సినిమారంజనిలా వుందే?"

"అవును. పాతది. మొదటి సంచికది." చెప్పింది.

"కాదు. చిరంజీవి బొమ్మ. లేటెస్ట్‌దిలా వుంది."

"కాదు. పాతది."

"చూసిస్తానంటే ఇవ్వవేమ్మా" మృదువుగా కోప్పడ్డాడు రమణమూర్తి కూతుర్ని.

విధిలేక ఇచ్చినట్లుగా ఇస్తూ చెప్పింది ఆదిలక్ష్మి.

"ఆలస్యం చేస్తే అద్దె షాపువాడు ఇంకో రోజుకి అద్దె కట్టమంటాడు."

నాదకర్ణి ఆ సినిమా పత్రికని అత్యంత శ్రద్ధగా చదవ సాగాడు.

"సుహాసిని సింగిల్ టేక్‌లో వరసగా పది షాట్స్ ఓకే చేయించిందిట. గుడ్. ష్ప్. కొందరు దర్శకులు "లైట్స్ ఆన్, ఫేన్స్ ఆఫ్" గానే మిగిలి పోతున్నారు. ఏడాదికి ఒకటో, రెండో సినిమాలు చేస్తారు. ఏవీ గుర్తుంచుకో దగ్గవి కావు..."

రకరకాల కామెంట్స్ చేస్తూ అందులోని వార్తలని, విశేషాలని చదవ సాగాడు నాదకర్ణి. ఓ పేజీ తిప్పాక అందులో రాసి వున్నది. ఎలాంటి కామెంట్స్ లేకుండా, నిశ్శబ్దంగా చదివాడు. అది ఎ. ఐ. పి. ప్రకటనలో తను రాసిందని గుర్తించింది ఆదిలక్ష్మి.

నాదకర్ణి ఆమె మొహం వంక పరిశీలనగా చూసాడు. తర్వాత చెప్పాడు.

"నేనూ సాయం వస్తాను. లైబ్రరీదాకా వెళ్ళొద్దాం పద."

ఆదిలక్ష్మితో నాదకర్ణి బయటకి వచ్చాక అడిగాడు.

"నీవు ప్రేమలో పడ్డావామ్మా? ఎవరతను?

"పొండి" సిగ్గుని అభినయించింది ఆదిలక్ష్మి.

"ఇలాంటివి దాచకూడదు. లేకపోతే నా సినిమా "అర్ధ మొగుడు"లోలా ట్రాజెడీ అవుతుంది.

"మీ రెందు కలా అనుకుంటున్నారు?" అడిగింది ఆదిలక్ష్మి.

"కామేశ్వరరావుని చేసుకోవాలని నీకు లేదనిపించి అడుగు తున్నాను."



"ఏమో?"

"ఈ డియర్ ఎవరు? అద్దె పుస్తకాలిచ్చే లైబ్రరీ అతనా? లేక మరొకరా?"

"అరె! ఇది చదివారా?" ఆశ్చర్యం అభినయించి అడిగింది.

"నా ప్రశ్నకి సమాధానం చెప్పు?"

"నా ఫ్రండ్‌కి రాసాను. మీ రనుకున్నట్లు లవర్ కాదు."

"కాదా? కాడా?"

"కాడు.... కాని ఈ సంగతి మీరు నాన్నకి చెప్తే "కాదు" అనే చెప్తాను. నీ సంగతి ఏం చేద్దాం .. బావకి నన్ను చేసుకోవాలని లేదు. నాన్నకి నన్ను కామేశం బావకి ఇవ్వాలని లేదు. అమ్మకి లేదు... నాకు లేదు. ఉన్నదంతా మీ కొక్కరికే."

తెల్లబోతూ చూసాడు నాదకర్ణి.

"మీరు నిశ్చితార్థం గురించి ఎలాంటి టాపిక్ తీసుకు రాకండి. మద్రాసు బయలు దేరండి. అక్కడికి వెళ్ళి నాకు వేరే సంబంధం చూడమని రాయండి నాన్న సరే నంటాడు. బావ ఏం అనుకోడు.



"ఈ సంగతులన్నీ నీ కెలా తెలుసు? నీ పెళ్ళి గురించి బావ, నీవు అప్పుడే మాట్లాడు కున్నారా?" ఆశ్చర్యంగా అడిగాడు నాదకర్ణి.

"నాకో కోయవాడు చెప్పాడు."

"కోయవాడా?"

"ఉత్తుత్తి కోయవాడు కాదు. అంబ అతని ద్వారా నిజాన్ని పలికించే కోయవాడు. దేవీ వుపాసకుడు. అన్నీ కరెక్టుగా చెప్పాడు."

అద్దె లైబ్రరీలో "సినిమారంజని" ఇచ్చేసాక నాదకర్ణి సిగరెట్ వెలిగించి చెప్పాడు.

"కాముణ్ణి వచ్చి నన్ను కలవమను."

ఆదిలక్ష్మి వంటరిగా ఇంటికి తిరిగి వెళ్ళి ఆ సంగతి కామేశ్వరరావుతో, తర్వాత తన తల్లితో చెప్పింది.

అరగంట తర్వాత తండ్రీ కొడుకు లిద్దరు ఇంటికి తిరిగి వచ్చారు. వాళ్ళేం మాట్లాడు కున్నారో ఎవరికీ అంతు పట్టలేదు. కాని ఇద్దరూ గంభీరంగా వున్నారు. "నేను మధ్యాహ్నం విజయవాడ వెళ్ళి, అక్కడ నించి మద్రాస్ వెళ్తున్నాను. కాముడు కూడా" చెప్పాడు నాదకర్ణి.

"అలాగే. ఒసేయ్! ఫరవాణ్ణం రాత్రికి కాదు. ఈ పూటే చెయ్యి" అరిచాడు రమణమూర్తి వంట గదిలోని భార్యకి వినపడేలా.

రమణమూర్తి తన కూతురు పెళ్ళి గురించి మాట్లాడతాడని ఎదురు చూసిన నాదకర్ణికి నిరాశే ఎదురైంది. మధ్యాహ్నం బస్‌కి బయల్దేరారు తండ్రీ కొడుకు లిద్దరు.

"నీ సినిమాకి పాస్ పంపించు" అనడం మినహా రమణమూర్తి కూడా గుంభనంగా, గంభీరంగా వున్న నాదకర్ణితో ఎక్కువ మాట్లాడ లేదు.

ఆటో లో ఎక్కాక చెప్పాడు నాదకర్ణి.

"మాట్లాడే దేమైనా వుందా?"

"లేదు."

"వెళ్లాక వుత్తరం రాస్తాను."

"అలాగే. జాగ్రత్తగా వెళ్ళండి."

"ఆ సంగతి మాకు తెలుసు."

ఆటో వెళ్ళి పోయాక తృప్తిగా నిట్టూర్చింది కనక మహాలక్ష్మి. తమ ప్లేన్ సక్సెస్ అయిందని గ్రహించింది ఆదిలక్ష్మి.

వినాయకరావు గదిలోంచి టేబిల్ మీద తబల వాయింపుడు వినబడటంతో అటు వైపు వింతగా చూసాడు రమణమూర్తి. ఆయనకు ఎంతో సంతోషంగా వుంది.

కనకమహాలక్ష్మి, వాళ్ళు వెళ్ళిన అరగంటకి చెప్పింది.

"మనమ్మాయికి వేరే సంబంధాలు చూడొచ్చు కదండి. ఆ కామేశం ఎంతో రోగిష్టిలా కనబడ్డాడు నా కళ్ళకి."

"నాకూ అలానే అనిపించాడు" చెప్పాడు రమణమూర్తి.

"మరీ ఆ కళ్ళు ఎంత లోతుకు పోయాయో చూసారా? ఏదో పెద్ద రోగమే అయి వుండాలి. ఏం వాంతులు? ఏం టాయిలెట్‌కి వెళ్ళడాలు? ఏం నిద్రలు? ఆ?!ఆదిలక్ష్మికి నేను సవత్తల్లి నయివుంటే కామేశానికే ఇచ్చి కట్ట బెట్టాలి అనేదాన్ని."

"వాళ్ళు పెళ్ళి విషయం ఏం తేలేదు. అంచేత నేనూ మాట్లాడ లేదు. మరీ మంచిదయింది" చెప్పాడాయన.

బస్సులో విజయవాడ వెళూ్త నాదకర్ణి, కామేశ్వరరావు కూడా ఆ విషయమే మాట్లాడు కున్నారు.

"క్లియర్ కట్‌గా మనిద్దరికీ అర్థం అయింది ఆదిలక్ష్మి అమాయకురాలు కాదని. రమణమూర్తికి తెలిసే వుండాలి ఆ ప్రేమ వ్యవహారం. లేకపోతే ముహూర్తం కోసం, నిశ్చితార్థం కోసం తొందర పడేవాడు" చెప్పాడు నాదకర్ణి.

మనం అర్థం చేసుకోలేక పోయాం కాని నాన్నా, నిశ్చితార్థానికి ఓసారి మెన్సెస్ అని తప్పించు కున్నారు. మరోసారి సరిగ్గా సమయానికి వంటికి జిడ్డంటించుకుని తప్పించు కుంది."

"పోన్లేరా. నిన్ను మందు పెట్టి చంపుదామని ప్రయత్నించింది. కాని ఆయుష్షుంది బ్రతికి బయట పడ్డావు. రేపు మీ పెళ్ళయ్యాక నిన్ను చంపడమో, తను చావడమో చేసి తీరుతుంది." చెప్పాడు నాదకర్ణి.

ఆ రాత్రి సరిగ్గా పన్నెరడుం పావుకి తూము మీద కూర్చుని వున్నారు ముగ్గురు. వాళ్ళు వరసగా శాస్త్రి, బిళహరి, వినాయకరావు. ఎప్పటిలా వినాయకరావు తాగలేదు. మిగతా ఇద్దరూ చెరో తేలున్నర తాగి వున్నారు. కొద్ది దూరంలో రిక్షా అతను వెయిట్ చేస్తున్నాడు. శాస్త్రి ఏడుస్తున్నాడు.

"నీకింక ప్లేన్‌లు అవసరం లేదు కాబట్టి రేపట్నించి బార్‌కి తీసుకు రావుకదూ?" అడిగాడు శాస్త్రి.

"అబ్బే! తప్పకుండా తీసుకొస్తాను."

"నాకు తెలుసు. నీవు తీసుకు రావులే." మళ్ళీ ఏడవసాగాడు శాస్త్రి.

"అబ్బ! ఏడవకురా" విసుక్కున్నాడు వినాయకరావు.

"అబద్ధాలాడకు. నీ దగ్గరున్న డబ్బంతా ఖర్చు చేయించేసాగా! ఇంకెలా బార్‌కి తీసుకు రాగలవ్?"

"అయ్యా! దబ్బున రిక్షా ఎక్కండి. పోలీసు లొస్తున్నారు" చెప్పాడు రిక్షావాడు.

దూరంగా చేతిలో లాఠీలతో బూట్లు టకటక లాడించు కుంటూ వస్తున్న ఇద్దరు పోలీస్ కానిస్టబుల్స్‌ని చూసి ముగ్గురూ తూము మించి దూకారు. కిందపడ్డ శాస్త్రిని రిక్షావాడు, వినాయకరావు కలసి రిక్షాలో కూర్చో పెట్టారు. రిక్షా బయలు దేరింది.

* * * * * * *

# నాటి పెళ్ళిముచ్చట్లు



## ఈమెని కాదు ఆమెని

పెళ్ళంటే నూరేళ్ళ పంట. ఆ పెళ్ళిలో జరిగిన ప్రతి సంఘటన జీవిత కాలమంతా గుర్తుంటుంది.

ముహూర్తం వేళ పురోహితుడు మంత్రాలు చదువుతూ ఏవేవో మామూలు తతంగాలు చేస్తున్నాడు. తదుపరి ఏవో మంత్రాలు, మాటలు పెళ్ళి కూతురు చేత అనిపించాడు. తరువాత నా వైపు తిరిగి, మనసా, వాచా, కర్మణా, ఈమెను జీవితాంతం నా భార్యగా స్వీకరిస్తున్నాను అనమన్నాడు. నేను సిగ్గుతో వధువు ముఖం చూడలేక తల వాలుగా తిప్పి పెళ్ళి కూతురుకు ఓ వైపుగా కూర్చున్న ఓ అమ్మాయిని చూస్తూ, ఆ మాటలు చెప్పాను. వెంటనే ఒకామె ఈమెని కాదయ్యా బాబూ ఆమెని' అంటూ వధువు వైపు చూపింది. దాంతో ఆ అమ్మాయి కంగారుగా లేచి నిల్చుంది. దాంతో అందరూ ఒక్కసారిగా గొల్లున నవ్వసాగారు. నేను సిగ్గుతో మరీ బిగదీసుకుపోయాను. ఈ సంఘటన గుర్తొచ్చినప్పుడల్లా హాయిగా నవ్వుకుంటాం

పల్లె వెంకటేశ్వరరావు,
హెచ్. ముత్యాలంపాడు(కృష్ణా)

★ ★ ★



## శ్రీవారి ఫోటో పోజు!

మా పెళ్ళిలో మా వారి ఫోటో పోజు గురించి చర్చించుకుంటూ మేము అప్పుడప్పుడూ నవ్వుకుంటుంటాము.

పెళ్ళితంతు పూర్తికావచ్చి మంగళ సూత్రధారణ సమయము. పురోహితుడు మంగళ సూత్రాన్ని మావారి చేతికిచ్చి నామెళ్ళో కట్టమన్నాడు. ఆయన మంగళ సూత్రంతో లేచి నా మెళ్ళో కట్టబోతున్నారు. అంతలో ఆగండాగండి అంటూ ఫోటోగ్రాఫర్ కెమెరా సరిజేసుకొని క్లిక్‌మనిపించాడు. ఫ్లాష్ వెలగలేదు. కెమెరాను అటూ ఇటూ తిప్పి మళ్ళీ ఫోటో తీశాడు. పని చేయలేదు. అప్పటికే కాస్త ఆలస్యమయింది. మావారు నా మెడ మీద చేతులుంచి అలాగే ఒంగున్నారు. ఇంకా ముళ్ళు వేయలేదు. కెమెరా పని చేయక పోవటంతో దాన్ని ఓపెన్ చేసి సరిజేసుకున్నాడు ఫోటోగ్రాఫర్. నేను ఓరగా చుట్టూ చూశాను. అందరి మొహాలూ నవ్వుతో విచ్చుకుంటున్నాయి. ఇక మావారి సంగతి చెప్పనే అవసరం లేదు. లేచి కాస్సేపు నిల్చుందామంటే మెళ్ళోని తాళిని ప్రక్కకు తీయాలి. పోనీ వదిలేసి కూచుందామంటే జారి క్రింద పడుతుంది. ముందే ఆయనకు సెంటిమెంట్సు ఎక్కువ. పాపం, ఆ ఫోజుతో అలా కొద్ది సేపు నిల్చిపోయారు. ఎలాగైతేనేమి ఫోటో తీసేశారు. ఇది జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా మేము నవ్వుకుంటాము.

ఓబుళరెడ్డిగారి లక్ష్మీదేవి,
తాడిపత్రి

---

నాదకర్ణి నించి నాలుగో రోజున మద్రాస్ నించి రమణమూర్తికి వుత్తరం వచ్చింది. కామేశ్వరరావుకి ఎన్నివిధాల చెప్పినా ఆదిలక్ష్మిని చేసుకోడానికి సుముఖంగా లేడని, ఏం అనుకోవద్దని, పెద్దవాళ్ళ మాటల్ని పిల్లలు ఖాతరు చేయని రోజులు వచ్చేసాయని, ఈ ఇతివృత్తం మీద ఓ సినిమా కూడా తీయాలనుకుంటున్నానని ఆ వుత్తరానికి "సినిమారంజని"లో ఆదిలక్ష్మి రాసిన "డియర్" వుత్తరం జత చేసాడు నాదకర్ణి.

"ఈ వుత్తరం ఏమిటమ్మా?" గద్దించాడాయన కూతుర్ని పిలిచి.

చిన్నగా నవ్వి చెప్పింది ఆదిలక్ష్మి–

"నా ఫ్రెండ్ కమల తెలుసుగా నాన్నగారూ... అదీ, నేను బెస్ట్ ఫ్రెండ్స్ చిన్నప్పట్నించి. పెళ్ళయ్యాక వేరే వూళ్ళకి వెళ్ళ కూడదని, ఈ వూళ్ళో వుద్యోగాలు చేసుకునే మొగుళ్ళనే చేసుకుంటే మంచిదని అనుకున్నాం. ఆ సందర్భంలో రాసిన వుత్తరం ఇది. నాదకర్ణి అపార్థం చేసుకున్నట్టున్నాడు. ఈ సంగతి రాస్తే బావ నన్ను చేసుకోడానికి వప్పుకోవచ్చు."

"అదా సంగతి. ఇంకెప్పుడూ ఫ్రెండ్స్‌కి ఇలాంటి వుత్తరాలు రాయక, నోటితో చెప్పు. అక్షరం ఒకోసారి బలి కోరుతుంది. ఆ కామేశం బావ ఆరోగ్యం తీరు నాకేం నచ్చలేదమ్మా. ఇంకో మంచి సంబంధం చూద్దామనుకుంటున్నాను" చెప్పాడు రమణమూర్తి.

"అదేమిటండి! చిన్నప్పట్నించి అనుకుంటున్న సంబంధం" చెప్పింది కనకమహాలక్ష్మి.

"అవును నాన్నగారు. మొగ పెళ్ళి వారు కాబట్టి వాళ్ళు బెట్టుగా రాసుంటారు. మనది ఆడపిల్ల సంబంధం కాబట్టి కాళ్ళావేళ్ళాపడాలి." చెప్పింది ఆదిలక్ష్మి కూడా.

"మంచి చెడ్డలు ఆడవాళ్ళు మీరేం చెప్పక్కర్లేదు. నాకు మీకన్నా బాగా తెలుసు. నోరు ముయ్యండి" అరిచాడాయన అసహనంగా.

మర్నాడు వుదయం వినాయకరావుకి చెప్పింది ఆదిలక్ష్మి ఆ శుభవార్త, నీళ్ళు పట్టడానికి వచ్చినప్పుడు.

"మనవి అదృష్ట జాతకాలు. అటు మీ సుబ్బల్ని, ఇటు మా కామేశం బావని తప్పించ గలిగాం. ఇక మీ నాన్నగారికి నేను నచ్చడమే తరువాయి."

ఈ విధంగా వినాయకరావు పెళ్ళికి వున్న అడ్డంకుల్లో రెండో అడ్డంకిని తొలగించ గలిగారు శాస్త్రి, వినాయకరావులు. త్వరలో నే వాళ్ళకి మూడో అడ్డంకి ఎదురైంది.

★★★★★★★

వినాయకరావుకి తండ్రి రాసిన వుత్తరం వచ్చింది. త్వరలో రమణమూర్తి తన దగ్గరకి వచ్చి పెళ్ళి సంబంధం గూర్చి మాట్లాడేలా చూడమని, సాంప్రదాయం ప్రకారం ఆయనే తనింటికి రావాలని రాసాడాయన. చాముండేశ్వరి కూడా తొందర పడుతోందని రాసాడు.

ఆ వుత్తరాన్ని వినాయకరావు శాస్త్రికి చూపించాడు. దాన్ని ఆదిలక్ష్మికి చూపించమని సలహా ఇచ్చాడు శాస్త్రి. ఆ ప్రకారం దాన్ని ఆదిలక్ష్మికి చూపిస్తే ఆమె, దాన్ని తన తల్లికి చూపించమని కోరింది.

కనకమహాలక్ష్మి ఆ వుత్తరం చదివింది.

"నేను మీ వారితో చెప్పనాండి నాకు ఆదిలక్ష్మిని చేసుకోవాలని వుందని?" అడిగాడు వినాయకరావు.

"వద్దు. మీ ప్రేమ గురించి ఆయనకి తెలీనే కూడదు. ప్రేమ వివాహం అంటే కస్సుమంటూ ఇంతెత్తున లేస్తారాయన. సమయం చూసి నేనే చెప్తాను."

"మా ఇంటి ఎడ్రస్ ఇస్తాను. వారు వెళ్ళాలనుకున్నప్పుడు అడగండి."

"శుభస్య శీఘ్రం. ఈ రాత్రే మాట్లాడతాను" చెప్పింది కనకమహాలక్ష్మి.

ఆ రాత్రి కనకమహాలక్ష్మి భోజనాలయ్యాక తమలపాకులని చిలకలగా చుట్టి అలవాటుగా భర్తకి అందిస్తూ అడిగింది–

"అమ్మాయి సంగతి ఏం ఆలోచించారు?"

"సంబంధాలు చూడాలి. మంచి రోజు చూసి ప్రారంభిద్దామని ఆగాను. నీకో

రహస్యం తెలుసా?"

"ఏమిటి?"

"మీ ఆడవాళ్ళ నోట్లో నువ్వుగింజ దాగదు. ఎవరితో చెప్పవుగా?"

"ఊహు. మీ మీద వట్టు."

"మన కామేశానికి ఎయిడ్స్ వ్యాధి."

వస్తున్న నవ్వుని బలవంతంగా ఆపుకుంది కనకమహాలక్ష్మి.

"అలాగాండీ?" అమాయకత్వం నటిస్తూ అడిగింది.

"అందుకనే ఈ సంబంధం వద్దను కున్నది. ఆ సినిమా పత్రికలో తన ఫ్రండ్‌కి లెటర్ రాసి అమ్మాయి మంచి పనే చేసింది ఒక విధంగా. అది ఏ ప్రియుడికో రాసిందను కున్నాడు నాదకర్ణి."

"పోనీ లెండి. అన్నీ మన మంచికే అని వూరికే అనలేదు. మనింట్లో అద్దెకున్న వినాయకరావు ఆదిలక్ష్మికి సరయిన జోడు కాదంటారా?" అడిగింది ఆవిడ.

"వినాయకమా? నీకేమయినా మతి పోయిందా?"

"ఇందులో మతి పోవడం ఏముంది?"

"లేకపోతే? వాణ్ణి ఇల్లు ఎలా ఖాళీ చేయించాలా అని నేనాలోచిస్తుంటే నీవు ఏకంగా ఇంటల్లుడిగా చేయాలను కుంటున్నావా?"

"మంచివాడే కదండి"

"ఇదే నోటితో నువెన్నిసార్లు తిట్టలేదు గనక. అన్నీ మర్చిపోయి మాట్లాడుతున్నావు"

"ఏదో కుర్రతనం. ఎల్. ఐ. సి. లో ఉద్యోగం. బోలెడు జీతం. ఎలాంటి చెడ్డ అలవాట్లు లేవు"

"అన్నీ మన మంచికే అని వూరికే అనలేదని ఇందాకన్నావు. ఈ విషయంలో మాత్రం నేనొప్పుకోను. వాడి కాళ్ళు కడిగా నేను కన్యాదానం చేసేది? కల్ల" కోపంగా చెప్పాడు రమణమూర్తి.

"మీరలా అంటే ఇంక నేనేం మాట్లాడలేను"

"మాట్లాడక. అది మంచిది" కసిరాడాయన చిరాగ్గా.

★★ ★★ ★★ ★★

అక్కడ షణ్ముగరావు కాళ్ళకి బలపాలు కట్టుకుని తన కూతురు పెళ్ళి కోసం విశ్వ ప్రయత్నాలు చేస్తున్నాడు. ఎక్కడ సంబంధం వుందన్నా పరిగెడుతున్నాడు. పెళ్ళికొడుకు మంచి చెడ్డలు వాకబు చేస్తున్నాడు.

ఎలాగైన సరే వినాయకరావుకన్నా ముందే తన కూతురు పెళ్ళి చేయాలని గట్టి పట్టుదలతో వున్నాడాయన. అలా చేస్తే, శుభలేఖ పంపుతే, రత్నం తెలిగ్గా చలామణి అవుతుంది. బొగ్గు అనుకున్నారు కాని యీ సుబ్బులు మాణిక్యం' అని వుత్తరంలో వినాయకరావుకి, ముఖ్యంగా అతని తండ్రి డాంబికేశ్వరరావుకి రాయచ్చు. ఆ విధంగా రాస్తే దెబ్బ కొట్టినట్లుగా ఫీలవుతారు, చాముండేశ్వరి, డాంబికేశ్వరరావు.

దాదాపు ఏభైమూడు సంబంధాలు చూసాడు. అందులో పధ్నాలుగు సెలెక్ట్ చేసాడు. ఎనిమిదిమంది వచ్చి సుబ్బలక్ష్మిని చూసారు.

అందులో ముగ్గురు సుబ్బలక్ష్మి నచ్చిందన్నారు. ఒకరు కట్నం, సుబ్బలక్ష్మి రెండూ నచ్చిందన్నారు. కాని సుబ్బలక్ష్మికి ఆ అబ్బాయి నచ్చలేదంది. దాంతో మళ్ళీ షణ్ముగరావు దేశం మీద పడ్డాడు.

మరో నెల రోజుల్లో ఎలాగయినా సుబ్బలక్ష్మి వివాహం చేయాలన్న దీక్షతో వున్నాడాయన.

★★ ★★ ★★

ఆదిలక్ష్మి వివాహానికి సంబంధించిన కనకమహాలక్ష్మి, రమణమూర్తుల సంభాషణ సారాంశం పూర్తిగా తెలుసుకున్నాక శాస్త్రితో చెప్పాడు వినాయకరావు ఆ సంగతులు చెప్పి.

"నువు రెండు అద్భుత విషయాలు సాధించావు. ఇప్పుడు నివు సాధించవలసిన అసలయిన అద్భుత విషయం మరోటుంది"

"రమణమూర్తి నీకు తన కూతుర్నిచ్చి వివాహం జరప సమ్మతించేలా చేయడమా మిత్రమా?"

"కరెక్ట్‌గా అక్షరాలా అదే గురు"

"మొన్న రాత్రి ఓ తేలు పార్టీ ఇప్పించరా అంటే నువ్వేమన్నావ్? రుద్రవీణలో చిరంజీవిలా అదే దేకల్లో.. సారాయిలా ఎ. ఎ తప్పు' అన్నావ్. నిన్నేమన్నావ్? గాంధీమహాత్ముడిలా 'తేలుమానండోయ్'లాంటి పాటొకటి పాడావ్. నా అవసరం తీరిపోయిందనే నువ్వీ దుస్సాహసానికి పడిగట్టావ్. ఇప్పుడు నీకు నేను సహాయం చేయటమా? కల్ల"

"తేలు కాదు. పాము పార్టీయే ఇస్తా కాని మా ఇద్దరి వివాహం అయేలా చూడు గురూ. జీవితాంతం......"

".... ఎవరయినా సరే నాకు రుణపడి వుండటం నాకెంత మాత్రం నచ్చదు. అయినాసరే ఇప్పుడే ప్రయత్నం చేస్తాను".

"ఎలా!"

"చూడు".

గదిలోంచి శాస్త్రి బయటికి వచ్చి రమణమూర్తి పోర్షన్ బయట ఆగి గట్టిగా పిల్చాడు.

"రమణమూర్తిగారు".

రెండుసార్లు పిలిచాక ఆదిలక్ష్మి బయటకి వచ్చి అడిగింది అతన్ని.

"ఏం కావాలండి?"

"మీ నాన్నగారితో పర్సనల్‌గా మాట్లాడాలి. పిలుస్తారా?"

"ఆయన బయటకి వచ్చి అడిగాడు

"అద్దిచ్చారుగా. ఇంకేమిటి మాట్లాడేది?"

"మీ అమ్మాయి పెళ్ళి కెదిగి వుంది. పెళ్ళి చేద్దామని మీరు కూడా అనుకుంటున్నారు. మా రూమ్‌మేట్ చిరంజీవి వినాయకరావు కూడా పెళ్ళికెదిగి వున్నాడు. వుభయులకీ వివాహం చేస్తే ఎలా వుంటుంది అన్న ఆలోచన రాగానే మిమ్మల్ని బయటికి పిలిచాను. ఏమంటారు?" అడిగాడు శాస్త్రి.

రమణమూర్తి మొహంలో చక చక ఎరుపు, నలుపు, తెలుపు, ఆకుపచ్చ, ముదురాకుపచ్చ, లేతాకు పచ్చ, చిలుకాకుపచ్చ రంగులు మారాయి. కొడదామని చెయ్యెత్తి కూడా ఆయన తమాయించుకుని చెప్పాడు.

"కొట్టానంటేనా? మర్డర్ కేసులో ఇరుక్కోకూడదని వదిలేస్తున్నాను".

అదే ఆయన చెప్పిన సమాధానం. చెప్పి గిరుక్కున తిరిగి మళ్ళీ ఇంట్లోకి వెళ్ళిపోయాడు. ఆదిలక్ష్మి జాలిగా చూసింది శాస్త్రి వంక. శాస్త్రి వంక వింతగా చూసాడు పూజారి శతభిషం. శాస్త్రి దగ్గరికి వచ్చి చెప్పాడాయన.

"పెళ్ళి సంబంధం మాట్లాడడానికి కొంత వయస్సు, కొంత అనుభవం, కొంత లౌక్యం అవసరమయ్యా. అలా తలుపు తట్టి బయటికి పిలిచి "కట్నీ, కొట్నీ, తెచ్చె" అన్నట్లుటయ్యా అడిగేది" మందలించాడు.






ఇతర బంధువులు తిని పోయేవారే! లేమితో బాధపడుతున్నప్పుడు వారు తప్పుకుంటారు. తలిదండ్రులు, సోదరులు, భార్యా పుత్రులు, మిత్రులు మాత్రమే చెప్పుకోదగిన బంధువులు. కొన్ని సందర్భాలలో. అంటే ఉద్యోగ రీత్యా గాని, కారణాంతరాల వల్ల గాని తాను తన ఆప్తబంధువులను విడిచి దూరప్రాంతాలలో ఉండ వలసి రావచ్చును. అప్పుడు వారిని విడిచి వెళ్ళడమూ తనకు కష్టమే. తన్ను విడిచి వారూ ఉండ లేక పోవచ్చును. కఠిన హృదయులకూ, దుష్ట వృత్తి కలవారికి ఈ బంధువులతో నిమిత్తం లేదు. కాని సహృదయులకూ, మెత్తని మనస్సు కలవారికీ, బంధువులవసరమే! ఎప్పుడూ తమ్ము విడువకుండా ఉండే బంధువులూ ఉన్నారు. వారు కంటికి కానరారు. ఎల్లప్పుడును విడిచి పోకుండా ఉండే ఆ బంధువులు సత్యం, జ్ఞానం, ధర్మం మొదలైనవే. కాని వేరుకావు. ఇవి ఉత్తమునియందు కాన వచ్చే గుణాలు.

ఒక ఉత్తముడిలా అనుకుంటాడు–

"సత్యం మాతా పితా జ్ఞానం
ధర్మో భ్రాతా సుతో దయా,
శాంతిః పత్నీ క్షమా మిత్రం
షడేతే మమ బాంధవాః."

నశ్వరమైన సంసారం పట్ల విరక్తి చెందిన తత్వజ్ఞుడే యీ విధంగా భావిస్తాడు.

"నాకు సత్యమే తల్లి. జ్ఞానమే తండ్రి. ధర్మమే సోదరుడు. దయయే కుమారుడు. శాంత గుణమే భార్య. ఓర్పే మిత్రుడు. ఈ ఆరుగురూ నా బంధువులు" అని దీని అర్థం. ఈ పోలికలు చాలా యుక్తంగానే కానవస్తాయి. నిజం చెప్తే తల్లి తప్పు చేసిన పుత్రుణ్ణి క్షమించి మంచి మార్గంతో పెడుతుంది. తండ్రి విద్యాబుద్ధులు నేర్పి జ్ఞానం కలుగ జేస్తాడు. సోదరుడు, తప్పుదారిని పట్టిన అన్నదమ్ముల్ని న్యాయ మార్గాన నడిపిస్తాడు. కుమారుని పయి దయ ఉండడం సహజం. భర్త కోపించినా, శాంతం వహించి సర్దుకొని పోవడం భార్య స్వభావం. తాను మిత్రుని నిందించినా, అతడు ఓరిమితో ఉంటాడు.

–బులుసు వేంకటరమణయ్య

"అదన్నమాట" చెప్పాడు శాస్త్రి గుమ్మంలో నిలబడి బిత్తరపోతూ చూస్తున్న వినాయకరావుకి.

"నిన్నెవరెళ్ళి అడగమన్నారు" అరిచాడు వినాయకరావు.

"ఆయన మనసులో ఏం వుందో తెలుసుకుందామని వెళ్ళాను. తెలుసుకున్నాను. పెళ్ళి సంబంధాలు చెడగొట్టే ఆలోచనలు నాకు తెలుసు కాని, కుదిర్చి కలిపేవి తెలియవు"

"ఇవాళ సాయంత్రం బార్‌కి వెళదాం. తెల్లవారు ఝామున నీకే తడుతుంది" చెప్పాడు వినాయకరావు.

"ఆ ముక్క ముందే చెప్పేడవచ్చుగా" చెప్పాడు శాస్త్రి ప్రసన్న వదనంతో.

"ఈ రాత్రి నాకు సరయిన ఆలోచన రాలేదనుకో రేపు, లేదా ఎల్లుండి". చెప్పాడు వినాయకరావు దీనంగా.

"డోంట్ వర్రీ". అతని భుజం తట్టాడు శాస్త్రి దర్పంగా.

** ** **

ఆ రోజు సాయంత్రం వినాయకరావు, ఆదిలక్ష్మి కళాభవన్‌లోని కోడిగుడ్ల మీద బొమ్మల ఎగ్జిబిషన్‌లో కలుసుకున్నారు. ముందు అనుకున్న ప్రకారం.

"విన్నారుగా" చెప్పింది ఆదిలక్ష్మి.

"విన్నాను. మీ నాన్నగారు చెయ్యిత్తడం కూడా చూసాను" చెప్పాడు వినాయకరావు".

"మరెలా" అడిగింది.

"రెండే మార్గాలు. ఒకటి మి నాన్నగారు, మా నాన్నగారు ఒక అంగీకారానికి వచ్చి మన పెళ్ళి చేయడం".

"రెండు?"

"రెండు. వాళ్ళతో సంబంధం లేకుండా మన పెళ్ళి మనమే శాస్త్రి ఆధ్వర్యంలో, శతభిషంలాంటి పెద్దల సమక్షంలో చేసుకోవడం".

"ఇంట్లోంచి వచ్చేసా?"

"తప్పదు".

"మొదటి పద్ధతికే ప్రయత్నిద్దాం, అదే సరయిన పద్ధతి కాబట్టి. అది కుదరకపోతే అప్పుడే రెండో పద్ధతి గురించి ఆలోచించచ్చు".

"శాస్త్రి అన్నట్టు ఇద్దర్ని వేరు చేయడం తేలికగాని కలపం పరమ కష్టం".

"దారిలేని గమ్యమే వుండదీ లోకంలో" చెప్పింది ఆదిలక్ష్మి.

"ఐ షల్ ట్రై మై లెవెల్ బెస్ట్..... నాకు నేను ధైర్యం చెప్పుకోవాలనుకున్నప్పుడే ఇంగ్లీషు వుపయోగిస్తుంటాను".

చిన్నగా నవ్వింది ఆదిలక్ష్మి.

"ఆ బొమ్మ చూడండి" చెప్పింది.

ఓ కోడి గుడ్డు మీద రకరకాల గీతలున్నాయి.

"అదేం బొమ్మయి వుండవచ్చు" అడిగింది.

"కోడిగుడ్డు కుండే ఈకలు" సమాధానం చెప్పాడు. వెనకనుంచి వాళ్ళ మాటలు విన్న ఆ కోడిగుడ్డు ఆర్టిస్ట్.

(ఇంకా ఉంది)




# దేవుడు

కప్పగంతుల మల్లికార్జునరావు

"నువ్వు నా వెంట రా డ్రయివర్. నేను సౌంజ్ఞ చేస్తే తప్ప నా ఐడెంటిటీ ఎవరికీ చెప్పవద్దు" డ్రయివర్‌ని ఆదేశించి జిల్లా కలెక్టర్ జిల్లా హెడ్ క్వార్టర్స్ హాస్పటల్ లోకి అడుగు పెట్టింది.

ఆమె ఆ జిల్లాకు బదిలీ అయివచ్చి యింకా నెల నిండలేదు.

వచ్చీరాగానే జిల్లా హెడ్ క్వార్టర్స్ హాస్పటల్‌లో జరుగుతున్న దారుణాలను గురించిన పిటీషన్లను అందుకొంది. ఎప్పుడో సర్‌ప్రయిజ్ విజిట్ చేద్దామనుకొంటూండగా యీ అవసరం వచ్చింది.

నిన్న మధ్యాహ్నం ఆర్టీసీ బస్సుకు ఘోర ప్రమాదం జరిగింది. అయిదుగురు అక్కడికక్కడనే మరణించారు. మరెందరికో గాయాలు తగిలి హాస్పటల్‌లో వున్నారు.

ప్రమాదం జరిగిన సమయంలో జిల్లా కలెక్టర్ హైదరాబాద్‌లో అఫీషియల్ డ్యూటీ మీద వుంది. వార్త తెలియగానే బయలుదేరి వచ్చింది. రాగానే హాస్పటల్ సూపరింటెండెంట్ గారికి ఫోను చేసింది. నో రెస్పాన్స్.

దాంతో ఆమె తన విజిట్‌ను సర్‌ప్రయిజ్ విజిట్‌గా మార్చింది.

ఆమె నేరుగా హాస్పటల్ సూపరింటెండెంట్ గది వద్ద కెళ్ళింది.

ఆయన గదిలో లేరు. ఆయన గది ముందు కుర్చీలో కూర్చొని సిగరెట్ తాగుతూ ప్యూను వున్నాడు. సూపరింటెండెంట్ గారిని గురించిన ప్రశ్నలడిగిం దామె. ప్యూను చాలా రెక్‌లెస్‌గా, మొరటుగా సమాధానాలిచ్చాడు.

"సూపరింటెండెంట్ గారితో నీ కెందుకమ్మా. నీక్కావల్సిన పనేమిటో చెప్పు. చెల్లించాల్సిన "మంత్ర పుష్పం" చెల్లించు. నీ పని అయిపోతుంది. "మంత్ర పుష్పం" నా కనుకొనేరు. సూపరింటెండెంట్ గారికే చేరుతుంది."

ఆమె అక్కడి నుంచి బస్సు ప్రమాదం పేషెంట్స్ వున్న వార్డుకు వెళ్ళింది. మూలుగులు.... ఏడుపులు.... అరుపులు.... రోదనలు.... ఆ పేషెంట్స్ అతీగతీ పట్టించుకొనే నాధుడు లేడక్కడ.

వార్డంతా గలీజుగా వుంది. శుభ్రత ఎక్కడా కన్పించ లేదు.

ఆమె వార్డులోకి వెళ్ళబోతుంటే సైంధవుడిలా వో తోటీ అడ్డం పడ్డాడు. వాడిని తప్పించుకొని పేషెంట్స్ దగ్గరి కెళ్ళింది.

"డాక్టర్ నేనీ బాధ భరించ లేను. నా కింత విష మిచ్చి చంపెయ్యండి. ప్లీజ్ డాక్టర్.... సిస్టర్...." హాస్పటల్ అదిరిపోయేలా వో పదహారేళ్ల అమ్మాయి రోదిస్తోంది. ఆ అమ్మాయి పేరు జయంతి.

కలెక్టర్ ఆ అమ్మాయి వద్ద కెళ్ళి వోదార్చింది. ట్రీట్‌మెంట్ వివరాలు అడుగుతోంది.

"ఎవరమ్మా నువ్వు. పర్మిషన్ లేకుండా పేషెంట్స్ దగ్గరి కెళ్ళటమేనా? యిదేం ధర్మసత్ర మనుకున్నావా? బయటి కెళ్ళు ముందు. డాక్టర్ గారు వస్తున్నారు" వొక సిస్టర్ రాక్షసిలా అరుస్తూ వచ్చింది. మరి కాస్సేపట్లో డాక్టర్ కూడా వచ్చాడు.

"ఏయ్ అమ్మాయ్! ఎందుకలా రంకె లేస్తావు? ఆర్టీసీ బస్సెక్కి నువ్వు కాళ్ళు చేతులు విరగ్గొట్టుకొని వస్తే నేనేం చెయ్యను" బంకపూసి అతకటానికి అదేం కాగితమా? నోరు మూసుకో" కటుకుగా అన్నాడు డాక్టర్.

"నా కింత విష మిచ్చి చంపెయ్యండి డాక్టర్! ప్లీజ్..."

"మేం చంపట మెందుకు? నువ్వే చస్తావు. కాస్త వోపిక పట్టు."

ఎంత అమానుషం? కలెక్టర్ కళ్ళ ముందు ఏవో దృశ్యాలు....

* * * * * * * * *

రైలు ఏదో స్టేషన్‌లో ఆగింది.

"ఇంటర్ పరీక్షా ఫలితాలు" పేపర్ వాళ్ళు అరుస్తుంటే హారిణి లేచి పేపరు కొని ఆత్రంగా చూచింది. ఫస్ట్‌క్లాస్.... శకండ్ క్లాస్.... కనీసం ఆర్డినరీ పాస్ లిస్ట్‌లో కూడా ఆమె నెంబరు లేదు.

హైదరాబాద్‌లో వున్న మేనమామ గారింటికి శలవుల కెళ్ళి యింటికి తిరిగి వస్తున్న దామె. తనకు ఫస్ట్ క్లాస్ వస్తుందని తనే కాదు- కాలేజీలో లెక్చరర్లు, స్నేహితురాళ్ళు, తలిదండ్రులు అంతా అనుకొన్నదే.



యిప్పుడు వారందరికీ మొహం ఎలా చూపించాలి?

"ఏమ్మా! పరీక్ష ఫెయి లయ్యావా? దిగులు పడకు. సెప్టంబర్‌కు బాగా చదువు" పక్క సీటు ఆమె సానుభూతి ప్రకటించింది.

అంటే ఫెయిల్ కళ తన మొహంలోనే కన్పిస్తున్నదన్న మాట!

ఆమె పేపరంతా మరోసారి గాలించి చూచింది. ఊహూ....

పేపర్ని విసిరి పారేసింది– కిటికీలో గుండా.

రైలు పక్క స్టేషన్‌లో ఆగగానే దిగింది. ఆమె దిగాల్సిన స్టేషన్ యింక గంటకు కాని రాదు.

ప్లాట్‌ఫారమ్ చివరిదాకా నడిచి అక్కడి నుంచి రైలు పట్టాల మధ్య నడవ సాగింది. నడుస్తూ నిర్ణయానికి వచ్చింది.

నో. పరీక్ష ఫెయిలయిన తన మొహాన్ని అందరికీ చూప లేదు. ఆ అవమానాల్ని భరించలేను.

ఎదురుగ్గా రైలు రావటం ఆమె గుర్తించింది. అయినా ఆమె అలా మధ్యగా నడుస్తూనే వుంది.

రైలు మరీ దగ్గరికి వస్తుంటే భయపడటం మాత్రం ఆమెకు గుర్తుంది. ఆ తర్వాత మళ్ళీ కళ్ళు తెర్చేసరికి హాస్పిటల్‌లో మంచం మీద వుంది.

శరీర మంతా ఎవరో కొరికేస్తున్నట్లు, బల్లేలతో పొడుస్తున్నట్లు బాధ–

"అమ్మా.... అబ్బా.... నేనీ బాధ భరించ లేను. సిస్టర్, నన్నెందుకు బతికించారు?చంపెయ్యండి. సిస్టర్...." జరిగిందంతా గుర్తు చేసుకొంటూ అందామె రోదిస్తూ.

సిస్టర్ వెంటనే డాక్టర్‌కి కబురు చేసింది. హరిణి దగ్గర కూర్చొని ఆప్యాయంగా కబుర్లు చెప్పింది. యింతలో డాక్టర్ వచ్చాడు. నవ్వుతూ ప్రసన్నంగా వున్న ఆయన మొహాన్ని చూడగానే ఆమె మనసు కొంత శాంతించింది.

"చావటం ఎంత సేపమ్మా? క్షణం పట్టదు. బ్రతకటమే ప్రయోజకత్వం. నీకో శుభవార్త చెప్పనా? నువ్వు ఇంటర్ పాసయ్యావు. ఎలాగో తెల్సా? మామూలుగా కాదు. డిస్టింగ్‌షన్‌లో. టాప్ రేంక్ వచ్చిన పది మందిలో నువ్వు కూడా వున్నావు. నీ రిజల్టు ప్రకటించటంలో పొరపాటు జరిగిందిట. మర్నాడు సరిదిద్దుకొని పేపర్లో ప్రత్యేకంగా బాక్స్ కట్టి వేసేరు. యిదిగో చూడు."

ఆమె బాధ క్షణంలో మాయ మయినట్లయింది.

వెంటనే లేచి వెళ్ళి ఆ వార్తను తలితండ్రులతో, స్నేహితురాళ్లతో, లెక్చరర్లతో చెప్పా లన్నంత ఉత్సాహం వచ్చింది. మంచం మీది నుంచి లేవబోయింది. కానీ.... కానీ....

అప్పుడు గ్రహించిం దామె– తన శరీర అంగాలకు లోపం ఏర్పడినట్లు.

"థాంక్యూ డాక్టర్.... నా కిప్పుడు ఆన[illegible]గా

వుంది. మంచం మీద నుంచి లేచి గంతు లేయాలని వుంది. నేను డిస్టింక్షన్‌తో పాసయ్యానని అందరికీ చెప్పాలని వుంది. మంచం మీద నుంచి నేను లేచేలా చెయ్యరా డాక్టర్! ప్లీజ్...."

"అలాగేనమ్మా. నువ్వు లేచి గంతు లేసేలా చేస్తాను గదా? కానీ యిప్పుడా అవసరం లేదు. ఎందుకంటే నీ ఘన విజయం అందరికీ తెల్సు. నీ ఫాదర్, మదర్, ఫ్రెండ్స్, లెక్చరర్స్, యింకా ఎందరో ప్రముఖులు నీ దగ్గరికే వచ్చి చూచి వెళ్లారు. తెల్సా?"

"అంటే....?"

"అవునమ్మా. నీకు ఏక్సిడెంటయి పది రోజు లయింది. యీ పది రోజులుగా నువ్వు మృత్యువుతో పోరాడి జయించావు."

"నా కసలు దెబ్బ లెక్కడ తగిలేయి డాక్టర్. ఏమయింది?"

"ఏం కాలేదమ్మా. యూ విల్ బి ఆల్‌రైట్. మీ నాన్న గారు మరి కాస్సేపట్లో వస్తారు. అప్పటి దాకా విశ్రాంతిగా పడుకోమ్మా" అంటూ డాక్టర్ ఆమెకు యింజక్షన్ యిచ్చాడు.

ఆమె మగతగా నిద్రలోకి జారుకొంది.

* * * * * * *

"డాక్టర్! పేషెంట్స్‌తో మాట్లాడే విధానం అదేనా? వౌ క్రూయల్ యు ఆర్?" జిల్లా కలెక్టర్ అంది.

"షటప్. హు ఆర్ యు? ఐసే– హు ఆర్ యు టు టెల్‌మి. గెటవుట్."

కలెక్టర్ డ్రయివర్ వైపు చూచింది.

"వారు యీ జిల్లా కలెక్టర్ గారు. ప్రమాదంలో చనిపోయిన వారిని, గాయాలు తగిలిన వారిని చూడటానికి వచ్చారు." డ్రయివర్ ప్రకటించాడు.

హాస్పిటల్ స్టాఫ్ నెత్తిన పిడుగు పడ్డట్లయింది. ఒక్క క్షణం డాక్టర్, సిస్టర్ అపస్మారక స్థితిలోకి వెళ్లారు. అంతలో తేరుకొన్నారు.

"సారీ మేడమ్. ప్లీజ్ ఎక్స్‌క్యూజ్‌మి" సిస్టర్ ఆమె కాళ్ల మీద పడింది.

వొక్క నిముషంలో కలెక్టర్ విజిట్ విషయం హాస్పిటల్‌లో అందరికీ తెల్సింది. అంతా ఆ వార్డుకు పరుగులు మీద వచ్చారు. హాస్పిటల్ సూపరింటిండెంట్ కోసం ఫోన్లు.... ప్రత్యేక మెసెంజర్లు....

ఆయన పది నిముషాల్లో వచ్చారు. అపాలజీస్ చెప్పసాగేరు.

"దట్సాల్ రైట్ సర్. పాస్ట్ యీజ్ పాస్ట్. మీ స్టాఫ్‌నంతా వారి వారి డ్యూటీలకు వెళ్లమనండి ముందు. ప్రమాదంలో దెబ్బ తగిలిన వారిని నేను చూస్తాను. ముందు ఆ అమ్మాయి బాధ వుపశమించటానికి ఆ డాక్టర్‌ని తగు చర్య తీసుకోమనండి. ఆ అమ్మాయి బ్రతకాలి. ప్రయోజకురాలై తిరగాలి."

"యస్ మేడమ్. ప్రయత్నిస్తాము. మిగతా పేషెంట్స్‌ను చూడండి".

ఆమె దెబ్బలు తగిలిన వొక్కొక్క పేషెంట్‌ను పలకరించి ధైర్యం చెప్పసాగింది. వారి బాధలను, కష్టాలను విన్నది.

దెబ్బల్లు తగిలిన వారందరికీ అక్కడికక్కడే ఎక్స్‌గ్రేషియా ప్రకటించింది.

## ఈనాడే స్వాతంత్ర్యం

ఈనాడే
స్వాతంత్ర్యం మన జాతికి వచ్చిందట
మహనీయుల త్యాగాలకు–
మూల్యం
సమకూర్చిందట.
అబద్ధాల వేటలోన– దొరకిన సత్యపు తేళ్ళను
వార్తాపత్రికల నెగళ్ళ– కాల్చి కాల్చి
అధికారపు పీయూషం తనివారగ ఆరగించు
స్వాతంత్ర్యం ఇదేనంట
జంకుగొంకులింకేటికి– జగమంతా మనదే కద
బలహీనుల రాచి రాచి– అసమర్థుల దోచి దోచి
న్యాయధర్మ సూత్రాలను– గ్రంథాల్లో పాతిపెట్టి
దాచుకొన్న ధనంతోడ– వేసుకున్న పథకంతో
పదవులు సంపాదించీ– ప్రక్కవాని పని పట్టే
స్వాతంత్ర్యం నేడే వచ్చిందట
ప్రజలంతా నావారే- నావారే ప్రజలంటే
నావారి ధనం– ప్రజాధనమను
భేదం– గీదం పారద్రోలి
పంచభక్ష్య పరమాన్నా– లారగించు స్వాతంత్ర్యం
నేడే వచ్చిందట.
ప్రజాసేవ కవకాశం– కావాలని గద్దెలెక్కి
దరిద్ర దేవతారాధన– సాగించాలని పదవి వలచి
ప్రజలుడతా భక్తినిచ్చు– ముడుపులు కాదనగలేక
అందరమొకటే కద– నీదైనా– నాదైనా
అంతా ఒకటే అని
నా సొంతం కావించుకొని
నా సౌఖ్యం– నా భోగం– నా సంపద
పేదవారి కంకితమిడి
నిస్వార్థం పరార్థంగా– స్వార్థం పరమార్థంగా
జీవించే స్వాతంత్ర్యం–
నేడే వచ్చిందట
రండి రండి తమ్ములూ– హారతులను
తెండి తెండి ఆడబడుచులూ–

–మొవ్వ వృషాద్రిపతి

"ఆఖరి పేషెంట్ యీయనే. కాళ్లకు బాగా దెబ్బలు తగిలేయి హిమ్ నాట్ గెట్‌వొన్ సైట్".

ఆమె పేషెంట్‌ను చూచి ఉలిక్కిపడింది.

"కలెక్టరమ్మగారూ మా అమ్మాయిని బ్రతికించండి. కాళ్లు పోయినా ఫర్వాలేదు. చేతులు పోయినా ఫర్వాలేదు. ఒక్కగానొక్క కూతురు. ప్రాణాలతో మాకు దక్కితే చాలు" పధహారేళ్ల అమ్మాయి తాలూకు తల్లిదండ్రులు అప్పుడే వచ్చి మొరపెట్టుకున్నారు.

అసంకల్పితంగానే ఆమె కళ్లు పోయిన పేషెంట్ వైపు చూచింది.

చటుక్కున వో దృశ్యం–

* * * * * * *

"డాక్టర్."

అప్పుడే స్పృహ వచ్చిన హరిణి తండ్రి గొంత విని ఆనందించింది.

"మొన్న వచ్చినప్పుడే మీతో వో విషయం చెప్పాలనుకొన్నాను. కానీ కుదరలేదు. యివాళ ఎవరూ లేరు కదా? హరిణి కూడా స్పృహ లేదు. అందుకనీ.."

"చెప్పండి" డాక్టర్ శ్రీకృష్ణ అన్నాడు.

అంత రహస్యంగా తన తండ్రి డాక్టర్‌కి ఏం చెప్తాడో?

"హరిణిని ఎలాగైనా బతికించాలని మీరు పట్టుదలతో కృషి చేస్తున్నారు. ఎందుకు? మా అమ్మాయిని బ్రతికించమని మేము మిమల్ని కోరేమా?"

"మీరు కోరటం ఎందుకు? డాక్టర్‌గా అది నా బాధ్యత."

"కానీ హరిణి చావాలనుకొని రైలు కింద పడింది. కాళ్లు రెండూ తీసెయ్యాలంటున్నారు. ఎడం చెయ్యి మణికట్టు తెగిపోయిందంటున్నారు. కుడి చేతి వేళ్లు కూడా తెగిపోయాయంటున్నారు. యింకా మీక్కూడా తెలియని అంగ వైకల్యాలెన్ని వున్నాయో? ఆ మొండేన్ని తీసుకుపోయి మేమేం చెయ్యం డాక్టర్‌గారూ? జీవచ్ఛవంలాంటి ఆ పిల్లను బ్రతికినంత కాలం నెత్తిన పెట్టుకొని మొయ్యాల్సిందే కదా? మాకంత శక్తి లేదు సర్. కనుక..."

వింటున్న హరిణి గుండెల్లో రైళ్లు పరిగెత్తినట్లయింది. రెండు కాళ్లూ పోయాయా? తనకింక కుంటి బతుకేనా? ఆ బ్రతుకు బ్రతక్కపోతేనేం?

"కనుక?"

"కనుక... కనుక... హరిణిని బ్రతికించటానికి మీరనవసరంగా శ్రమ పడకండి. ఆ పిల్ల అదృష్టం ఎలా వుంటే..." ఆ మాటలన్నది తల్లి.

అంటే– తనని చంపమని కోరుతున్నారన్న మాట! ఎవరు? తనని స్వయానా కన్న తల్లి తండ్రులు! ఛీ... వీరేం తలిదండ్రులు?

ఆమెకా క్షణంలో తలిదండ్రులపైన అసహ్యం

వేసింది. కచ్చి కలిగింది. ఎలాగైనా బతికి వారిని ~~ధించాలనిపించింది.

"మీ అభిప్రాయం నాకర్థమయింది. కానీ సారీ- మీ కోరిక తీర్చను. ఎందుకంటే- నేను ప్రాణం పొయ్యాల్సిన డాక్టర్ని. తలిదండ్రులుగా మీరు అనుబంధాన్ని, మానవత్వాన్నే మర్చిపోయినా, నేను నా కర్తవ్యాన్ని విస్మరించను. యుకెన్ గో."

ఆ తర్వాత తలిదండ్రులు హరిణి వద్దకొచ్చారు. కానీ హరిణికి వాళ్ల మొహం చూడబుద్ధేయడం లేదు. కళ్లు తెరవలేదు.

"డాక్టర్. నేనంటే మీకెందుకింత ప్రేమ డాక్టర్" డాక్టర్ శ్రీకృష్ణ వచ్చినప్పుడు కన్నీళ్ళు కారుస్తూ అంది హరిణి.

"బికాజ్... యు ఆర్ ఎ నైస్ గాల్. యు ఆర్ ఎ క్లవర్ గాల్. వన్‌డే- యు విల్ బికమ్ ఎ గ్రేట్ పర్సన్. అప్పటికి నేను ముసలాడినయిపోతాను. యీ ముసలాడిని అప్పుడు ఎవరు ప్రేమిస్తారు? నువ్వు ప్రేమించి దగ్గరికి తీస్తావని! అందుకు?" సర్దాగా అన్నాడు శ్రీకృష్ణ.

"యీ కుంటిదానికి, యీ జీవచ్ఛవానికి అంత అదృష్టం కూడానా డాక్టర్?"

"అమ్మా హరిణీ..."

"మా అమ్మా నాన్నలతో మీ సంభాషణంతా విన్నాను డాక్టర్. తల్లిదండ్రులనే అక్కర్లేని యీ కుంటిదాన్ని ఎవరు చేరదీస్తారు డాక్టర్. దయచేసి నన్ను చంపెయ్యండి. కనీసం నా దోవన నన్ను చావనివ్వండి"

"నో నిన్ను బ్రతికిస్తానమ్మా. ఎందుకంటే సృష్టిలోని ప్రతి ప్రాణి ఎంతో విలువైనది కనుక చావాలని ఏ ప్రాణి కోరుకోదు కనుక."

"కానీ..."

"నీ అంగ వైకల్యం నీ అభివృద్ధికి ఆటంకం కాదమ్మా. నన్ను నమ్ము. చావటం గొప్ప కాదమ్మా. బ్రతికి ఏదన్నా సాధించటం గొప్ప."

* * * * * * *

"కలె. ర్‌గారూ. నన్నెందుకు బ్రతికించారు? నాకు మీ మి. వాలా కోపంగా వుంది" ఫోనులో ఉక్రోషంగా అంటోంది జయంతి.

"మళ్లీ ఏమయిందమ్మా? నిన్నెవరైనా ఎగతాళి చేశారా?"

"ఒకరు కాదు కలెక్టర్‌గారూ. అంతా ఎగతాళి చేస్తున్నారు. పూర్వం మొహం ఎదుంటే వేసే వారు. యిప్పుడు మీకు భయపడి చాటుగా హేళన చేస్తున్నారు. అయినా నేను బ్రతికేం లాభం? యీ అవిటిది అందరికీ బరువే కదా?"

"సరిగ్గా యీ మాటలే అందమ్మా హరిణి కూడా- ఒకప్పుడు."

"హరిణి ఎవరు?"

"నేను వచ్చి చెప్తానమ్మా. మరో పది నిమిషాల్లో హాస్పిటల్‌కి వస్తాను. నేను వస్తున్నట్లు ఎవరికీ చెప్పవద్దు. ఏం?"

జిల్లా కలెక్టర్ తీసుకొన్న శ్రద్ధవల్ల, బస్సు ప్రమాదంలో బలమైన గాయాలు తగిలిన వాళ్లంతా కోలుకొని హాస్పటల్ నుంచి డిస్చార్జి అయి పోయారు.

జయంతి, కళ్లకు బలమయిన దెబ్బలు తగిలిన ముసలాయాన మాత్రం మిగిలేరు.

జయంతి రెండు కాళ్లనూ మోకాలుదాకా తీసేసారు. ఒక చెవి తెగిపోయింది. ముక్కుకు బాగా దెబ్బలు తగిలేయి.

ఆ అమ్మాయి బెడ్ దగ్గర ఒక ఫోనును ఏర్పాటు చేయించింది కలెక్టర్. ఆ ఫోనులో తనతో ఎప్పుడన్నా మాట్లాడవచ్చునని చెప్పింది. తను రోజూ మాట్లాడుతూ జయంతికి ధైర్యాన్ని, పట్టుదలని ఇంజెక్ట్ చేయటానికి ప్రయత్నిస్తోంది.

"ప్లాస్టిక్ సర్జరీ చేయించి నీ మొహానికొచ్చిన అవిటితనాన్ని పోగొడతానమ్మా. నువ్వు ఎవరి సహాయం లేకుండా నడిచేలా చేస్తాను."

ఆ ఏర్పాట్లు చూడమని కలెక్టర్ హాస్పిటల్ సూపరింటెండెంట్‌ను కోరింది. కానీ అతను యిదిగో, అదిగో అంటూ కాలక్షేపం చేస్తున్నాడు.

"యివాళ ఆ ముసలాయన్ని డిస్చార్జ్ చేద్దామనుకొంటున్నాం. కానీ ఆయన వెళ్లనని మొండికేస్తున్నాడు" సూపరింటెండెంట్ కలెక్టర్‌ని చూడగానే చెప్పేడు.

"జయంతి సంగతేం చేసేరు? ఆ అమ్మాయి హాస్పిటల్ నుంచి నార్మల్‌గా నడిచి వెళ్లాలని చెప్పేను కదా?"

"ఇంపాజిబుల్. నేను చాలా మంది ఆర్థోపెడో షియన్స్‌ను కన్‌సల్ట్ చేసేను. మా హాస్పిటల్‌లో మేము చేయగలిగిందంతా చేసేము. ఇంక మా వల్ల ఏం కాదు. మీరు అనుకొంటున్న విధంగా ఆ అమ్మాయి కావాలంటే అమెరికాకు పంపించాల్సిందే-"

కలెక్టర్ నవ్వింది.

"అంటే- అమెరికా మీద నున్నంత విశ్వాసం ఒక సీనియర్ డాక్టర్‌గా మీకు మీ మీద మీ స్టాఫ్ మీద లేదన్న మాట! ఆల్ రైట్. ఆ అమ్మాయిని చూద్దాం పదండి".

* * * * * * *

"మిమ్మల్ని యివాళ హాస్పిటల్ నుండి డిస్చార్జ్ చేస్తున్నామండీ కలెక్టర్‌గారు కూడా అంగీకరించారు. మీరు తయారుగా వుండండి."

"కలెక్టర్‌గారు అంగీకరించారా? అయితే యీ గుడ్డి ముసలాడికి దిక్కెవరు?"

"మీ కెవరూ లేరా?" కలెక్టర్ అడిగిందా






## న్యూఢిల్లీ లేఖ

( 4 వ పేజీ తరువాయి)

దృశ్యం కనబడుతుంది. పోయిన సారి జరిగినది అదే. ఈ సారి జరగనున్నదీ అదే. గత ఎన్నికల్లో వోటర్లను మోసం చేశారు. తెలుసుకునే సరికల్లా సమయం మించి పోయింది. మళ్ళీ కూడా అటువంటి మోసానికి వోటర్లు గురవుతారా? కాంగ్రెస్ వాదులు ఔనని అనుకుంటున్నారు. చంద్రశేఖర్ లాటి కొందరు ప్రతిపక్ష నాయకులు కూడా అనుకుంటు 'న్నారు. ఇటువంటి నాయకులు కాంగ్రెస్ (ఐ) ఎత్తుల్లో పావులు కావడానికి సిద్ధంగా ఉంటారు. దారుణ హత్యాకాండలు విజృంభించినప్పుడల్లా తీవ్రవాదులతో చర్చలు జరపాలనే ప్రతిపాదనతో చంద్రశేఖర్ ముందుకు వస్తారు. మామూలుగా అయితే ఆయన ఢిల్లీ సమీపంలో తన సొంత వాస్తు శాస్త్రజ్ఞుడు రూపొందించిన వ్యవసాయక్షేత్రపు భవనంలో ఎయిర్‌కండిషన్డ్ వైభోగాన్ని అనుభవిస్తూ రోజులు గడుపుతారు. ఏదో మీట నొక్కినట్టుగా ఈ సారి కూడా పానిపట్ హత్యాకాండ జరిగిన మర్నాడే ఆయన మళ్ళీ తన పాత ప్రకటన చేశారు. కర్నాటకలో హెగ్డే ప్రభుత్వాన్ని కూల్చడానికి ప్రయత్నించి విఫలమైన తర్వాత ఆయన చేసిన పని ఇది. తీవ్రవాదులతో శాంతి కుదుర్చుకోవడంలో ఆయనకు ఎంత ఆసక్తి ఉందో దాదాపు అంత ఆసక్తే కర్నాటక ప్రభుత్వాన్ని కూల్చడంలో కూడా ఉంది.

ఢిల్లీలోని రాజీవ్ ప్రభుత్వానికీ, తీవ్రవాదులకు మధ్య చర్చలు జరుగుతున్నాయని నేను విన్నాను. పంజాబ్‌లో మరొక సారి ఎన్నికలు జరిపించడమే ఈ చర్చల తక్షణ లక్ష్యం. ఇది కేవలం ఎత్తుగడేనా, శాంతి స్థాపనకోసం జరుగుతున్న నిజమైన ప్రయత్నమా అనేది తేలవలసి ఉంది. ఏది ఏమైనా ప్రభుత్వం నిప్పుతో చెలగాట మాడుతున్న దనడంలో సందేహం లేదు. మరొక తాజా ఎన్నిక జరగనున్నదంటే కచ్చితంగా అవతలి పక్షం నుంచి ఇంకా ఎక్కువ హింస జరుగుతుంది. వాళ్ళ లక్ష్యం ఎన్నికలను అడ్డుకోవడం, ప్రభుత్వం అత్యవసర పరిస్థితిని విధించేలా చేయడం, పంజాబ్‌లో పూర్తి అంతర్యుద్ధాన్ని ప్రారంభించడం. ఈ మధ్యకాలంలో రాష్ట్రంలో పోలీసు శాఖ మానసిక స్థైర్యం పూర్తిగా దెబ్బతిని, దాదాపు అంతరించి పోయే దశకు వస్తుంది. తీవ్రవాదులకు కావలసింది ఒక పూర్తి స్థాయి అంతర్యుద్ధం. దాన్ని రాజీవ్ గాంధీ బృందం వెండి పళ్ళెంలో పెట్టి సమర్పించనున్నది. అంతకంటే వాళ్ళకి మరేమీ తెలియదు. ఢిల్లీలోని ప్రభుత్వం పిరికి పందలతో నిండిపోయి ఉంది. పంజాబ్‌లో కన్న ఢిల్లీ లోనే ఎక్కువ మంది కమాండోలు కాంగ్రెస్ నాయకులకు రక్షణగా ఉన్నారు. మరి పిరికి పందల నుంచి ఏ గౌరవనీయమైన పనినీ ఆశించడానికి వీలులేదు.

ఢిల్లీలోని కాంగ్రెస్ మాఫియా బోఫోర్స్ నుంచి అందిన కోట్లాది క్రోనర్లను రక్షించుకోవడంలో వెచ్చించిన శక్తిలో ఏ కొద్ది పాటి భాగాన్ని పంజాబ్ సమస్య పరిష్కారంలో వెచ్చించినా మనం ఎంతో కాలం కిందటే పరిష్కారానికి చేరుకునే వాళ్ళం, కాని నేను ముందే చెప్పినట్టు, వాళ్ళకు పంజాబ్ సమస్యకు పరిష్కారం అవసరం లేదు. ఎందుకంటే అది ఎన్నికల్లో గెలవడానికి పనికొచ్చే సిద్ధంగా ఉండే సమస్య. పోతే ఏం చేయాలో వాళ్ళకు తెలియను కూడా తెలియక పోవచ్చుననుకోండి. సరిగ్గా శ్రీమతి ఇందిరా గాంధీ కూడా ఇలాగే సమస్యను గందర గోళం చేసిన తర్వాత ఏమి చేయాలో తెలియక తబ్బిబ్బు పడింది. ఏది ఏమైనా రాజీవ్‌గాంధీ ఈ సమస్యను పరిష్కరించ దగిన మనిషి కాదు. స్వభావ సిద్ధంగానే రాజీవ్ గాంధీ పూర్తిగా వేరే పరిస్థితుల్లో ఉన్నారు. వేడుకలు, ఉత్సవాలు, లక్షద్వీపాలలో, అండమాన్‌లలో మంత్రివర్గ సమావేశాలు, స్టాక్‌హోమ్, టోక్యోల వంటి సౌకర్య వంతమైన విహార స్థలాలలో కుహనా అంతర్జాతీయ సమావేశాలు– ఇవీ రాజీవ్‌గాంధీకి తెలిసినవి. పంజాబ్ వంటి సమస్యను ఇటువంటి మనిషి ఎలా పరిష్కరించ గలరు? రాజీవ్ గాంధీని వదుల్చుకున్న తర్వాత మాత్రమే మనకు పంజాబ్ సమస్యను వదులుకునే వీలు కలుగుతుంది. చంద్రశేఖర్ లాంటి వ్యక్తులు రాజీవ్ గాంధీ ఉంటారని నిర్ధారిస్తున్నారనుకోండి. అదే దురదృష్టం

## ఇ'వేమన' పద్యాలు — పాత రోజులు




మొదలు క్రియలు దప్పి మోసంబు సేయుచు
బొట్ట కొరకు మనసు బొందు పరిచి
బీదకుక్క రీతి బెరుగును మనుజుండు
విశ్వదాభిరామ వినుర వేమ

## దేముడు

ముసలాయన్ని.

"ఉండేవారే. కానీ నా పాపమే నన్ను అన్యాయం చేసింది. అందర్నీ పోగొట్టుకున్నాను. ఆఖరికి కళ్ళు కూడా పోయాయి. నా పాపానికి యింకా ప్రాయశ్చిత్తం కాలేదని కాబోలు నన్ను మాత్రం ఆ భగవంతుడు తీసుకుపోవడంలేదు."

"మీ పశ్చాత్తాపమే మీకు రక్షగా నిలబడవచ్చుగా? భయపడకండి."

కలెక్టర్ ముసలాయనకు ధైర్యం చెప్పి జయంతి దగ్గరి కెళ్ళింది.

'హరిణి ఎవ్వరు మేడమ్? నాలాంటి దుర దృష్టవంతురాలేనా?'

'నీకన్నా దురదృష్టవంతురాలమ్మా. ఎందుకంటే అవిటిదానివైనా నిన్ను ప్రేమించే తల్లిదండ్రులున్నారు నీకు. కానీ హరిణి తలిదండ్రులు అవిటిదైన కూతురు చనిపోతే బాగుంటుందని కోరుకొన్నారమ్మా. కానీ వారి అభ్యర్థనను వినకుండా డాక్టర్ ఆమెను బ్రతికించాడు. తలిదండ్రులు ఆమెను వదిలేసిపొయ్యారు. తల్లిదండ్రులకి కూడా అక్కర్లేని తనను బ్రతికించినందుకు హరిణి డాక్టర్ని కూడా తిట్టింది. కానీ ఆ డాక్టర్ దేముడిలాంటివాడమ్మా. అలాంటి డాక్టర్ చేతిలో పడట మొక్కటే ఆమె అదృష్టం. ఆయన పేరు శ్రీకృష్ణ. ఆయన ఆమెలోని నైరాశ్యాన్ని పోగొట్టేడు. బ్రతుకుపట్ల తీపిని కలిగించాడు. జీవితానికి వొక ఆదర్శాన్ని, ఆశను కల్పించాడు. ఆమెను అందరిలా నడిచేలా చేసేడు. తను అవిటి దన్న భావనే ఆమెలో లేకుండా చేసేడు.

'అంటే ఆమె తన కాళ్ళమీద నడిచేలా చేసేడా?

'కాదు. పరుగెత్తేలా చేసేడు.'

కలెక్టరు చెప్తున్న కథను హాస్పిటల్ స్టాఫ్ మాత్రమే కాకుండా ఆ వార్డులో పేషెంట్సు అంతా శ్రద్ధగా వింటున్నారు.

'ఆమె చదువుకొంది. పెద్ద ఉద్యోగం చేస్తున్నది. తను అవిటిదానినని ఆమె ఎప్పుడూ అనుకోదు. నువ్వు అలా కావాలి. అలా నిన్ను తయారు చేయగల సమర్థుడు డాక్టర్ శ్రీకృష్ణగారు మాత్రమే. ఆయన దగ్గరికి నిన్ను పంపిస్తాను. వెళ్తావుకదూ?'

'వెళ్తాను మేడమ్. కానీ వెళ్ళే ముందు ఆ హరిణిని వొకసారి చూడాలనివుంది నాకు.'

'బట్ - మిస్ కలెక్టర్. ఎక్స్‌క్యూజ్‌మీ. మీరు చెప్పిందంతా మెడికల్ ఫిక్షన్ అనుకొంటాను. బికాజ్ - యిటీజ్ ఇంపాజిబుల్. జయంతిలో లేనిపోని ఆశలు కల్పించటం డిజైరబుల్ కాదనుకొంటాను. 'సూపరింటెండెంట్' అన్నాడు.

కలెక్టర్ నవ్వింది.

'ఇంపాజిబుల్! నో డాక్టర్. యిటజ్ పాజిబుల్. వేర్ దేర్ యీజ్ విల్ దేర్ యీజ్ ఎవే. నేను చెప్పింది కథ కాదు. వాస్తవం. యిలా చూడండి' కలెక్టర్ మెల్లగా చీర కుచెళ్ళు తొలగించి తన కాళ్ళను చూపసాగింది.

అంతా ఆమెనే చూస్తున్నారు.

'అంటే... అంటే... మీరు... మీరు... మీరేనా హరిణి?' జయంతి ఆనందం పట్టలేక కలెక్టర్ని కౌగిలించుకొంది.

యింతలో ఎవరో కింద పడ్డ శబ్ద మవుతే అంతా అటు చూశారు.

కళ్ళుపోయిన ముసలాయన! బెడ్‌మీద నుంచి లేచి వెళ్తూ దేనినో తట్టుకుని కింద పడ్డాడు.

అంతలో నే కింద నుంచి లేచి పరుగెత్తసాగేడు.

'నాన్నా. మళ్ళీ నీ కూతుర్ని వదిలేసి పారిపోవటం నీకు న్యాయమా నాన్నా. ప్లీజ్. నా కోసం ఆగు' ఆమె వెళ్ళి అతని చెయ్యి పట్టుకొని ఆపింది.

'క్షమార్హుడినికాని నన్ను క్షమిస్తున్నావామా?'

'నాకు రెండోసారి ప్రాణం పోసిన దేముడు నాకు నేర్పిన మొదటి పాఠం అదే నాన్నా!

హరిణి తండ్రి చేయి పట్టుకొని మెల్లగా నడిపించసాగింది. ■

### కృతజ్ఞత

ఈ కథ రాయటానికి నాకీ ప్రేరణ యిచ్చిన ప్రఖ్యాత ఆర్థోపెడిక్ సర్జన్ డా. వై. కృష్ణ, తిరుపతిగారి సహృదయతకు కృతజ్ఞతలతో -

కప్పగంతుల మల్లిఖార్జునరావు

# ఏ కుక్కర్ ఇవ్వలేని, మెజెస్టిక్ మాత్రమే ఇచ్చే అతి ముఖ్యలక్షణం...

## మనశ్శాంతి




కేవలం

మెజెస్టిక్‌లో పటిష్టమైన నిర్మాణం
అదనపు ఏర్పాట్లు
అందుకే రోజంతా చికాకులున్నా
మెజెస్టిక్‌తో వంట ... చింతలేని అనుభూతి.



మూడు రకాల ఖచ్చితమైన రక్షణ: గాస్కెట్ విడుదల ఆవిరి విడుదల అధిక ఒత్తిడి విడుదల.



లోపల మూతలు గల గిన్నెలు చట్రంలో పొందికైన అమరికవలన పదార్థాలు పొంగవిక.



ఎంపిక సౌలభ్యానికి ఎనిమిది పరిమాణాల్లో లభ్యం!



**మెజెస్టిక్** ®

మనశ్శాంతినిచ్చే ప్రెషర్ కుక్కర్



# మితిమీరిన మధుపానం

## ఇక్కట్లు - నివారణ




మధుపానానికి ఎందరో వ్యక్తులు, మరెన్నో కుటుంబాలూ బలైపోవటాన్ని మనం కళ్ళారా చూస్తూనే ఉన్నాము. ఈ వైపరీత్యం దాదాపు ప్రపంచంలోని అన్ని దేశాలలోను ప్రబలి ఉంది. ఆర్థికంగాను, సామాజికంగాను అభివృద్ధి చెందిన దేశాలలో నాగరికత వెర్రితలలు వెయ్యటం మూలంగా ఈ మధుపానం ఒక అంటురోగంగా మారి వారి వ్యక్తిగత ఆర్థిక స్థితిని మాత్రమే గాకుండా దేశ ఆర్థిక వ్యవస్థను కూడా కుంటుపరిచే విధంగా తయారవటం ఎంతైనా విచారించతగ్గ విషయం.

మధుపానానికి బానిసలయిన వారి గురించి, వారి మానసిక ప్రవృత్తులను గురించి ఎన్నో రకాల అభిప్రాయాలు చలామణీ అవుతున్నాయి. నేరాలు చేసేవారుగాను, మానసిక అసంతృప్తి. రుగ్మతలకు లోనైన వారుగాను, ఇతరులకి చీకాకు కలిగించేవారుగాను వీరికి 'ముద్ర' పడిపోతుంది. ఎలిజబెత్ టేలర్, జేసన్ రోబర్ట్స్, లిసామిన్నేరీ మొదలయిన ప్రముఖులందరూ ఒకానొకప్పుడు మితిమీరిన మధుపానం చేశేవారట! వీరందరు ఈ అలవాటునుంచి ఎంతో కష్టంమీద బయట పడ్డారంటే, మాజీ అమెరికా అధ్యక్షుని సతీమణి బెట్టీఫోర్డుచే స్థాపించబడిన చికిత్సా కేంద్రాలే కారణం అవుతాయి!

ఈ అలవాటు గల వారిలో 95 శాతం వారి కుటుంబాలలో ఎవరో ఒకరు త్రాగుబోతు అయి ఉండటం గమనించతగ్గ విషయమని న్యూపోర్టు చికిత్సా కేంద్ర డాక్టర్ జాన్ వాలస్ అభిప్రాయపడుతున్నారు.

జీన్స్ ద్వారా ఈ అలవాటు వంశపారంపర్యంగా వచ్చే అవకాశం ఉంటుందని ఆయన అభిప్రాయం. అమెరికాలోని వివిధ పరిశోధనా కేంద్రాలలో ఈ రోగ లక్షణాన్ని కలిగిఉన్న "జీన్స్"ను కనుగొనటం కోసం నిర్విరామంగా కృషి జరుగుతూనే ఉంది. ఈ కృషి ఫలించినప్పుడు, వివాహానికి ముందుగానే స్త్రీ పురుషుల జీన్సును పరిశీలించి వారు ఈ అలవాటుకు లోనయ్యే అవకాశం ఉన్నదీ లేనిదీ తెలుసుకోవచ్చును.

ప్రస్తుతం అమెరికాలో 18 మిలియన్ల జనాభా మధుపానం మీద నిరంతరం ఆధారపడి ఉండటం ఎంతో విచారకరమైన విషయం. ఈ అలవాటు ఎంత విపరీతానికి దారి తీస్తుందంటే - సీసా ఒక్కటే స్నేహితుడుగాను, మధువుని దొరక పుచ్చుకోవటానికి ఎంతకైనా తెగించేవారుగాను, మధుపానం లేనిదే బ్రతకలేనివారుగాను తాము ఉండే వారమని, ఒకప్పుడు నిర్విరామంగా మధువుకి అలవడ్డవారు తెలియజేస్తున్నారు.

మధుపానం మతిమీరటం వల్ల ఎన్నో కుటుంబాలు సర్వ నాశనమేవుతున్నాయి. వీరి చికిత్సకి అయ్యే ఖర్చు, వీరు తమ తమ పనులకు సక్రమంగా వెళ్ళకపోవటంవల్ల జరిగే ఆర్థిక నష్టం ఒక్క అమెరికాలోనే 115 బిలియన్ల డాలర్లని ఒక అంచనా.

అల్కహాలు (మధువు) వల్ల మెదడు మాత్రమే గాకుండా శరీరంలోని అన్ని అవయవాలూ బాధింపబడే అవకాశం ఉంది. హార్ట్ అటాక్ మొదలైన




హృద్రోగాలు, అధిక రక్తపుపోటు, కడుపులోను, ప్రేగులలోను పుండు ఏర్పడటం, మగవారిలో పుంసత్వం నశించటం, స్త్రీల ఋతుక్రమాలలో అవక తవకలు ఏర్పడి సంతానోత్పత్తి తగ్గటం, గర్భిణీ స్త్రీలకి ఈ అలవాటు ఉన్నప్పుడు అంగ లోపాలతో శిశువులు జన్మించటం, పుట్టిన పిల్లల మెదడు సరిగా పెరగకపోవటం, శరీరంలో రోగ నిరోధక శక్తి తగ్గటం మామూలుగా వచ్చే అవాంతరాలవుతాయి.

వీటన్నిటి కన్నా మధుపానం వల్ల కాలేయం (లివర్) అధికంగా దెబ్బతినే అవకాశం ఉంటుంది. దీనివల్ల లివర్‌లో క్రొవ్వు పదార్థాలు పేరుకు పోవటం, తర్వాత లివర్ పూర్తిగా పాడయిపోవటం జరుగుతుంది. దీనిని సిర్రోసిస్ ఆఫ్ లివర్ అని అంటారు. మితిమీరిన మధుపానం చేసే వారిలో 10 శాతం ఈ రోగం తప్పక ఉంటుంది. సిర్రోసిస్ అనేది కొద్ది మోతాదులో మధుపానం చేసినా స్త్రీలలో ఎక్కువగా వచ్చే అవకాశాలుండటం గమనించ తగ్గ విశేషం.

అమెరికాలోని హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో జరుపబడిన పునఃపరిశీలనలో మధుపానం అసలు చెయ్యని స్త్రీలలో కన్నా, ఒక మోస్తరుగా పుచ్చుకొనే వారితో సహా 30 నుంచి 50 శాతం వారికి బ్రెస్ట్ కేన్సర్ వచ్చే అవకాశం ఎక్కువ అని తేలింది. అదే విధంగా లివర్‌లోను, ఊపిరి తిత్తులలోను, పేంక్రియస్ గ్రంధిలోను, పెద్ద ప్రేవులలోను కేన్సర్ వచ్చే అవకాశం మధుపానం చేసే వారిలో ఎక్కువ.

గత సంవత్సరం అక్టోబర్ నెలలో డాక్టర్ చార్లెస్ లైబా అనే అయన సైటో క్రోమ్ – పి – 450 అనే ఎంజైము ప్రభావం వల్ల మధుపానం చేసే వారిలో కొన్ని రసాయనిక మార్పులు జరిగి ఆ మార్పుల వల్ల కేన్సర్ వచ్చే అవకాశం ఉంటుందని తెలియజేశారు.

మధుపానం చేయటం వల్ల మనోధైర్యం తగ్గుతూ వస్తుంది. ఏటా అమెరికాలో పదునాలుగు వేల మంది ఈ అలవాటు మూలాన ఏర్పడిన కాలేయపు రోగంతో మరణిస్తున్నారట! 1986 వ సం.లో 23000 రోడ్డు ప్రమాదాలు త్రాగుడుకి బానిసలైన డ్రైవర్ల మూలాన సంభవించాయట. అదే సం.లో 2800 మంది త్రాగుడు మైకంలో నీళ్ళలో మునిగి పోవటం జరిగింది. అలాగే ఈ లక్షణం 10000 ఆత్మహత్యలకి కూడా కారణం అని భోగట్టా! మానభంగాలు, దోపిడీలు, అల్లర్లు చేసి జైలు పాలయిన 5,23,000 నిందితులలో మూడింట ఇద్దరు త్రాగుడు ప్రభావం వల్ల అయా నేరాలు చేశారని అక్కడి న్యాయశాఖ జరిపిన సర్వే తెలియజేసింది. అమెరికాలోని 2,50,000 పైచిలుకు తల దాచుకోవటాని ఇల్లు లేని వారట! అందులో 45 శాతం వారు కూడా విపరీతమైన మధుపానానికి అలవాటు పడ్డ వారంటే ఈ 'రోగం' ఆ దేశంలో ఎంత విచ్చలవిడిగా ఉందో తేలికగా అర్థం చేసుకో వచ్చును! ఈ త్రాగుడు 40 శాతం కుటుంబ కలహాలకు, 20 నుంచి 50 శాతం దంపతుల మధ్య కొట్లాటలకు, 30 శాతం చిన్నపిల్లల మీద అత్యాచారాలకి కారణం అని అమెరికా దేశపు ఆరోగ్య కార్యదర్శి ఓటిస్ బోవన్ గారు తెలియ జేస్తున్నారు.







స్వీడన్‌లో క్లోనింగర్ జరిపిన పరీక్షలలో 25 శాతం వారు తమ 25 వ సం. రాక మునపే ఈ దురలవాటు మొదలు పెట్టి, పని చేసే చోట, పోలీసు రికార్డు లోనూ చెడ్డ పేరు తెచ్చుకోవటం జరిగిందని తేలింది. ఇటువంటి వారి మానసిక తత్వం మందులకి లొంగదని ఆయన తెలియజేశారు. ఈ పిల్లల తల్లిదండ్రుల రికార్డుని పరిశీలిస్తే వీరిలోని ఈ లక్షణం వంశ పారం పర్యంగా వచ్చినట్లు తేలింది.

క్లోనింగర్ పరిశోధనలోని మిగతా 75 శాతం వారికి 25 సం.ల వయస్సు తర్వాతనే ఈ అలవాటు మొదలయిందనీ, వీరివల్ల వీరి కుటుంబానికి గాని, ఇతరత్రా గాని ఏ విధమైన అవాంతరాలు రాలేదని, ఆ అలవాటుని సులభంగా వదిలించుకునే శక్తి వీరికి ఉంటుందనీ తెలియవచ్చింది.

క్లోనింగర్ కథనం ప్రకారం మగవారిలో అల్లర్లు చెయ్యటానికి, గొడవలను సృష్టించటానికీ, ఆల్కహాలు ప్రభావం వల్ల వారి మెదడు రియాక్టవటం కారణం అవుతుంది.

ఈ విషయం గురించి, మెదడు మీద ఆల్కహాలు ప్రభావం గురించి ఇంకా నిశితంగా పరిశీలింపబడ వలసి ఉంటుంది.

మెదడు మీద పని చేసే ఇతర మందుల కన్నా ఆల్కహాలుకీ, మెదడులోని జీవకణాల గోడలలోనికి ప్రవేశించి మెదడు పనితనాన్ని కుంటుపరచే శక్తి అధికం. నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ మెంటల్ హెల్త్‌కి చెందిన స్టీవెన్ పాల్ అనే శాస్త్రజ్ఞుడు, మెదడులోని జీవకణాల (సెల్స్) గోడలలో నిగూఢితమైన ఉన్న "గామా అమైనా బ్యూట్రిక్ యాసిడ్" (గాబా) గురించి, దాని పనితనం గురించి చాలా రకాల పరిశోధనలు జరుపుతున్నారు. ఈ రసాయనం ఆల్కహాలు వల్ల మెదడులో ఏర్పడే ఇతర మార్పులకి మూలకారణం అవుతుంది. ఆల్కహాలు వల్ల "గాబా" ప్రేరేపింపబడటాన్ని




తగ్గించటానికి అర్. ఓ – 15–4513 అనే మందుని ఆయన పరిశోధిస్తున్నారు.

మధుపానానికి బానిసలంటే ఎవరనే విషయంతో ఇంతవరకు ఏకాభిప్రాయం కుదరలేదు. మరీ ఎక్కువగా మధుపానం చేసే వారు వారి చేష్టలు వల్ల తేలికగా గుర్తింపబడతారు. జ్ఞాపకశక్తి తగ్గటం, నిద్ర లేవగానే చేతులు కాళ్ళు వణకటం, ఆ వణుకు మధుపానం చేస్తే గాని తగ్గకపోవటం ప్రధాన లక్షణాలు. చేతులు వణకటం, ఉన్నట్టుండి కళ్ళు తిరగటం, ఇంకా త్రాగాలనే తపన, వ్యక్తిగత అలవాట్లలో మార్పులు సాంఘికంగాను ఉద్యోగ రీత్యా ఎన్నో ఇక్కట్లు మొదలయిన వాటిని కొని తెచ్చుకోవటం ఆదిగా గల లక్షణాలు కలవారిని త్రాగుబోతులనవచ్చుని అమెరికన్ సైకియాట్రిక్ అసోసియేషన్ వారి అభిప్రాయం.

ఈ అలవాటుకి గురి అయిన వారు వెంటనే పూర్తిగా ఈ అలవాటు మానే ప్రయత్నం చెయ్యవలసి ఉంటుంది. కొద్ది కొద్దిగా మానే ప్రయత్నాలు అంత ఫలించవు. ఈ విషయం మాటలలో చాల తేలిక, చేతలలో కష్టం అవుతుంది. దీనికి వారి వారి మానసిక ప్రవృత్తులు ముఖ్యకారణాలవుతాయి.

ప్రస్తుతం అమెరికాలోని 7000 పైచిలుకు చికిత్సా కేంద్రాలలో రోగులకి 28 రోజుల పాటు చికిత్సా కార్యక్రమాన్ని అమలు పరుస్తున్నాయి. వీటిలో కౌన్సిలర్ల ద్వారా సానుభూతితో విషయ వివరణ చెయ్యటం ముఖ్య కార్యక్రమం అవుతుంది. "ఆంటబ్యూస్" అనే మందుని మధుపానం పట్ల విరక్తి కలగటానికి వాడబడుతుంది. చికిత్సానంతరం రోగి కుటుంబంలోను, చుట్టుప్రక్కల ప్రాంతాలలోను, పని చేసే చోట్ల రోగ ప్రేరేపణ కలిగించే పరిస్థితులను తొలగించవలసి ఉంటుంది. రాబోయే దశాబ్దంలో ఈ రోగాన్ని సమాజాన్నుంచి తొలగించటానికి వీలుగా ఉండేటట్లు మందులు, విధానాలు వస్తాయని అందరూ ఎదురు చూస్తున్నారు.

ఒక రోగికి ఈ అలవాటుని మాన్పించటానికి అమెరికాలో నాలుగు వేల నుంచి ఇరవై వేల డాలర్ల

# మితిమీరిన మధుపానం ఇక్కట్లు - నివారణ

దాకా వ్యయమవుతున్నదట. ప్రస్తుతం ఇన్సూరెన్సు కంపెనీలు ఈ వ్యయాన్ని కూడా భరిస్తున్నాయి. రోగం వల్ల ఏర్పడే అవాంతరాలకు చికిత్సగాను అయ్యే వ్యయంలో ఇది చాలా స్వల్పం అని వారి అంచనా! ఇప్పుడిప్పుడు చాలా సంస్థలు వారి ఉద్యోగులలో ఉన్న ఈ అలవాటుని పోగొట్టటానికి ధనం వ్యయం చేస్తున్నాయి.

అమెరికాలో మధుపానం వల్ల కలిగే అవాంతరాలను గురించి చిన్న పిల్లలకి వారి స్కూళ్ళలో నేర్పబడుతోంది. "స్మార్ట్‌గా ఉండండి", "స్టార్ట్ చెయ్యండి" ఎవరైనా ఆహ్వానిస్తే వద్దని చెప్పండి అనే నినాదాలు గల పోస్టర్లు అన్ని చోట్ల కానవస్తున్నాయి.

చికిత్సా కేంద్రాల కృషి ఫలితంగాను, దేశ వ్యాప్తంగా జరుగుతున్న సాంఘిక సంక్షేమ విద్యా బోధనల ద్వారాను 1981 వ సం.లో తారస్థాయికి చేరుకున్న మధుపానం 1987 వ సం.నికి 5 శాతం తగ్గటం ఎంతో విశేషం అనే చెప్పుకోవలసి ఉంది.

ప్రస్తుతం వివిధ దేశాలలో త్రాగుడుకి లోనైన వారికి సహాయపడే విధంగా అల్కహోలిక్స్ అనానిమస్" అనబడే అసోసియేషన్లు ఏర్పడ్డాయి. వీటి నుంచి తయారైన శాఖలు ఉపశాఖలో ఒక అమెరికాలోనే 26 వేలు ఉన్నాయట! అల్ అనాన్ అనే శాఖ 1950 సం. నుంచే ప్రజాదరణ పొందింది. ఇది గాకుండా మితిమీరిన మధుపానానికి గురి అయిన తల్లిదండ్రులు గల 30 మిలియన్ల సంతానానికి ఈ అలవాటు రాకుండా చూడటానికి చిన్న పిల్లల అసోసియేషన్లు కూడా ఏర్పరచబడి తగిన కృషి చేస్తున్నాయి.

ఎన్ని అసోసియేషన్లు ఉన్నా ఈ అలవాటుకి గురి అయిన వారి చికిత్స విషయం మాత్రం అంత సంతృప్తికరంగా లేదనే చెప్పవలసి ఉంది. ఎన్నో చికిత్సా కేంద్రాలలో విజయవంతం అని చెప్పబడుతున్నా చికిత్స విజయవంతం అవటం రోగుల మానసిక ధోరణుల మీద ఆధారపడి ఉంటుంది. మందులు కొంత వరకు మాత్రమే తోడ్పడతాయి. నిలకడ అయిన ఉద్యోగం గలవారు, వివాహితులు, ఆర్థికంగా పైమెట్టు మీద ఉన్న వారు చికిత్స ద్వారా ఎక్కువ లాభం పొందే అవకాశం ఉంటుంది.

మనదేశంలో కూడా ఈ రోగాన్ని పోగొట్టటానికి ఎన్నో స్వచ్ఛంద సేవా సంస్థలు కృషి చేస్తున్నాయి. మద్రాసులోని టి. టి. రంగనాథన్ ఫౌండేషన్ వీటిలో ఒకటి.

ఒకవైపు పునఃపరిశీలనా కార్యక్రమాలు, ఈ రోగాన్ని రూపుమాపటానికి, ఎన్ని జరుగుతున్నా ప్రభుత్వ విధానాలలో కూడా తగిన మార్పు రావలసి ఉంది.

ఈ రోగాన్ని గురించి, రోగాన్ని పోగొట్టుకునే మార్గాలను గురించి సులభంగా అర్థమయ్యే విధంగా తెలియచెప్పటం చాలా అవసరం. ఈ విద్యాబోధన స్కూళ్ళలోనే ప్రారంభం అవ్వాలి. అదే సమయంలో మధుపానాన్ని ప్రేరేపింప చేసే విధంగా ఉన్న వ్యాపార ప్రకటనలను రద్దు చేయటం, మధుపాన ఉత్పత్తి, వినియోగం మొదలయిన విషయాలలో అవసరమైన కట్టుదిట్టాలను మరింత పటిష్టం చెయ్యటం, ఈ రోగాన్ని రూపుమాపటానికి స్వచ్ఛంద సేవా సంస్థలను, వ్యక్తులను ప్రోత్సహించటం ఎంతైనా అవసరం.

–డాక్టర్ కె. వెంకటేశ్వరరావు



# నా ప్రపంచమే తలక్రిందులై పోయేది...




## నేను న్యూ ఇండియాతో పంపుసెట్టు భీమా చేయించి వుండకపోతే



**నా పంపుసెట్టు దొంగలెత్తుకొని పొయారు, కాని పని మాత్రం ఆగి పోలేదు ఎందుకంటే, న్యూ ఇండియా సహాయంతో కొత్త పంపుసెట్టు కొని పెట్టేసుకొన్నా**

రైతుకు అతడి పంపుసెట్టు ఎంత విలువైనదో, అతడికీ, అతడి కుటుంబం వారికీ బాగా తెలుసు. కాని ఆ పంపుసెట్టు కాలిపోతే, విరిగిపోతే, పాడైపోతే లేదా దొంగలెత్తుకుపోతే? అలాంటప్పుడు న్యూ ఇండియా ఎష్యూరెన్స్ ఒక మంచి నేస్తంలా మీకు ఆధారంగా నిలుస్తుంది.

న్యూ ఇండియా ఎష్యూరెన్స్ వారి పంపుసెట్టు భీమా

పంపు మోటారు యొక్క హార్స్ పవర్‌ను బట్టి, ఒక ఏడాదిలో 50 రూపాయల నుంచి 190 రూపాయల దాకా చెల్లిస్తే చాలు. దేశమంతటా న్యూ ఇండియా ఎష్యూరెన్స్ వారివి దాదాపు 1000 కార్యాలయాలు వున్నాయి. ఎక్కువ వివరాలకోసం నేడే మీ ఏజెంట్‌ను కలవండి, లేదా మీకు దగ్గరలోని కార్యాలయానికి విచ్చేయండి.

**న్యూ ఇండియా ఎష్యూరెన్స్**



జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ

పంపుసెట్టు భీమా–నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం!

R K SWAMY/NIA/3573/TEL




(గత సంచిక తరువాయి)

దేదీప్య పెట్రోల్ పోయించేందుకు కారు దిగింది. కూతురితో పాటు తండ్రికూడా కారుదిగాడు.

ఎండ యింకా తీవ్రంకాలేదు. వాతావరణం ఆహ్లాదకరంగా వుంది. శ్రీనాథ్ రోడ్డు మీదకి నడిచి సిగరెట్ వెలిగించి కాలుస్తూ నిలబడ్డాడు.

దేదీప్య పెట్రోల్‌కి డబ్బిచ్చేసి కారు డోరు తెరుస్తూ–

"డాడీ!" అని పిల్చింది.

శ్రీనాథ్ తాగుతున్న సిగరెట్‌ని కింద పడేసి బూటుతో నులిమి రెండడుగులు ముందుకి వేశాడు.

సరిగ్గా అదే సమయానికి ఓ నల్లటి అంబాసిడర్ కారు స్పీడుగా తండ్రికి అతి సమీపంలో ఆగడం చూసింది దేదీప్య. అదేం పట్టనట్టుగా నడుస్తున్నాడు

> జరిగిన కథ 10 : సీతాదేవి భర్త విడుదలై రాబోతున్న వార్త ఆమెకు న్నో జ్ఞాపకాల్ని గుర్తు చేస్తుంది. రాకాను ఎదుర్కోవడానికి ముఖ్య మంత్రి క పథకం ఆలోచిస్తాడు. మోహన్ అపార్ట్‌మెంట్స్ కూలిపోయి అనేక మంది నిపోతారు. రాకా దేదీప్యను ఒక పనిలో సాయం చెయ్యమని కోరతాడు. దేదీప్య శైలజతో ఒక ముఖ్య విషయం మాట్లాడుతుంది. మోహన్‌రావుని బెదిరిస్తూ రాకా నుంచి ఉత్తరం వస్తుంది. సీతాదేవి భర్త శ్రీనాథ్ జైలు నుండి విడుదలై వస్తాడు. తల్లి తండ్రితో కలసి దేదీప్య కారులో యాదగిరిగుట్టకు బయలుదేరుతుంది.

శ్రీనాథ్–

భర్త వస్తున్నాడో లేదోనని వెనక్కి తిరిగిన సీతాదేవి కార్లోంచి దిగిన ఇద్దరు వ్యక్తుల్ని చూసి నిశ్చేష్టురాలైపోయింది.

ఆమె వెనకనుంచి ఎవరో హెచ్చరించినట్లయి గభాల్న కారు దిగి "ఏవండీ!" అంటూ అరిచింది సీతాదేవి.

ఆ పిలుపుకి అప్రయత్నంగా వెనక్కి తిరిగిన శ్రీనాథ్ తనని సమీపిస్తున్న ఆ వ్యక్తుల్ని చూసి, అసంకల్పితంగా ముందుకి పరుగెత్తసాగాడు.

ఆ యిద్దరు వ్యక్తుల్లో ఒకణ్ణి తనని రేప్ చేయ బోయిన వాడిగా గుర్తించిన దేదీప్య ఏదో ప్రమాదం తమని సమీపిస్తున్నట్టుగా స్ఫురించి తండ్రికి అభిముఖంగా పరుగెత్తనారంభించింది.

అయితే అప్పటికే ఆలస్యమైపోయింది. రోడ్డు మీదున్న ఇద్దరు ముగ్గురు వ్యక్తులు కూడా ఆ దుండగుల చేతుల్లో నల్లగా మెరుస్తున్న రివాల్వర్‌లను చూసి చెల్లా చెదురుగా పరుగెత్తారు.

జరగబోయేది ఊహించిన సీతాదేవి–

"నో... వద్దు..... నా భర్తను చంపకండి....!"

అని అరవడం రివాల్వర్ పేలిన శబ్దంలో కలిసి పోయింది.

"అ....మ్మా...... !" అని అరుస్తూ నేలకూలాడు శ్రీనాథ్. అయిదుసార్లు వరుసగా రివాల్వర్ నిప్పులు కక్కి శ్రీనాథ్ శరీరాన్ని తూట్లు పొడిచింది.

జనం ఆ షాక్ నుంచి తేరుకోకముందే నల్లటి అంబాసిడర్ కారు మాయమై పోయింది.

అందరూ చూస్తుండగానే – పట్టపగలు– నట్ట నడిరోడ్డుమీద శ్రీనాథ్‌ని హత్యచేసిన దుండగుల్ని ఎవరూ పట్టుకునే ప్రయత్నం చెయ్యలేదు.

సీతాదేవి శిలా ప్రతిమైపోయింది.

దేదీప్య పిచ్చెక్కిన దానిలా – రోడ్డుకి అడ్డంగా – రక్తపుమడుగులో పడి వున్న తండ్రి శవం మీద పడిపోయింది.

* * * * * * * * * *

అయిపోయింది!

తను అనుకున్నదంతా అయింది!

ఆ దుండగులు తన భర్తని హతమార్చారు.

తమ రహస్యాలు శ్రీనాథ్ గుప్పెట్లో వున్నాయనీ – జైలు నుంచి విడుదల కాగానే వాటిని పోలీసులకి తెలియజేస్తాడనే భయంతో – అమాయకుడైన తన భర్తని నిర్దాక్షిణ్యంగా చంపివేశారు.

నల్ల కళ్ళజోడు పెట్టుకున్నంత మాత్రాన ఆ దుండగుడిని తాను గుర్తించ లేదనుకున్నాడో ఏమో!

వాడు – మురళి!

వాడిని చూసి పుష్కరం దాటినా – వెయ్యి కళ్ళజోళ్ళతో తన ఐడెంటిటీని తప్పుకోవాలని ప్రయత్నించినా – తన కళ్ళనుంచి వాడు తప్పించుకోలేడు! అంత స్పష్టంగా అతన్ని గుర్తించినా తను చేసిందేవిటి? శవపరీక్ష చేసిన పోలీసులకు తను నిజం చెప్పగలిగిందా? చెప్పి ఏం ప్రయోజనం? అందుకు బలమైన సాక్ష్యం కావాలి!

తనో జడ్జి అయినా హతుడిభార్య! భార్య సాక్ష్యం బలమైన సాక్ష్యంగా నిలబడక పోవచ్చు.

అప్పుడు–?

అప్పుడు మళ్ళీ వాళ్ళు రాబందుల్లా తనని వెంటాడుతారు. తనేమయినా

ఫర్వాలేదు. కానీ తన దీప.....? లోకం తెలియని తన బిడ్డని వాళ్ళేమయినా చేస్తే?

నో.... తను భరించలేదు!

అందుకే సత్యానికి సంకెళ్ళు వేసి, న్యాయాన్ని సమాధి చేసి, మూగదానిలా మిగిలి పోయింది. అయినప్పటికీ వాళ్ళని వదిలిపెట్ట కూడదు.

చట్టం – న్యాయ చట్రంలో వాళ్ళను బిగించడానికి తనే ఓ పథకాన్ని వెయ్యాలి. అంతదాకా తను మాట్లాడకూడదు– అనుకున్న సీతాదేవి ఏడ్చే ఓపిక నశించగా ఓమూలగా కూర్చుని కుమిలిపోతోంది. ఆమె పెదవి విప్పి అప్పటికి మూడురోజులయింది.

తన రూంలో పడుకునివున్న దేదీప్య సీలింగ్‌కేసి తదేకంగా చూస్తోంది. ఆమెకి కోలుకోలేని షాక్ తగిలింది. ఆమె నిలువెల్లా మూగవోయింది.



కమ్మని కలలోంచి హఠాత్తుగా మెలుకు వొచ్చినట్లయిందామెకి. జోల పాడుతూ పాడుతూ- వెచ్చటి ఒడిలోంచి ఒక్కసారిగా క్రింద పడేసినట్లయిందామెకి!

తండ్రి జైలునుంచి రావడం .... కొన్ని రోజులు తమతో కలిసి ఉండడం.... చనిపోవడం.... కాదు... చంపపడడం... అంతా భ్రమలా నమ్మశక్యం కాకుండా వుంది.

తన తండ్రి ఎంత మంచివాడు? ఎంత దయార్ద్ర హృదయుడు? అందుకేనేమో అంత దురదృష్టం. యుక్తవయస్సులోనే ప్రేమించిన భార్యనీ, అప్పుడే కళ్ళు తెరిచిన బిడ్డనీ వదిలి జైలుకెళ్ళాడు. జైలు నుంచి విడుదలై – తన వాళ్ళని కలుసుకున్న ఆనందం పూర్తిగా పొందాడో లేదో – అతిదారుణంగా చంప బడ్డాడు.

ఇన్నాళ్ళూ ముఖంలో ఆనందపు ఛాయలు కరువైనా- సుమంగళిగా కళకళలాడుతుండేది అమ్మ. ఇప్పుడామె బొట్టుని చెరిపేసిన హంతకుల్ని వదలకూడదు.

కళ్ళారా ఆ ఘోరాన్ని చూసి కూడా తాను పెదవి విప్పలేదు- కారణం - చట్టం వాళ్ళని శిక్షించలేదనే గట్టినమ్మకంతోనే. ఆ ఇద్దర్లో ఒకర్ని తాను బాగ గుర్తుపట్టింది. వాడు – ఆరోజు తనని రేప్ చెయ్యడానికి ప్రయత్నించి



# 'పవిత్ర పాపి' సీరియల్ పాఠకులకు ఆహ్వానం

వారం వారం పాఠకులు చెప్పే కథలకు విలువైన

## బహుమతులు

## నేరం... నేరం... నేరం... నేరం జరగని చోటు భూస్థలమంతా వెదికినా దొరకదు!

మానవ జాతి పుట్టింది మొదలు ఈ భూమండలమ్మీద ఎన్నెన్నో నేరాలు... ఘోరాలు... రక్తపాతాలు జరిగాయ్. జరుగుతున్నాయ్!

అయితే– ఆధునిక సమాజంలో వాటి సంఖ్య పెరిగి, పెరిగి "నేరం జరగని చోటు భూస్థలమంతా వెదికినా దొరకదు" అన్న మాట సామాన్య సూక్తిగా మారిపోయింది.

ఈ అంశాల మీద ఈ తరం పరిశోధనాత్మక రచయిత చల్లా సుబ్రహ్మణ్యం సంధిస్తున్న నవ్య సమ్మోహనాస్త్రమే 'పవిత్ర పాపి' సీరియల్. ఇదొక పరిశోధనాత్మక 'మహాయజ్ఞం.'

అయితే – ఈ రోజు సమాజంలో క్షణ క్షణం జరుగుతున్న కోట్లాది నేరాలను ఏ ఒక్కరూ సంపూర్ణంగా రాయలేరు. అందుకే అభిమాన పాఠకులందరికీ 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' ఓ అపూర్వ అవకాశాన్ని కల్పిస్తోంది.

ప్రతిరోజూ మీ చుట్టూ అనేక నేరాలు, ఘోరాలు అనేకం జరుగుతుంటాయ్. మీరు విన్నవి, చదివినవి, మిమ్మల్ని కదిలించినవి ఏవైనా సరే... నేర సంఘటనల గురించి మీకు వచ్చిన భాషలో రెండు అరఠావులపై కాగితానికి ఒక వైపే రాసి మీ ఫొటోతో సహా పంపండి. ప్రతీ వారం వచ్చిన వాటిలో ప్రచురణ యోగ్యంగా వున్న రెండు వాస్తవ గాథల్ని ప్రచురిస్తాం.

అచ్చయిన ప్రతి రచనకూ ఈ సీరియల్‌ను సమర్పిస్తున్న 'హెల్త్ హోం ప్రొడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్' వారు 50/- రూపాయిల విలువైన బహుమతిని అందజేస్తారు. అంతేకాదు– పాఠకులు చెప్పే చక్కటి కథలకు 'పవిత్ర పాపి' నవల కాపీని రచయిత ఆటోగ్రాఫ్‌తో పోస్ట్ ద్వారా పంపిస్తారు.

మనకి తెలిసిన నేరం అందరికీ చెబితే సమాజంలో నేర ప్రవృత్తిని తగ్గించిన వాళ్ళమవుతాం. ఒక సామాజిక ప్రయోజనాన్ని ఆశించి చేస్తున్న ఈ ప్రయోగంలో మీరూ భాగస్వాములు కావాలన్నది మా ఆకాంక్ష.

మీకు తెలిసిన నేరాన్ని గురించి వెంటనే రాసి పరిశీలనకి పంపండి.

రచనలు పంపవలసిన చిరునామా :

నాకు తెలిసిన నేరం'
పవిత్ర పాపి' సీరియల్)
ఆంధ్ర సచిత్ర వారపత్రిక
గాంధీనగరం, విజయవాడ–520003

వాళ్ళలో ఒకడు. రెండవ వ్యక్తిని ఎక్కడో చూసినట్టుగా వుంది..... ఎక్కడ అనేదే అర్థం కావడం లేదు. తాను గుర్తించిన వ్యక్తి గురించి తల్లికి గానీ పోలీసులకి గానీ చెబితే – వాడిని తనే రక్షించినట్లు అవుతుంది. చట్టం కళ్ళు కప్పగల డబ్బున్న మనుషుల అండ వుంది వాడికి! ఎలాగో బయటపడతాడు.

చట్టాల్లోని లొసుగుల్ని వాడుకుని సంవత్సరాల తరబడి కోర్టులో కేసునడుస్తూ వుంటుంది. కింది కోర్టు శిక్ష వేస్తే పై కోర్టుకు వెళతారు. పై కోర్టు శిక్ష విధిస్తే ఇంకా పై కోర్టుకు వెళతారు. అలా కాలయాపన జరిగిపోతుంది. అలాగయితే తన కక్ష తీరదు. కళ్ళముందే తన తండ్రిని వేటాడి చంపిన ఆ కసాయివాళ్ళని తను తేలిగ్గా వదిలి పెట్ట కూడదు. అవును! వదలదు!

రాకాకి చెప్పాలి. అతను వాళ్ళని కండకండాలుగా నరికి రాబందులకు ఆహారంగా వేస్తాడు! నడిరోడ్లో ఉరితీస్తాడు!

ఉహూ! లేదు! రాకా వాళ్ళని శిక్షిస్తే తన పగ చల్లారదు. తన తండ్రి ఆత్మకు శాంతి లభించదు! పితృ ఋణం తీర్చుకోవాలంటే ఏదో విధంగా తనే వాళ్ళని సర్వనాశనం చెయ్యాలి! అలా జరగాలంటే మొదట తను చేయవలసిన పని ఒకటుంది!

అది – కారులో వచ్చిన ఆ కూలింగ్ గ్లాసెస్ వ్యక్తెవరో కనుక్కోవాలి!

తన 'ఆలోచన' అమ్మకి చెప్పే ప్రసక్తి లేదు! ఆమెకీవిషయం తెలిసిన మరుక్షణం ఈ దేశం నుంచే తనని బయటికి పంపివేసే ప్రయత్నం చేస్తుంది! తన భవిష్యత్‌ని దృష్టిలో వుంచుకుని అమ్మ ఆపని చెయ్యకమానదు!

రాకా అయినా అంతే! ఆడపిల్లవీ, అమాయకురాలివీ గనుక నేరం నీడ కూడా నీ మీద పడకూడదు అంటాడు. కానీ.... వాళ్ళకేం తెలుసు తన గుండెల్లో బ్రద్దలవుతున్న అగ్ని పర్వతాలు? తన తండ్రికి తను ఒక్కతే! కూతురైనా కొడుకైనా తనే! అందుకే తన వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించడానికి తనే నడుం కట్టాలి!

ఎంతకాలమైనా సరే? తనేమయినా ఫర్వాలేదు. ఓర్పుతో వాళ్ళను మట్టుపెట్టాలి! అందాకా మౌనంగానే వుండాలి తను! అని ఆలోచిస్తున్న దేదీప మస్తిష్కంలో పకడ్బందీగా ఒక ప్లాను రూపు దిద్దుకోసాగింది.

* * * * * * * * * *

"వాట్ నాన్సెన్స్ యు ఆర్ టాకింగ్? మీ నాన్నని పట్టపగలు హతమార్చిన ఆ దుండగుల్ని మీ అమ్మా, నువ్వూ గుర్తు పట్టలేరా? కనీసం చూస్తే కూడా పోల్చుకోలేరా?' రిడిక్యులస్?" అన్నాడు రాకా.

ఫోన్ రిసీవర్ని పట్టుకున్న దేదీప్య చెయ్యి మరింత బిగుసుకుంది. పళ్ళబిగువున బాధని అణుచుకోవడానికి ప్రయత్నిస్తూ–

"అవును..... ఆ షాక్‌లో ... వాళ్ళని... సరిగ్గా చూళ్ళేక పోయాం?" అంది.

"–పాత శత్రువులెవరైనా ఈ పని చేసి వుండాలి. గనుక మీ అమ్మగారయినా వాళ్ళని గుర్తుపట్టి వుండాలే? మరో సారి అడుగు!" అన్నాడు రాకా.

"అడగను! ఆమె గుర్తించి వుంటే పోలీసులకి ఆవిషయం చెప్పేది! మళ్ళీ అడిగి బాధపెట్ట లేను!"

క్షణం ఆలోచించిన రాకా–

"వాళ్ళు ఎలా వచ్చారు? కార్లోనేగా?" అనడిగాడు.

"అవును".

"కారు నంబరు. రంగు..... "

"ఏమో..... ఏదీ జ్ఞాపకం లేదు!" అంది దేదీప్య కళ్ళనీళ్ళు తడుచుకుంటూ.

"ఛ! చాలా ఇర్రెస్పాన్స్‌బుల్‌గా వున్నారు మీరిద్దరూ.... " అన్నాడు.

కొన్ని క్షణాల మౌనం తర్వాత–

"పోనీ ఓ పని చెయ్యగలవా?" అనడిగాడు.

"ఏమిటది?"

"మీ అమ్మగారికి తెలీకుండా – మీ నాన్నగారి పాతకేసు ఫైలు తీసుకొస్తే – మనకి కొన్ని క్లూలు దొరుకుతాయి!" చెప్పాడు.

దేదీప్య కాసేపు మౌనంగా వుండిపోయింది.

"అలాగే ట్రై చేస్తాను. కాని..... నాన్నే లేకపోయాక ఇక ఎవర్ని శిక్షిస్తే ఏం లాభం?" అంది దేదీప్య.

"అంతబేలగా మాట్లాడకు దేదీప్యా? అయినా ఏదో చెయ్యాలని నేనడగడం లేదు. కేవలం నా క్యూరియాసిటీని శాటిస్ఫై చేసుకోవడం కోసం అడిగానంతే!" అన్నాడు రాకా.

అది నిజం కాదనీ – తనకి తెలీకుండా ఆ దుండగుల్ని అచూకీ తీసి పట్టుపెట్టడానికే రాకా ఆ వివరాలు కావాలంటున్నాడని ఆమెకి తెలుసు.

అయినా ఆమె ఏమీ మాట్లాడలేదు.

"వాట్ దేదీప్యా? ఆ ఫైలు తెస్తావా?" అడిగాడు రాకా.

"ఏమో.... ట్రై చేస్తాను. చెప్పలేను.... బహుశా ఫైలు దొరక్కపోవచ్చు" అంది నిరాసక్తంగా.

"ఎనీహౌ.. ట్రై చెయ్యి..... బై...." ఫోన్ పెట్టేశాడు రాకా కానీ – అప్పటికే – దేదీప్య తండ్రి తాలూకు ఫైలును చేజిక్కించుకుని క్షుణ్ణంగా చదివిందని రాకాకి తెలియదు!!!

* * * * * * * * * *

"వాటీజ్‌దిస్ నాన్సెన్స్! మా ఇల్లేమయినా మ్యూజియం అనుకున్నారా? అడుగడుగునా మాకీ పోలీసుల బెడదేమిటి?"

అన్నాడు మోహన్రావ్ కుక్కుటేశ్వర్రావుని చూడగానే మండిపడుతూ. కుక్కుటేశ్వర్రావ్ బిక్కచచ్చి పోయాడు. అతను పోలీసు డిపార్ట్‌మెంట్‌లో చేరినందుకు చాలా సార్లు తన్ను తాను తిట్టుకుంటూ వుంటాడు. అలాంటి సందర్భాల్లో ఇదొకటి!

పోలీసు రక్షణ ఏర్పాటు చేసి కాపలా కాస్తే కొందరు నామోషీగా భావిస్తారు. తమలాంటి వాళ్ళని ఎవరేం చెయ్యలేరన్న ధీమాతో ఉంటారు. పోనీ వాళ్ళ మాట మన్నించి ఇంటికి వెళ్ళిపోతే ఎవడో వాళ్ళని పిట్టల్ని కాల్చిపారేసినట్టు కాల్చిపారేస్తాడు. ఆ తర్వాత తమని ఉద్యోగం లోంచి పీకిపారేస్తారు! పై అధికార్లు తమని పీల్చేస్తారు! ముందు నుయ్యి – వెనకగొయ్యి లాంటి పరిస్థితి!

కూతురు పెళ్ళి అయిన మర్నాడు మోహన్రావు తన ఇంటికి ఎదురుగా చిన్న కొండ మీద కట్టుకున్న 'లవ్‌నెస్ట్' బిల్డింగ్‌లో శోభనం ఏర్పాటు చేశాడు. నిజానికి ఆ బిల్డింగ్ పరిసరాల్లో ఎవరు నిలబడినా తచ్చాడినా మైక్రోస్కోప్‌లో కనబడినట్టు కనబడిపోతారు. జరుగుతోంది శోభనం అయినప్పటికీ – ఎంతో రక్షణవున్న కాంపౌండ్‌లో వున్నప్పటికీ ప్రత్యర్థి 'రాకా' అయేసరికి పోలీసులకి డ్యూటీ తప్పలేదు. మోహన్రావు లాంటి బిగ్‌షాట్స్‌కి ఈ బందోబస్తు తలవంపులుగానే వుంటుంది మరి!

ఆయన కోపం అంతా ఆవిరయ్యేదాకా ఓపికపట్టాడు కుక్కుటం. ఆ తర్వాత మెల్లగా చెప్పాడు.

"చూడండి సార్! ఈ పొజిషన్‌లో నాకూ ఎంబరాసింగ్ గానే వుంది? కొత్త దంపతులు ఓ పక్క శోభనం చేసుకుంటుంటే – ఇంట్లో పెళ్ళాన్ని వదిలేసి దేభ్యం ముఖాలేసుకుని ఇక్కడ నిల్చోవడం నిజంగా మా ఖర్మ! కానీ తప్పదు. ఆర్డర్స్ అలా వున్నాయేమరి! అయినా పెళ్ళికి చేసినంత హడావుడి మేమేం చెయ్యడం లేదు. ఏదో నేనూ, మా యస్సై నరసింహ, మరో ఇద్దరు కానిస్టేబుల్స్ ఉంటామంతే. మాకు అదుగో.... ఆ చలిలో కుర్చీలు వేయిస్తే రాత్రంతా అక్కడే తగలడతాం!" అన్నాడు కుక్కుటం.

అతని అవస్థ చూసిన మోహన్రావుకి జాలీ నవ్వూ రెండూ వచ్చాయ్.

"నో.... నో మిస్టర్ కుక్కుటం! యు ఆర్ మైగెస్ట్స్! ఈ హాల్లో సోఫాలు వేయిస్తాను" అని, అప్పుడే అటుగా వచ్చిన ఓ తెల్లటి అందమైన యువకుడిని చూపిస్తూ –

"బైదిబై.... వీరు మా అల్లుడుగారు. వాసు!" అంటూ పరిచయం చేశాడు








మోహన్రావు.

"విష్ యు ఎ వెరీహాపీ మేరీడ్ లైఫ్! మా గ రించి మీరేం వర్రీ అవకండి" అన్నాడు కుక్కుటం.

పెళ్ళికొడుకు నవ్వి, సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. మోహన్రావ్ పోలీసులకోసం సోఫాలు వేయించి వెళ్ళిపోయాడు. కుక్కుటం తన మహాకాయాన్ని సోఫాలో చేర్చి యస్. ఐ. వేపు చూశాడు.

అంతపెద్ద సోఫాలో కూర్చున్నప్పటికీ రెండు వేపుల్నుంచీ తొంగి చూస్తోన్న సి. ఐ. గారి శరీరాన్ని చూసిన యస్. ఐ. కి నవ్వాగలేదు.

"ఏమిటోయ్..... నీ శోభనం గుర్తొచ్చిందా? తెగ కులుకుతున్నావ్? నువ్విప్పుడు డ్యూటీలో వున్నావ్..... తెలిసిందా? పిచ్చిపిచ్చి ఊహల్లో తేలావంటే మునిగిపోతావ్! టేక్కేర్!" అన్నాడు కుక్కుటం రొప్పుతూ

"యస్సార్!" అన్నాడు నరసింహ గుటకలు మింగుతూ.

"యస్సార్ కాదు... కళ్ళుట్టుకుని విజిలెంట్‌గా వుండు, నేనలా ఓ కునుకు తీస్తా! అంటే నిద్ర పోతాననుకునేవ్! కాదు..... క్రైమ్స్, వాటి తీరు తెన్నుల గురించి ఆలోచిస్తానన్నమాట!"

అన్నాడు కుక్కుటం!

మనసులో బూతులు తిట్టుకుంటూ–

"యస్సార్!" అన్నాడు నరసింహ మరోసారి!

అప్పుడు సమయం

పదిన్నర కావొస్తోంది!!

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

సరిగ్గాఅదే సమయానికి–

మెల్లగా తలుపులు తెరుచుకుని గదిలోకి అడుగు పెట్టింది శైలజ. గదిని అత్యంత మనోహరంగా అలంకరించారు. గది మధ్యగా వేసి వున్న మంచాన్ని పూలతో ముంచేశారు. ఎదురుగా వీడియోసెట్– బెడ్ పక్కన టీపాయ్ మీద పళ్ళు– స్వీట్స్– మంచం మీద పందిరిలా మల్లె మాలలు వేశారు!

గుమ్మం దగ్గరే నిలబడిన శైలజని సమీపిస్తూ–

"రా... శైలూ! అక్కడే నిలబడ్డావేం? సిగ్గా?" అన్నాడు వాసు మెల్లగా ఆమె చేతిని పట్టుకుని.

శైలజ సిగ్గు పడుతూ మృదువుగా అతని చేతిలోంచి తన చెయ్యి విడిపించుకుంది.

"ఈ రోజు నువ్వెలా వున్నావో తెలుసా?" అన్నాడు వాసు ఆమెని మంచం మీద కూర్చోబెడుతూ.

కళ్ళతో చెప్పమన్నట్టుగా చూసింది శైలజ.

"ఏమరుపాటున దివి నుంచి భువికి దిగి వచ్చిన దేవకన్యలా వున్నావ్! నిన్ను చేసుకోవడం నిజంగా నా అదృష్టం!" అన్నాడు వాసు.

"కాదు..." వీణ మీటినట్టు అంది శైలజ.

"మిమ్మల్ని చేసుకోవడం నా అదృష్టం!" అంది.

"ఓకే! కాంప్రమైజ్ కొద్దాం! మనం ఒకరొనొకరం పెళ్ళి చేసుకోవడం మన ఇద్దరి అదృష్టం!" అన్నాడు వాసు.

సినిమా లెవెల్లో యిద్దరూ కిలకిలా నవ్వేశారు.

"అబ్బా... అలా నవ్వకు... నా ప్రాణం పోతోంది..." అన్నాడు వాసు ఆమెని దగ్గరకు తీసుకుంటూ.

ఆమె అతని గుండెలపై వాలిపోయింది.

"ఏవిటో శైలూ... చాలా చెప్పాలనుకున్నాను... నువ్ దగ్గరకి రాగానే మాటలు రావడం లేదు! కాదు... మాటలు మర్చిపోతున్నాను!" అన్నాడు వాసు ఆమెకి మరింత సమీపంగా జరుగుతూ.

"నాకూ అంతే!" అంది శైలజ మంద్ర స్వరాన.



# న్యాయపీఠం



బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

## సర్వీస్ కమిషన్ వారు ఇంటర్వ్యూలో 12.2 శాతం దాటి మార్కులు వెయ్యరాదు

అశోక్‌కుమార్ హర్యానా సర్వీస్ కమిషన్‌కు ఉద్యోగం కొరకు దరఖాస్తు పెట్టుకున్నాడు. వ్రాత పరీక్ష తర్వాత అశోక్‌కుమార్‌ను సర్వీస్ కమిషన్ వారు ఇంటర్వ్యూకు పిలిచారు. ఇంటర్వ్యూ తర్వాత అశోక్‌కుమార్ ఎన్నిక కాలేదు. అశోక్‌కుమార్ సర్వీస్ కమిషన్‌పై సుప్రీమ్ కోర్టులో రిట్ పిటిషన్ వేశాడు. ఇంటర్వ్యూలో నూటికి 25 మార్కులు ఇష్టమైన వారికి వేసి ఎన్నిక చేశారని తనకు తక్కువ మార్కులు వేసి ఎన్నిక చేయలేదని అశోక్‌కుమార్ వాదన. సుప్రీమ్ కోర్టు వారు తమ తీర్పులో యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ వారు ఐ. ఏ. ఎస్. మొదలగు ఉద్యోగాలకు ఇంటర్వ్యూ మార్కులు 12.2 శాతం మాత్రమే వేస్తున్నారని అది న్యాయ సమ్మతంగా ఉన్నదని పేర్కొన్నారు. అది వ్రాత పరీక్షకు, ఇంటర్వ్యూకు సమానంగా ఉంటుందన్నారు. కనుక ఇక ముందు హర్యానా సర్వీసు కమిషన్ వారు వ్రాత పరీక్ష తర్వాత ఇంటర్వ్యూ చేసినప్పుడు ఇంటర్వ్యూ మార్కులు నూటికి 12.2 % మాత్రం వెయ్యాలని అది దాటి వెయ్యకూడదని ఆదేశాలు జారీ చేశారు. యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ వారు ఇదే విధంగా ఇంటర్వ్యూ మార్కులు వేస్తున్నారు కనుక దేశమంతటా ఒకే విధానం ఉండటం మంచిది గనుక మిగిలిన రాష్ట్రాలలోని పబ్లిక్ సర్వీస్ కమిషన్ వారు కూడా ఇంటర్వ్యూ మార్కులు 12.2 శాతం దాటకుండా వెయ్యాలని కూడా సుప్రీం కోర్టు 1985 లో తీర్పు చెప్పారు. ఈ కేసులో ఐదుగురు జడ్జీలు గల ధర్మాసనం తీర్పు చెప్పారు. ఈ తీర్పు భారత దేశంలోని అన్ని రాష్ట్రాల పబ్లిక్ సర్వీస్ కమిషన్లకు కూడా వర్తిస్తుంది. ■

---

అతను ఆమె చుబుకం ఎత్తి ఆమె కళ్ళల్లోకి తన్మయంగా చూస్తూ- ఆమె పెదవుల మీద సుతారంగా ముద్దు పెట్టాడు.

నిలువెల్లా కంపించిపోగా లతలా అతన్ని చుట్టుకుపోయి మళ్ళీ అతనికి తన పెదవుల్ని అందించింది శైలజ.

కొద్దిసేపు ఆ ఇద్దరూ గాఢ పరిష్వంగంలో మధురానుభూతులు పంచుకుంటూ అలానే వుండిపోయారు.

టక్... టక్...

టక్... టక్...

గడియారం శబ్దం తప్ప నిశ్శబ్దంగా వుందా గది!

మల్లెల పరిమళం గదంతా వ్యాపించి ఓ విచిత్రమైన మత్తును కలిగిస్తోంది!

టైం పది యాభై అయింది!

ఉన్నట్టుండి శైలజ అతని కౌగిట్లోంచి విడివడి మృదువుగా అతన్ని వెనక్కి తోసింది. అతను కాస్త ఆశ్చర్యంగా-

"ఏమిటి శైలూ..." అన్నాడు.

శైలజ సమాధానం చెప్పలేదు. సూటిగా రెప్పవేయకుండా వింతగా అతన్ని చూసింది. ఆమెలో ఇదివరకటి సిగ్గులేదు. ఆమె కళ్ళు వింతగా మెరుస్తున్నాయి!

"ఏవిటి శైలూ? అలావున్నావేం? ఒంట్లో బాలేదా?"

అడిగాడు వాసు కొంచెం కంగారుగా.

శైలజ జవాబు చెప్పకుండా పకపక నవ్వింది.

"వాసూ! మా నాన్న, మీనాన్న దగుల్బాజీలు! డబ్బుకి గడ్డితినే కుక్కలు! తెలుసా?" అంది.

ఆమె వింత ధోరణికి ఉలిక్కిపడ్డాడు వాసు.

"ఏమిటి శైలూ! ఇప్పుడు వాళ్ళ సంగతెందుకు? మన గురించి మాట్లాడుకుందాం!" అన్నాడు ఆమెని దగ్గరకి లాక్కోబోతూ అతని చెయ్యి విదిలించి కొట్టిందామె!

"నో! ఆ దగుల్బాజీల సంగతే మాట్లాడాలిప్పుడు. వాళ్ళ బ్రతుకులు చీకటి గుహలు! డబ్బుకోసం ఎన్ని ఘోరాలయినా చేసే నయవంచకులు!"

ఆమె ధోరణి అతనిలో ఏదో అనుమానాన్ని కలిగించింది.

ఆమె నిజంగా తెలివిలో వుండే మాట్లాడుతోందా? లేకపోతే ఏదో అపస్మారక స్థితిలో సంధి ప్రేలాపన చేస్తోందా? అనుకుంటూ-

"శైలూ! ఏమిటామాటలు? ఆర్ యు ఆల్‌రైట్?" అదుర్దాగా అడిగాడు.

"అయాం క్వైట్ ఆల్‌రైట్ మైడియర్ యంగ్‌మాన్! కానీ, మా నాన్న మోహన్రావూ, మీ నాన్న సుబ్బారావూ ఎవర్నీ హాపీగా ఉండనివ్వడం లేదు. డబ్బుకోసం ఇసుకతో బిల్డింగ్‌లు కట్టి మనుషుల్ని సజీవ సమాధి చేస్తున్నారు! అందుకు శిక్ష ఎవరికో తెలుసా? మనకే!" అంది శైలజ ఆవేశంతో ఊగిపోతూ.

మెంటల్ బ్యాలన్స్ తప్పి సైకిక్‌లా మాట్లాడుతోందేమో.... అనుకున్న వాసు 'షాక్‌ట్రీట్‌మెంట్' యిచ్చే ఉద్దేశ్యంతో ఈడ్చి చెంపమీద కొట్టాడు.

ఆ దెబ్బకు కనీసం ఆమెలో చలనం లేదు సరికదా పకపక నవ్వింది!

"యు ఆర్ ఎఫూల్ మిస్టర్ వాసూ! నిజం చెబితే నమ్మడంలేదు. అయినా శిక్ష తప్పదు. బిరెడీ!" అంది శైలజ.

రెండడుగులు ముందుకేశాడు వాసు. శైలజ గిరుక్కున వెనక్కి తిరిగి టేబుల్ దగ్గరకెళ్ళి డ్రా తెరిచింది. డ్రాలోంచి ఏదో వస్తువు తీసి వాసువేపు తిరిగింది.

ఆమెని చూసిన వాసు త్రుళ్ళిపడ్డాడు.

ఆమె చేతిలో

నల్లని రివాల్వర్ నిగనిగ మెరుస్తోంది.

"శైలూ.... వాటీజ్ దిస్!" అన్నాడు కంగారుగా ముందుకు రాబోతూ-

"స్టాప్ దేర్!" గద్దించింది శైలజ "చెప్పానుగా శిక్ష విధించాలని! మాటలతో టైం వేస్ట్ చెయ్యక అలాంటి తండ్రికి పుట్టినందుకు పశ్చాత్తాపపడు. మరో జన్మలో అతనికి కొడుకుగా పుట్టకూడదని భగవంతుణ్ణి కోరుకో! పది లెక్కబెట్టేలోగా నువ్ ప్రార్థన ముగించాలి!" అంది శైలజ రివాల్వర్ కొత్తపెళ్ళి కొడుకు గుండెలకు గురిపెడుతూ.

"శై.... ల.... జా..." వాసు గొంతులో తడారిపోయింది.

"ఒకటి..... రెండు.... మూడు...."

"శైలూ..... స్టాప్.... వాటీజ్‌దిస్!"

"నాలుగు.... అయిదు.... ఆరు....."

"యూడెవిల్! ఆర్యూ మాడ్?"

"ఏడు.... ఎనిమిది..... తొమ్మిది...."

"శై.... ల...... జా...." బిగ్గరగా అరిచాడు వాసు.

(ఇంకా ఉంది)

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

**వి. జె. విశాఖపట్నం**

★ ఆడవాళ్ళు మగాళ్ళకు సమానం ఏమిటి? నన్నడిగితే - మగవాళ్ళే ఆడాళ్ళకి సమానం కాలేరంటాను. మీరేమంటారు?

● నిజమే. కనీ పెంచకలరా? వండి వార్చకలరా? చేతకాని పౌరుషంతో కడివెడు కన్నీళ్ళు కార్చకలరా? తమని తాము చిన్నచూపు చూసుకొంటూ బ్రతుక్కురాకలరా యీ మగవాళ్ళు!!

**జి. ఎన్. ఆర్. సుభద్రాపురం**

★ ప్రేమించుట గొప్పా? ప్రేమించబడుట గొప్పా? ప్రేమించబడాలి అంటే ఏం చేయాలి?

● ప్రేమంటే మీ ఉద్దేశ్యంలో ఏమిటో తెలియకుండా ఎలా చెప్పడం?! నా దృష్టిలో ప్రేమ అంటే - రుచికి ఉప్పు లాంటిది! సంతోషానికి రుచిని పెంచేదీ - దాన్ని శాశ్వతం చేసేదీ (జీవితానికి) ప్రేమే! అంచేత - ప్రేమించడం - బడడం అనేది లేదు. ఇక ప్రేమించబడడానికేం చెయ్యాలి? మీరేం చెయ్యక్కర లేదు - ఎవరేనా మిమ్మల్ని ప్రేమించాలంతే!

★ మనకి స్వాతంత్రం వచ్చిందంటారా కె. రా గారూ?

● మరి ఆగస్టు 15 ఏమిటి? అదేగా! (ఎప్పుడూ - అధికారంలో ఉన్న వారికే వుంటుంది స్వతంత్రం. అందరికీ ఎలా వుంటుందండీ మీ పిచ్చిగాని!)

**వి. ఆర్. ఎమ్. సికింద్రాబాదు**

★ ఈ సమాజం ఎవరిని చూసి భయపడాలి? పతితలని చూసా? ధనికులని చూశా?

● ధనికులని చూసే. గట్టి నమ్మకాలు లేని ధనిక పురుషునికంటే శీలం లేని పేద వనిత చాలా మెరుగు అని వినలేదా?!

**ఎస్. ఎమ్. ఆర్. కాశీబుగ్గ**

★ సెక్సు సైన్సు కథా వస్తువుగా తీసుకొని ఓ నవల రాయకూడదా? కె. రా గారూ!

● ఇంకా పరిశోధనాత్మక ఫిక్షన్ జోలికి పోడంలేదు భాయీ!!

★ భార్య అనారోగ్యంగా వున్నప్పుడు భర్త సహాయ పడడంలో నేరం అంటారా?

● నేరం కాదు - మానవత్వం. అయినా భార్యలకి జబ్బు చేస్తేగాని భర్తలు - చేదోడు వాదోడుగా వుండకూడదని రూలా? లేదే.

★ మానసిక రోగులని చూస్తే మీకేమనిపిస్తుందక్కయ్యా?

● మనం వారిని 'రోగుల'ని ఎందుకు శ్రద్ధగా చూడం? వారు త్వరగా కోలుకుని యింటికి రావాలని ఎందుకు కోరుకోం? అని బాధగా వుంటుంది. (పిచ్చాసుపత్రిలో చేర్చేసి చేతులు కడుక్కునే అయిన వారి శాతం ఎంత ఎక్కువో తెలుస్తే- మీరే ఆశ్చర్య పోతారు!)

★ మన దేశంలో దారిద్ర్యానికి కారకు లెవ్వరు?

● మనమే.

★ ప్రేమికులు విడిపోతే - ఎలా ఫీలవుతారు?

● శత్రువుల్లా!

★ బూతు చిత్రాలు దొంగ చాటుగా కూడా వేయకుండా చేయాలంటే ఏం చేయాలి?

● ఏం చేయలేం. మన వాళ్ళదంతా ద్వంద్వ నీతి. చెప్పేవి కళల గురించి చూసేవి బూతు చిత్రాలు!

**కె. ఎస్. వి. ఆర్. కె. మైలవరం**

★ స్త్రీకి స్త్రీయే శత్రు వంటా రెందుకు? మంగళసూత్రం కట్టి అగ్నిసాక్షిగా ఒకరి బాధలని మరొకరు పంచుకుంటామని ప్రమాణాలు చేస్తారు. మరి హరిశ్చంద్రుడు యివన్నీ పాటించి తను నమ్మిన సత్యం కోసం కట్టుకున్న భార్యను అమ్మేయడం పాపం కాదా?

● ఎవరి పిచ్చి వారి కానందం. అయిన వారి నందరినీ నానా హింసా పెట్టి అర్థం పర్థం లేని మాటిచ్చి అదొక సత్యం- దాని కోసం సర్వం ధార పోస్తానని ఘన కీర్తి గణించిన హరిశ్చంద్రుణ్ణి వదిలేయండి. పెళ్ళాం విసుగొచ్చి చీట్లాటకీ, తాగుడికీ డబ్బు సరిపోక పెళ్ళాలని అమ్మేస్తున్న ఘనుల మాటేమిటి?! ఇక స్త్రీకి స్త్రీయే శత్రువు- అంటే - మూలం పురుషుడే కాని కార్పణ్యం వ్యక్తపరిచే గాత్రం మ్మాత్రమే ఆడది.

**ఎం. జి. అంబుసోలి**

★ స్నేహానికీ ప్రేమకీ తేడా ఏమిటి?

● స్నేహం బలి కోరదు.

ప్రేమలో స్నేహమూ వున్నా- జెలసీ కూడ వుండి తీరడం వల్ల- బలి కోరుతూ వుంటుం దప్పుడప్పుడు!

★ ప్రేమ అనేది ఎప్పుడు ఎలా ఎక్కడ ఉద్భవిస్తుంది?

● కవిత్వానికైతే చెప్పవచ్చు నేమో గాని ప్రేమకి చెప్పలేం! □



# షేర్ మార్కెట్‌లో పెట్టుబడులు



—యన్. రామ్‌జీ, న్యూఢిల్లీ

ఇక మనం ఈ ప్రాస్పెక్టస్‌లోని 3వ పేజీలో ఏమి వున్నదో పరిశీలిద్దాము. ఎ. ఆథరైజ్‌డ్ కాపిటల్, ఈ హెడ్డింగ్ క్రింద 30,00,000 ఈక్విటీ షేర్స్ ఆఫ్ రూ 10 ఈచ్ అని వుంది. అంటే మొత్తం అధీకృత పెట్టుబడి 3,00,00,000 అన్న మాట.

బి. ఇష్యూడ్, సబ్ స్క్రయిబ్‌డ్ అండ్ పెయిడ్‌అప్: దీనిలో 9,60,000 షేర్లు కంపెనీ యాజమాన్యం, తీసుకుంటున్నట్లు, అంతేకాక, వీటిమీద 1:2 నిష్పత్తిలో బోనస్ షేర్‌లుగా (గతంలో కల్గిన లాభం, వాటాలుగా మార్చబడినట్లు) ప్రకటించారు. కాబట్టి ఇప్పుడు యాజమాన్యం 14,40,000 ఈక్విటీ షేర్లు కల్గివుంది. అంటే రమారమి 48 శాతం వాటాలను యాజమాన్యం కల్గివుంది.

రామ్‌జీ కామెంట్: ఈ విషయం చాలా జాగ్రత్తగా పరిశీలించాలి. సాధారణంగా ఏ కంపెనీలోనైనా, యాజమాన్యం వాటా ఎక్కువగా వుంటే, ఎక్కువ శ్రద్ధ తీసుకుంటారు. కొన్ని కంపెనీలను పరిశీలించినట్లయితే, యజమానుల వాటాలు చాలా తక్కువ మొత్తాలలో వుంటాయి. అటువంటి అప్పుడు మన పెట్టుబడులు చాలా రిస్కులో వున్నట్లు లెక్క. ఈ విషయంని ఇన్వెస్టర్‌లు ఎప్పుడూ మర్చిపోకండి సుమా!

సి (1) ప్రజెంట్ ఇష్యూ : 3,00,000 ఈక్విటీ షేర్స్ ఆఫ్ రు. 10 ఈచ్‌ఫర్ కాష్ ఎట్ ఎ ప్రిమియం ఆఫ్ రు. 20 ఫర్‌షేర్. అంటే 3 లక్షల షేర్లు 20 రూపాయిల ప్రీమియంతో అంటే మొత్తం కలిపి 30 రూపాయిలు అయింది.

రామ్‌జీ కామెంట్. ఈ ప్రీమియం చాలా ఎక్కువ అనిపిస్తున్నది నాకు. ఈ విధంగా ఎక్కువ ప్రీమియంలు వసూలు చేసిన చాలా కంపెనీల షేర్లు 50 శాతం తక్కువ ధరలో స్టాక్‌మార్కెట్‌లలో అమ్ముడు పోతున్నాయి. కాని ఏమి చెయ్యలేని నిస్సహాయ స్థితి. ఇది మన పవిత్ర భారతదేశం. ఇది టాప్ సీక్రెట్స్‌ని కేవలం 25 రూపాయలకు అమ్ముతున్న మహానుభావులున్న దేశం. కాబట్టి ఈ కంపెనీలకు కావలసిన ప్రీమియంను, కంట్రోలర్ ఆఫ్ కాపిటల్ ఇష్యూస్ వద్ద నుంచి పొందటం ఏమాత్రం కష్టం కాదు అన్న సంగతి మీ అందరికి తెలిసినదే.

(2) 1,00,000 14% సెక్యూర్‌డ్ రిడీమబుల్ కన్వర్టబుల్ డిబెంచర్స్ ఆఫ్ రు. 240 ఈచ్. ఈ రకంగా మనకు అక్కరలేని వాటిని మనకు అంట కట్టటం మన దేశంలో సర్వ సామాన్యమైన విషయంగా మారిపోయి, ఈ అనివార్య పరిణామం, సాధార్ణ విషయంగా మారిపోయింది. ఇంతకు మించి వీటిని గూర్చి రాసి నేను అనవసరంగా తలనెప్పులు తెచ్చుకో దలుచుకోలేదు.

డి. అవుట్ ఆఫ్ ది ప్రెజెంట్ ఇష్యూ: అంటే ఇప్పుడు క్రొత్తగా ఇచ్చే వాటాలలో ఎవరి ఎవరికి ఎంత ఎంత శాతం రిజర్వ్ చేయబడినది అనేది ఈ క్రింద వుంటుంది.

(1) 15,000 ఈక్విటీ షేర్స్ ఆర్ రిజర్వ్‌డ్ ఫర్ ప్రిఫరెన్షియల్ ఎలాట్‌మెంట్ టుది ఎంప్లాయీస్. అంటే 15 వేల వాటాలను ఆ కంపెనీలో పని చేసే కార్మికులకు, తదితర సిబ్బందికి రిజర్వ్ చేయబడినది.

5000 డిబెంచర్స్ ఆర్ రిజర్వ్‌డ్ ఫర్ ప్రిఫరెన్షియల్ ఎలాట్‌మెంట్ టుది ఎంప్లాయీస్: మరి ఈ అక్కరలేని సరకు, వారి సిబ్బందికి కూడా తప్పదు.

(2) 11,000 డిబెంచర్స్ ఆర్ రిజర్వ్‌డ్ ఫర్ ప్రిఫరెన్షియల్ ఎలాట్‌మెంట్ టు యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా. సాధారణంగా ఇటువంటివి యు. టి. ఐ. ఎందుకు తీసుకుంటుంది అంటే పోర్ట్‌ఫోలియో మానేజ్‌మెంట్‌లో ఈ విధానం ఒక వ్యూహం. 14 శాతం సాలు వడ్డి రావటం మూలంగా యు. టి. ఐ. వారు డివిడెంట్ ఇవ్వటానికి పనికొస్తుంది కనుక.

ఇ. నౌ ఆఫర్‌డ్ టుది ఇండియన్ పబ్లిక్ ఫర్ సబ్‌స్క్రిప్షన్:

(1) 2,85,000 ఈక్విటీ షేర్స్ ఆఫ్ రు. 10 ఈచ్ ఎట్ ఎ ప్రీమియం ఆఫ్ రు. 20 ఫర్ షేం.

(2) 84,000 డిబెంచర్స్ ఆఫ్ రు. 240 ఈచ్‌ఫర్ కాష్ ఎట్‌పార్.

ఈ విధంగా చిట్ట చివరకు రాయటమే కాదు, చిట్టచివరి ప్రాముఖ్యత. సాధారణ ఇన్వెస్టర్‌కు మాత్రమే కేవలం 15–20 శాతం లోపు ప్రజలకు ఇవ్వటం వలన ఒక లాభం వుంది. ఏమిటంటే కంపెనీ పరిస్థితి రాబోయే సంవత్సరాలలో బాగున్నట్లు అయితే ఫ్లోటింగ్‌స్టాక్ తక్కువ వుండటం మూలంగా రేటు ఎక్కువ పలకటానికి అవకాశం వుంది సుమా.

నేను ఢిల్లీ వచ్చిన క్రొత్తలో నాకు తెలిసిన ఒక ఛోటా రాజకీయ నాయకుడు ఢిల్లీ రావటం జరిగింది. అయన మిత్రుడు ఒక ఆయన పంజాబ్‌లో మినిష్టర్‌గా వుండటం మూలంగా ఇద్దరం కలిసి అక్కడకు వెళ్లవలసి వచ్చింది. చాలా బాగుంది ఆయన ఇల్లు. సరే నా మిత్రుడు వూరుకోలేక గురూ ఎలా సంపాదించావు ఇదంతా అన్నాడు. అది చాలా సీక్రెట్. రేపు వుదయం చెప్తానులే అన్నాడు. ఆ మరుసటి రోజు మేము ముగ్గురం ఆయనగారి హోండా కారులో బయలుదేరాము. పచ్చని పొలాలు, బలమైన మనుషులు చూడటానికి చాలా ఆహ్లాదంగా వుంది. అలా ఒక 25 కిలో మీటర్లు పోయిన తరువాత మా కారు ఆగింది. కారులోంచి క్రిందకు దిగాము. అక్కడకి దూరంలో ఒక కొండ, కొండకి ఇవతల చిన్న నది లాటిది. అది వాగు అయ్యుండవచ్చు కూడా. ఆ రాజకీయ నాయకుడు మాకు ఆ వాగుని చూపించి, దానిమీద చిన్న బ్రిడ్జి లాటిది చూపించి ఆ బ్రిడ్జి బాగుందా అన్నాడు. బాగుంది అన్నాము. ఆ బ్రిడ్జి ఖర్చు సగం నా జేబులో వుండటమే నా సీక్రెట్ అన్నాడు. తరువాత 4 సం. గడిచి పోయినాయి. మొన్న డిసెంబర్‌లో నేను విశాఖపట్నం వెళుతున్నానని తెలిసిన ఆ రాజకీయ నాయకుడు (ప్రస్తుతం అయిన ప్రభుత్వంలో లేడనుకోండి) నాతో పాటు వచ్చాడు. సరే ఇద్దరం కలిసి మన నాయకుడి ఇంట్లో బస చేసాము. 4 సంవత్సరాలలో ఎన్నో మార్పులు వచ్చినాయి. మన నాయకుడి ఇల్లు ఇంద్రభవనమైంది. ఈ సారి ఆయన వంతు అయింది. ఏమిభాయి ఇవన్నీ ఎలా సంపాదించావు అని అడిగాడాయన. రేపు వుదయం చెప్తాను అన్నాడు తీవి:. సరే వుదయం ఆయన కారులో బయలుదేరాము. అలా పోగా పోగా ఒకచోట కారు సడన్‌గా ఆగిపోయింది. మరల అదేసీను. కొండ, దాని ప్రక్కన వాగు. వాగుమీద బ్రిడ్జి వుంది చూశారా అన్నారు రాజకీయ నాయకుడు. నాకు కనిపించలేదు. మా పంజాబీ భాయికి కనిపించలేదు. "అదే రహస్యం, ఆ బ్రిడ్జి మొత్తం నా కడుపులో వుంది" అని చెప్పి తన పెరిగిన బొజ్జను హాయిగా తడుముకున్నాడు. మేము ఇద్దరం ఇంకా ఆశ్చర్యంలోంచి తేరుకోలేదు కారు స్పీడు అందుకుంది... □



# ఆంధ్రసచిత్రవారపత్రిక

# 1988 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 7,200/-

**ముగింపు తేదీ : 10 సెప్టెంబరు, 1988**

ఎప్పటిలాగే ఈ ఏడాది కూడా దీపావళి కథల పోటీ నిర్వహిస్తున్నాము. గతంలో లాగే ఈ సంవత్సరం కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని అకారాది క్రమంలో ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచిక, ఆ తరువాతి సంచికల్లో ప్రచురిస్తాము. అనంతరం పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

పోటీలో సంపాదకుని ఎన్నికలో వచ్చిన ఆరుకథలకీ ఒక్కొక్క దానికి రు. 700/- చొప్పున బహుమతి లభిస్తుంది. ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి స్థానంలో వచ్చిన కథకి రు. 750/- అదనపు బహుమతిగా అంద జేస్తాము. బాలట్‌లో రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు. 650/- ; రు. 550/- వంతున అదనపు బహుమతులుగా లభిస్తాయి. మిగిలిన మూడు కథలకీ ప్రత్యేక బహుమతిగా ఒక్కొక్క దానికి రు. 350/- చొప్పున అందజేస్తాము.

పోటీలో సాధారణ ప్రచురణకి స్వీకరించిన కథలకి ఒక్కొక్క దానికి రు. 150/- వంతున వాటి ప్రచురణ జరిగిన తర్వాత ఇస్తాము.

## నిబంధనలు

1. కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి.

2. కథ వ్రాతప్రతి పన్నెండు అరఠావు (ఎక్సర్‌సైజ్ నోట్ పుస్తకం పేజీకి రెట్టింపు) పేజీలకి మించి ఉండరాదు. కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్ పెన్‌తో రాయాలి. వ్రాత ప్రతిపై "1988 దీపావళి కథల పోటీకి" అని మొదటి పేజీ పై భాగంలో స్పష్టంగా రాయాలి.

3. అనువాదాలు, అనుసరణలు, కాపీ కథలు పంపరాదు. గతంలో ఇతర పత్రికలకి పరిశీలనకి పంపిన, ప్రచురింపబడిన, రేడియో, టి. వి. లలో ప్రసారం అయిన రచనలని పోటీకి పంప కూడదు. ఈ మేరకి రచయిత (త్రు)లు హామీ పత్రం రాసి వ్రాత ప్రతికి జతపరిచి పంపాలి. హామీ పత్రం లేని రచనలని పరిశీలించటం జరగదు. ఆంధ్ర పత్రిక సంస్థ ఉద్యోగులు, వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు.

4. రచయిత (త్రు)లు కలం పేరుతో రాసినా, వారు తమ అసలు పేరు, పూర్తి చిరునామా వ్రాత ప్రతి మీద స్పష్టంగా రాయాలి.

5. సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలనీ ఆయా రచయిత (త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము. తరువాత బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలని ఫోటోలతో సహా ప్రచురిస్తాము.

6. పోటీ లో బహుమతి పొందిన కథా రచయిత (త్రు)లు తమ జీవిత వివరాలని, ఫోటో లని పంపి, వాటి ప్రచురణకి అంగీకరించ వలసి ఉంటుంది.

7. రచనలపై వచ్చే ఎటువంటి పేచీలకైనా ఆయా రచయిత (త్రు)లే బాధ్యత వహించ వలసి ఉంటుంది.

8. పోటీకి పంపే కథలని 10 సెప్టెంబరు, 1988కి కానీ ఆలోగా కానీ మా కార్యాలయానికి అందేలా పంపాలి. ఆ తరువాత అందిన వాటిని పోటీకి పరిశీలించటం జరగదు.

9. పోటీకి పంపిన కథలని ఎట్టి పరిస్థితులలోనూ తిప్పి పంపటం జరగదు. కాబట్టి రచయిత (త్రు)లు తమ కథలతో పాటు తపాలా బిళ్లలు అతికించిన, స్వంత చిరునామా కల కవర్లని జతపరచ వలసిన అవసరం లేదు.

10. పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వాటిని వీలు వెంబడి ప్రచురిస్తాము. స్వీకరించిన కథల విషయం ఆయా రచయిత (త్రు)లకి తెలియ చేస్తాము. ప్రచురణకి స్వీకరించని కథల విషయంలో ఆయా రచయిత (త్రు)లకి తెలియ చెయ్యటం సాధ్యంకాదు. కాబట్టి వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదని గమనించ కోరుతున్నాము.

11. పోటీకి పంపే కథలని "సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003" అనే చిరునామాకి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు. కవరు పై భాగంలో "1988 దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి.

రచయిత (త్రు)లు అందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము.

–సంపాదకుడు

# రాజకీయం

సి.వి. సర్వేశ్వర శర్మ
కుమారి చావలి శ్రీవాగ్దేవి

రాఘవరావు ఉదయం లేవగానే వ్యాయామం చేస్తాడు. ఈ అలవాటు అతనికి ఊహ తెలిసినప్పటి నుండి ఉంది. అన్ని పనులతో బాటు శరీర వ్యాయామం ఒక పని అతనికి. యాభయ్యోపడిలో పడినా ముప్పయ్యో పడిలో మనిషిలా ఉంటాడు. వ్యాయామం చేయడం పల్ల పని చేసే తీరులో తేడా ఉంటుందని రాఘవరావు నమ్మిక.

ఎన్ని సార్లు హెచ్చరికగా చెప్పినా కొడుకు సత్యానందం ఆలశ్యంగా మంచం మీద నుండి లేస్తాడు. పన్లన్నీ బద్ధకంగా సాగిస్తాడు. కొడుక్కి మంచి అలవాట్లు నేర్పటం లేదని భార్య రుక్మిణి మీద విసుక్కుంటాడు. రాఘవరావు చాదస్తుడని తల్లీ కొడుకులు మవునంగా ఉంటారు.

రాఘవరావుని ఆశ్చర్యపరచే విషయం సత్యానందం చదువు. ఎప్పుడూ చదివినట్లు కనబడడు. స్కూల్లో మంచి మార్కులతో పాసవ్వడమే కాదు ఎవ్వరినీ ఆశ్రయించకుండా కాలేజీలో సీటు వచ్చింది. కాలేజీ చదువు అంతే. ఇంజనీరింగ్‌లో సీటు సంపాదించుకున్నాడు.

తేడా ఎక్కడ ఉందో రాఘవరావుకు అర్థం కాదు. పిల్లలు తెలివితేటలు పెరిగాయి. వాళ్లకు ఉన్న అవకాశాలు, అనుభవాలు తమ చిన్నతనంలో లేవు. అయినా అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ పోటీ విషయంలో పెరుగుదల ఉంటోంది కాని తగ్గుదల లేదు కదా?

అర్థం కాని ఈ సమస్యకు జవాబు దొరక లేదు రాఘవరావుకు. చదువులో మేలుగా వస్తున్నాడు కాబట్టి వాడిని ఏమైనా అంటే భార్య ఒప్పుకునే పద్ధతిలో ఉండదు.

'శరీరం చురుగ్గా ఉంటే మెదడు చురుగ్గా ఉంటుంది' ఎన్నో సార్లు చెప్పాడు. కొడుకు మామూలుగానే వింటాడు. మనసుకు పట్టించుకోడు.

'రుక్మిణీ : మొక్కలకు నీళ్లు పోశావా?' ఇంటి ఆవరణలో పెంచిన పూల మొక్కలను చూసి ఇంట్లోకి వినిపించేలా అడిగాడు.

'పోస్తాను : వస్తానుండండి' రుక్మిణి జవాబు చెప్పింది. రాఘవరావు ఇంటిని చూసుకుని మురిసిపోతాడు. పేద కుటుంబంలో పుట్టి ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొంటూ చదువు సాగించి ఉద్యోగంలో చేరాడు. క్రమశిక్షణ, కృషి ఈ రెండింటిని నమ్ముకుని జీవితం సాగిస్తున్నాడు. తన కష్టార్జితం. ఈ ఇల్లు, అందుకే ఇల్లంటే అంత అభిమానం రాఘవరావుకు.

ఇంటికి కాంపౌండు గోడ కట్టించాడు. చక్కటి గేటు పెట్టించాడు. ఇంటి ఆవరణలో పచ్చగడ్డి ఏపుగా పెరిగింది. తనకు ఖాళీ సరిపోవడం లేదు. లేకపోతే ఈ పచ్చగడ్డి పీకేసేవాడు.

గేటు తీసిన చప్పుడయింది. రాఘవరావు ఆలోచనల నుండి మామూలు వాతావరణంలోకి వచ్చాడు. ఆవరణలోకి ఒక యువకుడు ప్రవేశించాడు.

రాఘవరావు అతన్ని పరిశీలనగా చూశాడు. మంచి బలంగా ఉన్నాడు. పాతిక సంవత్సరాల వయస్సు ఉండవచ్చు. చేతిలో ఒక పళ్లెం మెడలో దేముడి పటం. పళ్లెంలో చిల్లర పైసలున్నాయి తోడుగా కుంకం కూడా ఉంది.

'ఏమిటి?' రాఘవరావు గంభీరంగా అడిగాడు.

'కుంకం : దేముడి కుంకం : బొట్టు పెట్టుకోండి" యువకుడు అన్నాడు.

రాఘవరావు తెల్లబోయాడు. రుక్మిణి పని చేసుకుంటున్న పని ఆపుకుని తడి చేతులు కొంగుకు తుడుచుకుంటూ కుంకం బొట్టు పెట్టుకునేందుకు బయటకు వచ్చింది.

రాఘవరావు వారించబోయాడు. కుంకం అంటే మాటలా. ఆమె వినిపించుకునే ధోరణిలో లేదు. రూపాయి బిళ్ల పళ్లెంలో వేసింది. నుదుట కుంకం పెట్టుకుంది.

రాఘవరావుకు చాలా కోపం వచ్చింది. రుక్మిణితో వాదించి లాభం లేదు. 'మంచి బలంగా ఉన్నావు. కష్టపడి పని చేసుకుని సంపాదించుకోవచ్చు కదా?' రాఘవరావు అడిగాడు.

యువకుడు రాఘవరావువైపు వచ్చాడు. 'బొట్టు పెట్టుకోండి' చెప్పాడు.

'బొట్టు అడ్డు పెట్టుకుని సంపాదించడం సిగ్గుగా లేదూ. కష్టపడి సంపాదించుకుంటే అందులో ఎంత తృప్తి ఉంటుందో తెలుసా? ఏదైనా పని చేసుకోకూడదా?' ఆ యువకుడిని మార్చాలనే ధోరణిలో రాఘవరావు మాట్లాడుతున్నాడు.

యువకుడు రాఘవరావు మాటలు పట్టించుకునే పద్ధతిలో లేడు. రాఘవరావు చెప్పాడు :'ఇలా అడుక్కోవడం సిగ్గుగా లేదూ. 'మా ఇంటి ఆవరణలో ఉన్న ఈ పచ్చగడ్డి కోసెయ్యి. నీకు కడుపు నిండా అన్నం పెట్టిస్తా' డబ్బులిస్తే దుర్వ్యసనాలకు బానిసలవుతారని రాఘవరావు భయం.

యువకుడు సమాధానం ఏమీ చెప్పలేదు. మాట్లాడకుండా వెళ్లిపోయాడు.

రాఘవరావు నిట్టూర్చాడు. ఆదివారం. కాలక్షేపం బాగానే ఉందనుకున్నాడు. చక్కగా వేడి నీటి స్నానం చేసి వరండాలో ఉన్న కుర్చీలో కూర్చుని దినపత్రిక తిరగవేస్తున్నాడు.

గేటు తీసుకుని ఒక వృద్ధుడు లోపలకు వచ్చాడు. చేతిలో బాగా మాసిన సంచీ ఉంది. రాఘవరావు అతడికేసి చూశాడు. ముష్టి కోసం వచ్చాడు. వృద్ధుడయినా పని చేసే శక్తి ఉన్నట్లు కన్పించాడు.

'ఇలా ముష్టెత్తుకోపోతే హాయిగా ఏదైనా పని చేసుకోరాదూ!' రాఘవరావు అడిగాడు.

'ముష్టెత్తుకోవడం నాకు సరదానా బాబుగారు! పని చూపించండి. పని చేస్తాను' వృద్ధుడు అన్నాడు.

'నీ పేరు'

'ముసలయ్య'

'మా ఇంటి ఆవరణలో అదిగో ఆ కన్పించే గడ్డి కోసెయ్యి. నీకు కడుపు నిండా అన్నం పెడతా' రాఘవరావు అన్నాడు.

'కొడవలి ఇప్పించండి' ముసలయ్య అడిగాడు. రాఘవరావు ఇంట్లోకి వెళ్లి కొడవలి తీసుకువచ్చి ఇచ్చాడు. ముసలయ్య పని ప్రారంభించాడు. చాలా సులువుగా చురుగ్గా పని చేస్తున్నాడు. రాఘవరావుకి ముసలయ్య పని తనం నచ్చింది. మెచ్చుకున్నాడు. రుక్మిణి ముసలయ్యకు అన్నం వడ్డించింది.

ముసలయ్య భోజనం ముగించాడు.

రాఘవరావు ముసలయ్యకు అయిదు రూపాయలు ఇచ్చాడు. ముసలయ్య కృతజ్ఞతతో దండాలు పెట్టాడు.

'ఇంత పని తనం గల నువ్వు పనిలోకి ఎందుకు వెళ్లటం లేదు?' రాఘవరావు ఉండబట్టలేక అడిగాడు.

విచారంగా ముసలయ్య ముఖం పెట్టాడు.

'కూలీలకు మేస్త్రీ కూలి పని చూపిస్తాడు. మేస్త్రీ చెప్పినట్టు వినాలి. లేకపోతే కూలి పని దొరకదు'

'మేస్త్రీకి నీలాంటి పనివాళ్లు ఉంటే అతనికి పేరు వస్తుంది కదా!'

'కూలి పనికి కుర్రాళ్లు బాగా చేస్తారని కామందులు వాళ్లని పంపమని మేస్త్రీని ఒత్తిడి చేస్తున్నారు. ఒకొక్కప్పుడు పనిని బట్టి నేను కూడా ఆళ్లతో వెళ్లేవాడిని.'

'నీ పనితనానికి కామందు మెచ్చలేదా?'

"కుర్ర కూలీలు పని బద్ధకంతో చురుగ్గా పని చేయరు. నాకు పని అలవాటు. 'ముసలయ్య చేసిన పని మీరు చేయలేక పోతున్నారని' కామందులు అంటున్నారు.

సినిమా కుర్ర కూలీలకు దేముడు. ఆడకూలీ పక్క నుంటే గాని మగకూలీ పని చెయ్యడు. కామందు కనుమరుగైతే ఆడ–మగ కబుర్లు. పని ఎక్కడ ముందుకు సాగుతుంది."

రాఘవరావు ఆశ్చర్యంగా వింటున్నాడు.

"మేస్త్రీ దగ్గర కుర్ర కూలీలు పరపతి సంపాదించారు. నా మీద చాడీలు చెప్పారు. మేస్త్రీ నన్ను తిట్టాడు. పన్లోకి రావద్దన్నాడు" కన్నీరు పెట్టుకుంటూ ముసలయ్య చెబుతున్నాడు.

'నువ్వు సొంతంగా కూలి పనికి వెళ్ళొచ్చుగా?' రాఘవరావు అడిగాడు. కూలి పనులు, మేస్త్రీల వ్యవస్థ గురించి రాఘవరావుకు పూర్తిగా తెలియదనిపించింది.

"రోజూ పని వెతుక్కోవడం మాటలా బాబు? పనులు కావలసిన వారు మేస్త్రీ దగ్గరకు వస్తారు. మేస్త్రీ కూలీ మనుషుల్ని పంపిస్తాడు. సొంతంగా కూలీ పనికి నేనొక్కడిని వెళ్ళి ఏమి చేయగలను?" ముసలయ్య చెప్పినది నిజమనిపించింది రాఘవరావుకు.



మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చి నలభయి ఏళ్ళయింది. రాజకీయం ఎదిగినంత చురుగ్గా మనుషుల్లో పని చేసే స్వభావం ఎదగలేదు. పైగా పని చేసే వాళ్ళని తమ కుయుక్తులతో యువకులు బయటకు పంపించేస్తే దేశం ఏమి అభివృద్ధి సాధిస్తుంది?

రాఘవరావుకు ఆలోచిస్తుంటే ఒక విషయం స్పష్టమయింది. తను పని చెయ్యడు కాబట్టి పని చేసేవాడు ఉండకూడదు. పని చేసే వాళ్ళు లేకపోతే ఏమాత్రం కొంచెం పని చేసినా తనే గొప్పవాడయి పోతాడు. ఇదే ప్రస్తుతం నాయకలో ఉన్న పనికి మాలిన రాజకీయం.

'చిత్తశుద్ధితో, దేశప్రగతికి పాటుపడే విధంగా యువత నడుం కట్టి పని సామర్థ్యాన్ని పెంచుకునే విధంగా కృషి చేయాలి. దానికి యువతను తట్టి లేపాలి. ఒక ఉద్యమం మొదలవ్వాలి. విశేషమైన తెలివి, నైపుణ్యం యువకుల్లో వ్యతిరేక ధోరణులలో ఎదగకూడదు. వాళ్ళని క్రమశిక్షణతో ఉత్సాహపరుస్తూ, హెచ్చరిస్తూ ముందుకు నడపగల నాయకుడు కావాలి' అన్పించింది రాఘవరావుకు.

ఇంటింటా ఒకే నాయకుడు ఉండాలి. ముందు తన కొడుక్కి ఉత్తేజం కల్పించాలని రాఘవరావు నిర్ణయించుకున్నాడు. □

# సినిమా విశేషాలు

## చిరంజీవి 100 వ చిత్రం "త్రినేత్రుడు"

"పాపం బ్రద్దలవవలసిన తరుణంలో, ధర్మరక్షణార్థం సర్వేశ్వరుడు మూడవ కంటిని ప్రయోగించినట్లే అమాయక ప్రజల జీవితాలతో చెలగాటాలాడే దుర్మార్గుల అంతు పట్టడానికి కథా నాయకుడు కంకణబద్ధుడవుతాడు గనుకే ఈ పేర నిర్ణయించాం. దుర్వ్యసనాలకు లోనై, యువతరం మత్తు పదార్థాలకు బానిసలై, తమ జీవితాలను ఎలా పాడు చేసుకుంటున్నారో, దానికి విమోచన మార్గమేమిటో సూచించే ఇతివృత్తం. 'జాల్వా' హిందీ చిత్రం ఆధారంగా యండమూరి వీరేంద్రనాథ్ చక్కని స్క్రీన్‌ప్లేను తయారు చేశారు. ఇది హీరో చిరంజీవి 100 వ చిత్రం. పదేళ్ళల్లో వంద చిత్రాలు పూర్తి చేయడం ఓ సాధన కదా" అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన దర్శకత్వం వహించిన అంజనా ప్రొడక్షన్స్ ద్వితీయ చిత్రం "త్రినేత్రుడు"లో భానుప్రియ నాయిక. సత్యనారాయణ, రంగనాథ్,

"విక్కీ దాదా"లో



"త్రినేత్రుడు"లో భానుప్రియ




## జి. ఐ. జి.

నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, సాయి కిరణ్, బ్రహ్మానందం, ఆంథోనీ, హకుల్‌భూషణ్ కర్బందా, మానిక్ ఇరానీ, మాస్టర్ సతీష్, వై. విజయ, అన్నపూర్ణ, డిస్కో శాంతి, ప్రత్యేక పాత్రలో మురళీమోహన్, గెస్ట్‌గా చంద్రమోహన్ నటించారు. సత్యానంద్ సంభాషణలకర్త. రాజ్-కోటి స్వరకల్పనలో వేటూరి, సీతారామశాస్త్రి గీతాలు రాశారు. లోకేసింగ్ ఛాయ, చలం శిల్పం, తార నృత్యాలు, రాజు సాహసాలు, ఎన్. బి. చక్రవర్తి సంయుక్త దర్శకత్వం, కనకేశ్వరరావు -రాయ్ సహకార, దర్శకత్వంతో దుర్గబాయి ప్రొడక్షన్ కంట్రోలర్. కె. ఐ. నరసయ్య ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. "గోవాలో మాదక ద్రవ్యాల ప్రాబల్యం ఎక్కువగా ఉన్నందు వల్ల ఈ సినిమా స్కోప్ చిత్రంలోని కీలక సన్నివేశాలు అక్కడే షూట్ చేశాం. కాశ్మీర్‌లో చిత్రీకరించిన రెండు పాటలు అదనపు ఆకర్షణ. సెప్టెంబర్ 3 న విడుదల." అన్నారు నిర్మాత కె. నాగేంద్రబాబు.

నాగార్జున,జూత్‌చావత్



"ముగ్గురు కొడుకులు"లో రాధ

# కాలరుద్రుడు నాకు పూర్తి తృప్తి నిచ్చిన చిత్రం

**— త్యాగరాజు —**

'నేను నటించి, నిర్మించిన "కొంబరీ మూకన్" తమిళ చిత్రాన్ని చూసి చాలా మంది నిర్మాతలు తెలుగులో నిర్మించటానికి ఉద్యుక్తులయ్యారు. పెద్ద మొత్తాలను కూడా యిస్తామన్నారు. కాని ఎందుకనో ఆ చిత్రాన్ని నేనే తెలుగులో నిర్మిస్తూ కథా నాయకునిగా తెలుగు వారికి పరిచయం కావాలని భావించాను. అందుకు తగిన సన్నాహాలు కూడా చేస్తున్నాను. యీలోగా నిర్మాత, పత్రికా రచయిత అయిన గోటేటి శ్రీ రామారావు, దర్శకులు శ్రీ కట్టా సుబ్బారావు గార్లు యిరువురు నా దగ్గరకు వచ్చి ఆ కథకు కొన్ని మార్పులు చెబుతూ నా పాత్రను పెంచడమే కాకుండా చిత్రంలోని శిల్పాన్ని, పాత్రలను నైసర్గికాలను ఎంతో బాగా పెంచి సెంటిమెంట్ కథగా వ్రాసుకొచ్చి చూపించారు. వారి మార్పులు చేర్పులు నాకు చాలా బాగా నచ్చాయి. హీరో పాత్రకు ఒక విశిష్టత, ఒక ధ్యేయం, ఒక నావెల్టీ కల్పిస్తూ తల్లికాని మరో తల్లి పాత్రను సృష్టించి మానసికమైన సంఘర్షణ, సంక్షోభాలకు ఆవేశాన్ని, ప్రతీకార వాంఛను ఒక కొత్త విధానంలో వ్రాశారు వారు. ఈ విషయంలో నేను, ముఖ్యంగా గోటేటి శ్రీ రామారావు, దర్శకుడు కట్టాసుబ్బారావుగార్లు తీసుకున్న సాహసం, చొరవ యింతా అంతా కాదు. అందుకనే నేను ఎవరికి హక్కులు యివ్వకుండా నేనే



తెలుగులో నిర్మిద్దాము అనుకున్న "కొంబరీ మూకన్" వెర్షన్‌ను గోటేటి శ్రీ రామారావుగారి కుమారుడు వెంకటేశ్వరరావుగారు నిర్మించడానికి అంగీకరిస్తూ దర్శకత్వాన్ని కట్టా సుబ్బారావు గారిని చేయమని కోరాను. రెండు నెలల పదిహేను రోజులలో గోటేటిగారు చిత్రాన్ని అనుకున్న దానికన్నా విశిష్టంగా నిర్మించారు. చిత్రం ఫస్ట్ ప్రింటును చూసి తెలుగులో సూపర్ యాంగ్రీ

ఎంగ్‌మాన్ హీరోగా పేరు తెచ్చుకుంటానని డైరెక్టర్ కట్టా సుబ్బారావుగారు అన్నారు. అయితే నేను హీరోగా నటించిన కాలరుద్రుడు చిత్రంకన్నా ముందుగా విలన్‌గా నటించిన అంతిమతీర్పు చిత్రం విడుదల అయింది. తెలుగు వారందరూ 'సేలం విష్ణు'గా యీ చిత్రంలో నన్ను చూచి చాలా బాగా నటించావని వుత్తరాలు రాస్తున్నారు. అయితే నేను ఆ చిత్రంకన్నా మిన్నగా ఎంతో గొప్పగా నటించిన "కాలరుద్రుడు" చిత్రాన్ని చూచి మెచ్చుకుంటారని ప్రశంసిస్తారని, తమ అభిమాన నాయకునిగా గౌరవిస్తారని ఆశిస్తున్నాను. మిథున్ చక్రవర్తి, అమితాబ్ చిత్రాలలోలా ఫైట్స్ చాలా గొప్పగా వున్నాయని పెద్దలు చెప్పారు. పత్రికా రచయితల ఆశీస్సులతో మీ అభిమాన వాత్సల్యాలతో నా నమ్మకం నిజమై "కాలరుద్రుడు" విజయవంతమైతే చాలు. ఏమంటే నాకు పూర్తిగా తృప్తినిచ్చిన చిత్రం యీ "కాలరుద్రుడు". "అంతిమ తీర్పు" చిత్రంలో నటించిన అందాల భామ ఊర్వశి "కాలరుద్రుడు" చిత్రంలో నా సరసన నాయికగా నటించింది. "కాలరుద్రుడు" చిత్రాన్ని మీరు చూశాక మిమ్మల్ని కలుసుకుంటాను.' అంటున్నారు హీరోగా ప్రేక్షకుల ముందుకి వస్తున్న త్యాగరాజు. □

## కోదండరామిరెడ్డి, నాగార్జునలతో "విక్కీ దాదా"

"కోర్టులో సరైన న్యాయం జరగకపోవడం, ఇండియన్ పీనల్ కోడ్ కేవలం సాక్ష్యాల మీదనే ఆధారపడిందని గ్రహించిన లాయర్ విక్రమ్ 'దాదా'గా మారుతాడు. ఆ తర్వాత సాక్ష్యాలతో న్యాయాన్ని అన్యాయంగా చూపించే భారత శిక్షాస్మృతికి సాక్ష్యాలు లభించకుండా 'దాదా'గా తాను అనుకున్న న్యాయాన్ని ఎలా చేస్తాడన్న సామాజిక సమస్యలతో యండమూరి వీరేంద్రనాథ్ సమకూర్చిన రసవత్తరమైన కథ. లాయర్ విక్రమ్ రాసుకున్న డైరీ కథగా మొదటి సగమంతా ఫ్లాష్ బాక్‌గా నడుస్తుంది. రెండో సగం అనూహ్యమైన మలుపులతో నడుస్తుంది. కార్ మెకానిక్‌గా నాగార్జున సరసన రాధ తొలిసారిగా నటిస్తోంది," అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. హిందీ తార జూహి చావలా మరో నాయిక. సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, కన్నడ ప్రభాకర్, రంగనాథ్, సుధాకర్, ప్రసాద్‌బాబు, బ్రహ్మానందం, శ్రీవిద్య ఇతర నటవర్గం. గణేశ్‌పాత్రో మాటలు, వేటూరి పాటలు, రాజ్ కోటి సంగీతం, సుధాకరరెడ్డి ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం,

అతను బాగా నటించగలగటానికి కారణం అతను నిజంగా గూండాయే. వేషం ఇవ్వకపోతే తంతానన్నాడు మరి.



సూ[illegible] సాహసాలు, కె. సదాశివరావు సంయుక్త దర్శకత్వం, మోహన్ ప్రొడక్షన్ కంట్రోలింగ్, సుబ్రహ్మణ్యం ప్రొడక్షన్ ఎగ్జిక్యూషన్, డి. వెంకటరత్నం కూర్పుతో ఈ చిత్రాన్ని నిర్మిస్తున్న కామాక్షి ఆర్ట్ మూవీస్ అధినేత డి. శివప్రసాదరెడ్డి, "జులై నుంచి అక్టోబర్ వరకు ప్రతి నెలా మొదటి పది రోజులు జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ ముగుస్తుంది," అన్నారు. సెప్టెంబర్ 1 నుంచి 10 వరకు ఊటీలో షూటింగ్ ఉంటుంది.

## బాలకృష్ణ, విజయశాంతి జంటతో తారకరామా ఆర్ట్ పిక్చర్స్ చిత్రం

"ఆగస్ట్ 20 న ప్రారంభోత్సవం. నవంబర్‌లో షూటింగ్ ముగుస్తుంది. జనవరి రిలీజ్," అన్నారు కె. దేవీవరప్రసాద్. ఈయన సమర్పణలో ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వం వహించే తారకరామా ఆర్ట్ పిక్చర్స్ చిత్రంలో బాలకృష్ణ, విజయశాంతి, 'ఊర్వశి" శారద, రావుగోపాలరావు, సత్యనారాయణ ప్రభృత నటవర్గం. చక్రవర్తి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, సత్యం ప్రొడక్షన్, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో డి. సుజాత నిర్మాత.

ఆంధ్రపత్రిక పాఠకులకి చక్కటి అవకాశం



# కళ్యాణవేదిక

ఉచిత సమాచారం

## వధూవరుల సమాచారము ఉచితంగా ప్రతి బుధవారం ప్రకటిస్తాము. సమాచారం పంపేవారు ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

* వధువు / వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి.
* వధువు / వరుల తల్లిదండ్రులు, సంరక్షకులు తాము ఇచ్చే సమాచారము వాస్తవమని, ఎవరికీ కించపర్చే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.
* సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగా వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు **ఉచితంగానే** వాటికి సంబంధించిన వారికి నెల రోజుల లోపు పంపడం జరుగుతుంది.
* ఈ శీర్షికను కులమత వర్గ భేదాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.
* అందిన సమాచారము ప్రతి బుధవారం అవి అందిన వరుసక్రమంలో ప్రకటించబడుతుంది. వీటిని తిప్పి పంపే ప్రసక్తి లేదు. కావున స్వంత అడ్రసు గల కవర్లు లేదా స్టాంపులు జతపర్చకూడదు.
* ప్రకటనకు ఏదైనా అనర్హమైనదిగా తోచినపుడు వాటిని వెయ్యకుండా ఆపు చేసే హక్కు పత్రికకు వుంటుంది.
* ఇతర విధములైన ఉత్తర ప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపకూడదు.
* సమాచారము పంపేవారు ఈ దిగువ కూపను పూర్తి చేసి, స్థానిక ఏజెంటుచే సంతకం చేయించి పంపాలి. కూపను జతపర్చనియెడల పరిశీలించబడవు.
* కళ్యాణ వేదిక శీర్షిక ద్వారా సంబంధం కుదిరి వివాహం జరిగిన వధూవరుల ఫోటోలు ఉచితంగా ఆంధ్రపత్రికలో ప్రకటించగలము. ఏ తేదీన ప్రకటన పడింది తెలియజేస్తూ ఫోటోలు జతపర్చి "కళ్యాణ వేదిక ఫోటో ప్రచురణార్థం" అని వ్రాసి పంపవలెను.

## కళ్యాణ వేదిక ఉచిత సమాచార కూపను

పేరు . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

విరునామా . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . . . . పిన్‌కోడ్ . . . . . . . . .

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటు సంతకం ..........................

## ఎం. ఎస్. ఆర్ట్ మూవీస్ "అంకుశం"

ఆగస్టులో హైదరాబాద్ పరిసరాలలో నాలుగు పాటలు చిత్రీకరించడంతో షూటింగ్ పూర్తవుతుంది. అక్టోబర్‌లో విడుదల చేయాలనుకుంటున్నాం," అన్నారు ఎం. ఎస్. ఆర్ట్ మూవీస్ అధినేత 'ఎం. శ్యాంప్రసాద్‌రెడ్డి. ఈయన కోడి రామకృష్ణ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నిర్మించే "అంకుశం" చిత్రంలో రాజశేఖర్, జీవిత, రామిరెడ్డి, గోపీ, ఎ. జె. వి. ప్రసాద్, బాబ్జీ, హైదరాబాద్ కళాకారులు పాల్గొన్నారు. మధు సంభాషణలకర్త. మల్లెమాల గీతాలను సత్యం స్వరపరిచారు. కె. ఎస్. హరి ఛాయ, కె. శివనాగేశ్వరరావు సంయుక్త దర్శకత్వం, మార్తాండ్ కూర్పుతో ఎం. ఎస్. రెడ్డి సమర్పణ.

## ఓం శక్తి వినాయక ఎంటర్‌ప్రైసెస్ చిత్రం

"ఆగస్టు 20 నుండి సెప్టెంబర్ 25 వరకు తలకోన, చిత్తూరు, వెంకటగిరి ప్రాంతాలలో జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది. ఇన్‌స్పెక్టర్‌గా కళ్యాణ చక్రవర్తి, గజదొంగగా తారకరామారావు (హరీన్ చక్రవర్తి) నటిస్తున్నారు," అన్నారు పి. లక్ష్మణ్. ఈయన ఛాయ, నిర్మాణ సారధ్యంలో ఓం శక్తి వినాయక ఎంటర్ ప్రైసెస్ నిర్మిస్తున్న చిత్రంలో రంగనాథ్, రాళ్ళపల్లి, జీవా, చలసాని కృష్ణారావు, ఏలేశ్వరం రంగా, టెలిఫోన్ సత్యనారాయణ, కుష్బూ, రజిత, శ్రీదుర్గ, కుయిలీ, సుధ తతిమా తారాగణం. ఇమంది రామారావు కథకుడు. రాజ్‌కోటి సంగీతం, పి. వెంకటేశ్వరరావు శిల్పం, ఎన్. శేషు సంయుక్త దర్శకత్వం, సూపర్ సుబ్బరాయన్ సాహసాలు, ప్రభాకర్ నాయుడు ప్రొడక్షన్, బెనర్జీ కూర్పుతో కె. విజయలక్ష్మి సహనిర్మాత. ఎం. రామలింగేశ్వరరావు నిర్మాత. ఎం. మల్లికార్జునరావు దర్శకుడు.

## ఉషోదయా మూవీస్ చిత్రంలో వాణిశ్రీ

"చెడు సావాసాల వల్ల ఉత్పన్నమయ్యే అనర్థాలేమిటి? కాలేజీ విద్యార్థులు తమ కిష్టమైన సబ్జెక్ట్‌లను ఎన్నుకున్నట్లే తమ మిత్రులను ఎన్నుకోవడంలోనూ మెలకువ వహించాలి. తండ్రులు కూడా తమ కొడుకులకు అన్ని వసతులు సమకూర్చడమే కాకుండా వారి ప్రవర్తనను ఓ కంట కనిపెడుతూండాలి. ఈ ప్రాతిపదికపైన అల్లిన కథకు మల్లాది వెంకటకృష్ణమూర్తి తొలిసారిగా సంభాషణలు సమకూరుస్తున్నారు. విశాఖపట్నం, హైదరాబాదులలో ఏకబిగిన జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది. తమిళ, మళయాళ చిత్రాలలో నటించిన వాణీ విశ్వనాథ్ అనే నటిని తెలుగు వెండి తెరకు పరిచయం చేస్తున్నాం," అన్నారు ఎం. చంద్రకుమార్. ఈయన దర్శకత్వంలో ఎస్. సుధాకరరెడ్డి నిర్మిస్తున్న ఉషోదయా మూవీస్ చిత్రంలో వాణిశ్రీ ఒక క్లిష్టమైన పాత్రను ధరిస్తోంది. దివ్య, కాకినాడ శ్యామల, బెనర్జీ, ప్రదీప్ శక్తి, శివాజీరాజా, ప్రసన్నకుమార్, మిశ్రో తతిమా నటవర్గం. విద్యాసాగర్ సంగీతం, లోకీ ఛాయ, రంగారావు శిల్పం, టి. సుధాకరరెడ్డి సంయుక్త దర్శకత్వం, జయబాబు ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు.

## చిత్రీకరణ ముగిసిన "ఓ భార్య కథ"

'జూలై 18న షూటింగ్ పూర్తయింది." అన్నారు అట్లూరి రామారావు. ఈయన ఎగ్జిక్యూటివ్ నిర్మాతగా చెరుకూరి రామోజీరావు నిర్మించే ఉషాకిరణ్ మూవీస్ వారి పై చిత్రంలో జయసుధ, చంద్రమోహన్, శరత్‌బాబు, గొల్లపూడి మారుతీరావు, వేలు, విద్యాసాగర్, హరి, దిలీప్, అరవింద్, ఊర్మిళ, సుప్రియ, వై. విజయ, సూర్యకాంతం వగైరా నటవర్గం. అనురాధా రమణన్ కథకు ఆకెళ్ళ మాటలు, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు. ఎం. వి. రఘు ఛాయ, భాస్కరరాజు శిల్పం, కె. ఎ. ఎస్. కె. ఆర్. ప్రసాద్ నిర్వహణ, గౌతంరాజు కూర్పు తెర వెనుక హంగులు. దర్శకత్వం : మౌళి.

(82 వ పేజీ చూడండి)



"బజారు రౌడీ"లో రమేష్‌బాబు. నదియా



# ఈకాలం పిల్లలు....

కె.నాగేశ్వరి

ఇటీవల కొన్ని సంవత్సరాల నుండీ ఆడపిల్లలు మగపిల్లల కంటె ఎక్కువశాతం పాసవుతూ వస్తున్నారు. కనీస విద్యార్హత ఆడపిల్లలకు కూడా డిగ్రీ వరకూ పెరగడం ఇందుకు ముఖ్య కారణం. ఆడపిల్ల కూడా ఆర్థికంగా నిలదొక్కుకోవాలని తల్లితండ్రులు మగపిల్లలతో సమానంగా అన్నీ సమకూర్చడం కూడా ఇంకొక కారణం.

కారణాలు ఎన్ని చెప్పుకున్నా ఆడపిల్లలు ఎక్కువమంది చదువుకోడం చాలా సంతోషింపదగిన విషయం. వీళ్లలో అధికశాతం కాంపిటీటివ్ ఎగ్జామ్స్‌కే ప్రాధాన్యత ఇస్తారు. ప్రకృతి పరంగా ఆడవారు మగవారి కంటె సుకుమారంగా సున్నితంగా ఉంటారు. బైట తిరగడానికీ, జీవితంలో గమ్యం సాధించడానికీ వీరికి ప్రోత్సాహం చాలా అవసరం. ఇలా కాంపిటీటివ్ ఎగ్జామ్స్‌లో నెగ్గిన వారికి కొద్ది సంవత్సరాల వరకూ ఏ సమస్యా ఉండదు. ఎందుకంటే ప్రతీ దానిలో ఇంకా ఇంకా ఎన్నో మెట్లు ఎక్కాలి. ఎక్కితే గానీ ప్రస్తుతం అన్నిటికీ ముఖ్యంగా ఉద్యోగాలకి కొరతగా ఉన్న ఈరోజుల్లో ఓ స్థాయికిరారు.

ఆడవారు చదువు కష్టపడి చదివి పాసవుతున్నందుకు ఓపక్క సంతోషించినా, ఇంకోపక్క సాటి ఆడవారి పట్ల వారికుండే అవగాహన అదే స్థాయిలో ఉందా అని ప్రశ్న తలెత్తుతుంది.

అంతవరకూ కలిసి కట్టుగా చదువుతారు. ఎందుకంటే అప్పటికి ఇంకా బాల్యం వీడదు. విడీవిడీ వడని మొగ్గల్లాంటి ఆలోచనలతో ఉంటారు. పద్ధెనిమిది సమీపిస్తుండగా కొంత ఆడతనపు ఊహలు చోటు చేసుకుంటాయి. లేదా స్నేహితురాండ్రు, పిన్నమ్మలు, మేనత్తలు, వదినలు మొదలైనవారు గుర్తుచేస్తారు.

శరీరంలో వచ్చే భౌతికమైన మార్పులు, మనసును అలజడికి లోను చేస్తాయి. ఎవరైనా తమ ఈడువారు పెళ్ళయి భర్తతోనూ, పెళ్లవక ఉడ్‌బీతోనూ, లేక ప్రేమికుడితోనూ తిరుగుతూంటే తమంతవరకూ చదివింది అనవసరం అనుకుంటారు. ఎంతో అవివేకమైన ఊహలకు దిగజారుతారు. దానికి తోడు స్త్రీకి స్త్రీయే శత్రువని నిరూపిస్తారు సాటివారు. "మేము రాత్రింపగళ్లు విశ్రాంతి లేకుండా చదివినా, ఏ రికమెండేషన్ వాళ్లో అన్ని అవకాశాలూ కొట్టుకుపోతారు. అబ్బ ఎందుకొచ్చిన చదువులు". అని అంటే నిజమని నమ్మి నిరాశ చెందుతారు. లేదా "అయ్యో పాపం, నువ్వు మాలా జాలీగా తిరగడానికి వీల్లేదు. మీ మమ్మీ ఎడ్యుకేటెడ్ అయినా ఆరిస్ట్రిక్షన్ ఏమిటి చెప్పు? బాయ్‌ఫ్రెండ్స్ ఉంటే తప్పేంటి? మన క్లాస్‌మేట్ నిన్నటి వరకూ ఫలానా అతనితో ఏ.

## ఈ చదువులు దేనికోసం?

సి. హోటల్సుకు, సినిమాలకూ తిరగలేదా? అయినా దర్జాగా ఉంది. ఎగ్జామ్స్ ముందు ఓ వారం టీ తాగి చదివి గట్టెంకి వేస్తుంది. వాళ్ల ఫాదరు పైలెవల్లో రికమెండేషన్సు చేస్తారు. మీ మదర్ లాగ ఫాదర్‌లాగ, ఇది తప్పు అది తప్పు అంటే బ్రతకడం కష్టం" అని ట్వీజ్ చేసిన చీపురు పుల్లల్లాంటి కనుబొమ్మలు ఎగరేస్తుంది అవతలమ్మాయి "యు" షేప్ చేయించుకున్న జుట్టు విరబోసుకుని డబుల్ కాట్ మీద పడుకుని భోరుమంటుంది.

ఎయిర్ కూలర్ ఆన్ చేసి, ఫ్రిజ్ వాటర్ ముఖం మీద చిలకరించి బుజ్జగిస్తే బావురు బాకా లెట్టి తనొట్టి యూస్‌లెస్ క్రీచర్‌నని ఏడుస్తుంది. ఒకప్పుడు ఇంటరు మంచి మార్కులతో పాసయిన అమ్మాయి. మూడు సంవత్సరాలు తిరగకుండా జనరేషన్‌లో వచ్చిన ఫాస్ట్ మూవ్‌మెంట్స్ చూసి నిట్టూర్చి తనూ ఓ గ్లాసు ఐస్ వాటర్ తాగుతుందా తల్లి.

అందుకే విద్య వినయాన్ని అలవర్చుకోడానికే నని గుర్తించాలి. మనం చదువుకుని ఒన ఆలోచనా పరిధిని విశాలం చేసుకోవాలి. ఆలోచన ఎప్పుడైతే స్వార్థమనే ఎల్లలు దాటుతుందో, జ్ఞానం, వివేకం మేల్కొంటాయి. అవి మనిషిని నిరంతరం అంటి పెట్టుకుని రాబోయే ప్రమాదం గురించి అప్రమత్తంగా ఉండేట్లు చేస్తాయి. పెనుగాలిలో కూడా చలించని మహావృక్షం లాంటి ఆత్మవిశ్వాసం క్రమేణా పెరుగుతుంది. ఆత్మవిశ్వాసం ఇచ్చే తృప్తి వల్లే ఎదుటి వారి బాధ వినే ఓర్పు వస్తుంది. ఆ ఓర్పే సాటి వారి కష్టంలో తోడ్పడే ఇంగితం అలవాటు చేస్తుంది. అప్పుడు మనకంటే ర్యాంకు ఓ రెండు మార్కులు తగ్గినంత మాత్రాన చులకన చెయ్యకూడదనే బుద్ధిని పెంచుతుంది. శాకాహారం, మితమైన సరదాలు ఉన్నవారు దేనికీ పనికి రారు అనే చులకన భావం పోగొడుతుంది. ముఖ్యంగా విద్యార్థినులలో మామూలు ఆడవారి స్థాయి కంటే ఓ మెట్టు పైనుండి ఆలోచించే హృదయ వైశాల్యాన్ని పెంచుతుంది. అడది ఆడదాని శ్రేయస్సునూ కోరగలదు అనిపించు కొనేలా తయారయేట్లు చేస్తుంది. ◘



సీరియల్

# తమస్






హిందీమూలం: డా. భీష్మ సాహ్నీ

తెనుగుసేత: డా. యార్లగడ్డ లక్ష్మీప్రసాద్


(గత సంచిక తరువాయి)

లీజా కొంచెం సేపటి వరకు అలా కూర్చుండిపోయింది. రిచర్డ్ ఇంత వరకు కాఫీ కూడా త్రాగలేదు. తాను కాఫీ త్రాగాలో, రిచర్డ్ వచ్చేవరకు ఆగాలో ఆమెకు అర్థం కాలేదు. అంతలో నే రిచర్డ్ తిరిగి వచ్చాడు.

"ఇది ఎవరు పంపిన రిపోర్టు?"

"పోలీస్ సూపరింటెండెంట్‌ది. విశేషమేమిలేదు. రోజూ పంపేదే"

రిచర్డ్ తన నుంచి ఏదో దాస్తున్నాడనిపించింది లీజాకు.

"నాకు చెప్పకుండా నువ్వేదో దాస్తున్నట్లున్నావు?"

"పట్టణంలో విషయాలు దాచవలసిన పనేముంది. పైగా నీకు చెప్పకుండా ఎందుకు దాస్తాను?"

"కాదు. ఏదో ఉండే ఉంటుంది. సూపరింటెండెంట్ ఏమి వ్రాసాడు?"

"కొత్త విషయా లేమీలేవు. ఎప్పుడూ ఉండేదే. హిందువులు మహమ్మదీయుల మధ్య ఉద్రిక్తతలు పెరిగాయని వ్రాసాడు."

"రిచర్డ్! ఇప్పుడు నువ్వేం చేస్తావ్?"

"ఏం చేస్తాను? పరిపాలన సాగిస్తాను. అంతకంటే ఏం చేస్తాను?"

లీజా కళ్లెత్తి చూసింది.

"నువ్వు మరలా ఎగతాళి చేస్తున్నావు కదూ?" అంది.

"లేదు. హిందూ– ముస్లింల మధ్య తగాదాలు పెరిగితే నేనేమి చేస్తాను?"

"నువ్వు వాళ్ళ తగాదాలు మాన్పించవచ్చుకదా?"

"మతానికి సంబంధించిన విషయాలు, మీ స్వంత విషయాలని, వాటిని మీరే పరిష్కరించుకోవాలని అందుకు అవసరమైన సహాయం ప్రభుత్వం చేస్తుందని నేను వారికి చెప్తాను."

"వారిద్దరూ ఒకే మూలజాతికి చెందినవారని, వారిలో వారు తగాదా పడకూడదని నువ్వు వారికి చెప్పాలి. నువ్వు నాకు చెప్పింది అంతేకదా?"

"తప్పకుండా చెప్తాను" రిచర్డ్ వ్యంగ్యంగా అన్నాడు.

ఇద్దరూ మౌనంగా కాఫీ త్రాగసాగారు. లీజా కొంచెం బాధగా అడిగింది.

"రిచర్డ్! నీకేం ప్రమాదం లేదుకదా?"

"లేదు ప్రజలు వాళ్ళలో వాళ్ళు కొట్టుకొంటే పాలకులకొచ్చే ప్రమాద మేముంటుంది?"

లీజా కళ్ళలో రిచర్డ్ పట్ల ఆదరభావం తొంగిచూసింది.

"రిచర్డ్ నువ్వు సరిగానే చెప్పావు. నువ్వు చాలా తెలివిగల వాడివి. నేనే అనవసరంగా భయపడ్డాను. ఒక రోజు ఈ దేశవాసుల గుంపును చెల్లా చెదురు చేయడానికి జాక్సన్ రివాల్వర్‌తో వెంటబడ్డాడని తాను మేడపై నుండి కంగారు పడుతూ ఆ దృశ్యాన్ని చూశానని ఆ గుంపు పారిపోయిందని జాక్సన్ భార్య నాతో చెప్పింది."

"నువ్వేమీ భయపడవలసిన పనిలేదు." అంటూ లీజా బుగ్గమీద చిన్నగా కొట్టి నవ్వుతూ రిచర్డ్ అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

★ ★ ★ ★ ★ ★ ★ ★

ప్రభాత ప్రదర్శన బృందం సందులు దాటుకుంటూ ఇమామీ దీన్‌పేటకు చేరే సరికి చీకటి పూర్తిగా తగ్గిపోయింది. దారిలో షేర్‌ఖాన్ ఇంట్లో నుండి చీపుర్లు, పెద్దపారలు, కుండలు తీసుకుని ముందుకు నడవసాగారు. ఉదయపు వెలుగులో వారి అలసిన ముఖాలు స్పష్టంగా కనిపించసాగాయి. మెహతాజీ మినహా మిగిలిన వారందరి బట్టలు నలిగి మాసి పోయాయి. బక్షీగారి తలమీద వున్న గాంధీ టోపి ఒక పక్కకు జారిపోయి వుంది. శంకర్, రామదాసు మాష్టారు, అజీజ్ భుజాలమీద చీపుర్లు పెట్టుకుని వున్నారు. దేశరాజు, షేర్‌ఖాన్ చేతుల్లో గమేళాలు వున్నాయి.

జరిగిన కథ 4 : మురాద్అలీ చూపిన ఆశతో నత్తూ అష్ట కష్టాలు పడి పందిని చంపేస్తాడు. కాంగ్రెస్ నిర్వహించే ప్రభాత ప్రదర్శనకు బక్షీ, అజీజ్, మెహతా, కాశ్మీర్‌లాల్, శంకర్ వస్తారు. పారిశుధ్య కార్యక్రమం కోసం ఇమామీదిన్‌పేటకు బయలుదేరతారు. నత్తూకు ప్రభాత ప్రదర్శన ఎదురవుతుంది. ముస్లింలకు, ప్రభాత ప్రదర్శన బృందానికి ఘర్షణ మొదలవుతుంది. నత్తూ భయపడి పారిపోతాడు. డెవ్యూటీ కమీషనర్ రిచర్డ్ భార్య లీజాకు ఆ ప్రాంతాన్ని చూపి చారిత్రక విశేషాలు చెపుతుంటాడు. పట్టణంలోని పరిస్థితులకు సంబంధించిన రిపోర్టు బట్లరు ఇవ్వడంతో అది చదివి రిచర్డ్ గది బయటికి వెళ్ళిపోయాడు..

జనరల్ పెద్దగడ కర్ర పట్టుకున్నాడు. పగటి వెలుగులో చీపురు పట్టుకుని తిరగటానికి రామదాసు మాష్టారు సంకోచపడసాగాడు.

"మహాత్మాగాంధీ! నువ్వెంత గొప్పవాడివయ్యా! బ్రాహ్మణులతో కూడా చీపుర్లు పట్టించావుకదా!" అంటూ రామదాసు మాష్టారు చిన్నగా నవ్వసాగాడు చీపురు వీపు వెనక పెట్టుకున్నాడు. తన మాటలు ఎవరూ పట్టించుకోలేదని గ్రహించి బక్షీనుద్దేశించి కొంచెం బిగ్గరగా అన్నాడు–

"నేను కాలవ శుభ్రం చేయను. ముందే చెప్పేస్తున్నాను."

ఏం? నీకేమయినా కొమ్ములు వచ్చాయా?

'ఎందుకని? గాంధీజీ స్వయంగా పాయిఖానా శుభ్రం చేస్తుంటే, నువ్వు మురికి కాలవ శుభ్రం చెయ్యలేవా?'

"నేను అబద్ధం చెప్పటంలేదు. నేను వంగలేను. వంగితే నడుం నెప్పివస్తున్నది. మూత్రపిండాలలో రాళ్ళు వున్నాయి."

అవుకు కుడితిపెట్టేటపుడు, దానిని కడిగేటప్పుడు మూత్రపిండాలలో రాళ్ళు ఏమీ చెయ్యవా? జనం పని చేయాల్సినప్పుడే రాళ్ళు నెప్పి పెడుతుంటాయా?

శంకర్ జోక్యం చేసుకున్నాడు– "మనం నిజంగా మురికి కాలవలన్నీ శుభ్రం చేయవల్సిన పనిలేదు. మనం చేయవల్సింది కేవలం ప్రచారం మాత్రమే. నేను కాలువ శుభ్రం చేస్తాను. మీరు గమేలాతో మురికి ఎత్తి పారవేయండి చాలు."

కొంచెం దూరం నడిచిన తరువాత ఆ బృందం ఒక సందులోనికి తిరిగింది.

"ఎటు వెళుతున్నారో గమనించారా?"

వెనుక నుండి గోసాయిగారు అరిచారు. బృందానికి ముందు నడుస్తున్న దేశరాజ్, కుడిచేతి వైపునకు తిరగగా, మిగిలిన బృందమంతా అతనిని



అనుసరించింది.

"ఆగండాగండి. ఇది వాళ్ళందరూ ఉదయం నమాజు చేసుకునే సమయం. మనం మసీదు ముందుగా వెళితే ఉపయోగం ఏమిటి?" బక్షీ అన్నాడు.

'ఏమయ్యా! కాశ్మీరీ మీరంతా నిద్రపోతున్నట్టున్నారు. ఈ మసీదు ముందుగా వెళ్ళమని మీకు ఎవరు చెప్పారు? ఎప్పుడూ నీ ఇష్టం వచ్చినట్లే చేస్తావు" బక్షీ కొంచెం విసురుగా అన్నాడు.

కాశ్మీరీలాల్ ఆగిపోయాడు.

షేర్‌ఖాన్, దేశరాజ్, అటు తిరిగారు. మేమంతా కూడా వారివెనకే అటుతిరిగాం. అయితే మాత్రం ఏంపోయింది బక్షీగారూ! మసీదు ముందుకు వెళ్ళినపుడు పాడటం ఆపేద్దాం."

"అక్కర్లేదు. అట్లా చెయ్యవలసిన అవసరంలేదు. పరిస్థితులెట్లా వున్నాయో నీకు తెలుసుకదా! వెనుకకు తిరిగి, ఆ ప్రక్క సందుగుండా తిన్నగా చెక్‌దగ్గరకు వెళదాం. అక్కడ రోడ్డుదాటి ఇమామ్‌దీన్‌పేటకు వెళదాం."

బృందం వెనక్కు తిరిగి పక్క సందుగుండా రోడ్డు దాటి ఇమామ్‌దీన్ పేట దగ్గరకు వచ్చింది. ఈ ప్రభాత ప్రదర్శన బృందానికి ఈ దారి కొత్త. సాధారణంగా పట్టణం బయటవున్న పాత బస్తీలకు కాంగ్రెసువారు ప్రచారానికి రారు. కమిటీ మైదానం దారి రావటంవలన చాలాదూరం అవుతుంది. ఇమామ్‌దీన్‌పేట కమిటీ మైదానం దాటి తూర్పువైపున ఒకపెడగా వుంది.

పచ్చికబయట దగ్గర ఒక చోట ఈ బృందం ఆగిపోయింది. చేతిలో మూడు రంగుల జెండా పట్టుకున్న కాశ్మీరీలాల్, గొంతెత్తి బిగ్గరగా నినాదం చేసారు.–

"ఇంక్విలాబ్!"

"జిందాబాద్" అందరూ బిగ్గరగా ప్రతినినాదం చేసారు.

'బోలో భారత్‌మాతాకీ!... జై!'

ఈ నినాదాల మోతవిని పేటలోని పిల్లలు ఇండ్లు నుండి పరుగెత్తుకుని బయటకు రాసాగారు. స్త్రీలు గుమ్మాలకు కట్టిన పరదాలగుండా తొంగిచూడ సాగారు. ఎర్రని తురాయి కలిగిన కోడిపుంజు గోడపైకి ఎక్కి, రెక్కలు టపాటపా కొట్టి 'కొ... కొక్కురో... కో" అని కూసింది.

"కాశ్మీరీ నీకంటే ఆ కోడే నయం. చూడు ఎంత బిగ్గరగా అరుస్తున్నదో!" అన్నాడు షేర్‌ఖాన్.

"కాశ్మీరీ ఎవరికంటే తక్కువ? కాశ్మీరీ కాంగ్రెసు కోడిపుంజు" శంకర్ వంతపాడాడు.

'కాశ్మీరీ! నువ్వుకూడా తలమీద ఎర్రతురాయి పెట్టుకో! బక్షీగారూ! కాశ్మీరీకి ఎర్రటోపీ ఇప్పించండి. అచ్చం కోడిపుంజులా వుంటాడు."

"తురాయి లేకుంటే మాత్రం కాశ్మీరీ కోడిపుంజులా వుండడా?"




పట్టణంలో వేళాకోళాలు సమయం సందర్భం లేకుండా ఇట్లా సాగుతూ వుంటాయి.

"చాలు చాల్లే! ఇక ఆపండి. పని మొదలుపెట్టండి" బక్షీగారు లాంతరు క్రిందపెడుతూ అన్నారు.

అక్కడ చాలామట్టుకు ఒకే అంతస్థుగల ఇళ్ళు ఉన్నాయి. చాలా ఇళ్ళకు పరదాలు వేలాడుతున్నాయి. ఎదురుగా ఖాళీ మైదానం, మైదానానికి అవల రెండు మురికివాడలున్నాయి. ఒక వాడలో చెత్తనిండిపోయిన మురికి కాలువ లున్నాయి. రెండవవాడలో కాలువలే తవ్వబడలేదు. చెత్తా చెదారం అంతా వీధుల్లోనే పడవేయబడింది. ఇళ్ళలోని స్త్రీలు తలమీద కుండలు పెట్టుకుని నీళ్ళ కోసం వెళుతున్నారు. ఒకచోట పిల్లవాడొకడు గేదెలు వేసిన పేడను ఎత్తుతున్నాడు. ఎదురుగా పచ్చిక బయలుదగ్గర మైదానంలో ఇద్దరు పిల్లలు ఒకరికెదురుగా ఒకరు బయలకు కూర్చుని మాట్లాడుకుంటూ ఉన్నారు.

"అరేయ్! నీ దొడ్డికి పల్వగా ఎందుకుందిరా?"

"నేను మేక పాలు తాగుతాను. మరి! నువ్వేవి తాగుతావు?"

అక్కడే దగ్గరగా రొట్టెలుచేసే పొయ్యి ఒకటి ఉన్నది. ఇదంతా చూస్తుంటే ఈ బృందానికి వీధులన్నీ దాటి ఏదో గ్రామానికి వచ్చినట్టుంది.

"పారలుతీసి శుభ్రం చేసే పని మొదలు పెట్టండి." బక్షీ మిగిలిన వారితో అన్నాడు.

మెహతా, రామదాసు మాష్టారు గమేళాలు తీసుకొని వాకిళ్ళవైపు నడిచారు. శంకర్, కాశ్మీరీలాల్ పారలెత్తుకుని మురికి కాల్వలు శుభ్రం చేయడానికి వెళ్ళారు. షేర్‌ఖాన్, దేశరాజ్, బక్షీగారు ముగ్గురూ చీపుర్లు తీసుకుని అక్కడ ఆవరణను శుభ్రం చేయసాగారు.

ఆ చుట్టుపక్కల ఉన్నవారికి వీరు ఎందుకు వచ్చారో! ఏమి చేస్తున్నారో! అర్థం కాలేదు. టాంగాతోలే ఒక వృద్ధుడు ఇంటి బయటకు వచ్చి మైదానం పక్కన కాళ్ళమీద కూర్చున్నాడు. వెంటనే బక్షీగారు ఊర్ధ్వటం చూసి గబాలున లేచి బక్షీగారి దగ్గరకు వెళ్ళాడు.

"బాబుగారూ! మీకెందుకు శ్రమ. మా ఇళ్ళు మీరు శుభ్రం చేయడమేమిటి? ఆ చీపురు నాకివ్వండి."

"అబ్బెబ్బే! ఇది మేము చేయవలసిన పనే!"

"తప్పు బాబుగారూ! మీలాంటి చదువుకున్న పెద్దలు మా ఆవరణలు ఊడిస్తే మాకు పాపం చుట్టుకుంటుంది..."

ఆ వృద్ధుని వ్యవహారం బక్షీగారికెంతో ముచ్చట గొలిపింది. కాంగ్రెసు ప్రభావం ప్రజలమీద పడుతున్నందుకు ఆయన మనసులోనే మురిసిపోయాడు.

కాశ్మీరీలాల్, శంకర్ ఇద్దరూ కలిసి పెద్దపారలతో ఆ ఇళ్ళ వెంట పారుతున్న మురికి కాలువలో పేరుకుపోయిన చెత్తను బయటికి లాగుతున్నారు. ఆ మురికి కాలువలు తవ్విన నాటినుండి అక్కడ మురుగుపేరుకుని నల్లగా తయారయింది. శంకర్, కాశ్మీరీలాల్ పారలతో మురుగు బైటికి లాగటం మొదలుపెట్టగానే, ముక్కులు పగిలిపోయేంత దుర్వాసన ఆ ప్రాంతమంతా వ్యాపించింది. దోమలు ఒక్కసారిగా లేచి నాలుగు వైపులా వ్యాపించాయి. ఒక అడుగు లోతు ఉన్న ఆ కాలువ మొత్తం మురుగుతో నిండిపోయింది.

"అయ్యో దొరగార్లూ ఏమిటి? అంతా భీభత్సం చేసేస్తున్నారు. ఆ మురుగు అంతా ఒకే చోట కాలవలో పడి ఉండేది. దాన్ని అంతా తీసి మీరు వీధినిండా పోస్తున్నారు. ఇక్కడ రోగాలు పెరిగితే జవాబుదారి ఎవరిది?..." ఒక ఇంటి గడపమీద కూర్చున్న ఒక వృద్ధుడు వీరిని చూసి బిగ్గరగా అరిచాడు.

దూరం నుండి ఇదంతా చూస్తున్న బక్షీగారు నడుంలేపి వీళ్ళ వైపు చూసారు. ఆయనకు కాశ్మీరీలాల్, శంకర్ల మీద కోపం వచ్చింది.

ఈ కుర్రవాళ్ళు ఎప్పుడు తెలుసుకుంటారు. సామాజిక కార్యక్రమాల అర్థమే వీరికి తెలియకుండా పోయింది. నిజంగానే కాలువలన్ని శుభ్రం చేసేస్తున్నారు. ప్రజల దృష్టి శుభ్రతపై మళ్ళించటమే నన్న విషయాన్ని, తద్వారా దేశ స్వాతంత్ర్యం పట్ల కోరికను కలిగించటమే సామాజిక కార్యక్రమాల ప్రధాన

లక్ష్యమన్న విషయం వీళ్ళు మర్చిపోతూంటారు."

వీళ్ళనుకేకలు వేసిన వృద్ధుడు అప్పటికి అక్కడి నుండి లేచిపోయాడు.

అదే సమయంలో తెల్లటి దుస్తులు ధరించిన ఒక పెద్దమనిషి చేతిలో జపమాల పుచ్చుకొని అవైపువచ్చాడు. చూడగానే మతానికి సంబంధించిన వ్యక్తిలాగా అనిపిస్తాడు. వీరు కాలువలు శుభ్రం చేయటం, ఊడ్వటం చూసి అక్కడ ఆగిపోయాడు. చేతిలో చీపురు పట్టుకుని శరీరమంతా దుమ్ముతో నిండిపోయిన రామదాసు మాష్టారుని చూసి ఆ పెద్ద మనిషి "మమ్మల్ని ఋణగ్రస్తుల్ని చేసేస్తున్నారు." అన్నాడు. అయితే ఆ పెద్ద మనిషి కళ్ళలో వీరి సేవా భావం పట్ల సదభిప్రాయం తొంగిచూసింది. "చాలా మంచి పని చేస్తున్నారు" మరలా అన్నాడు.

బక్షీగారు చీపురు చేతపట్టుకుని ఆ పెద్ద మనిషి దగ్గరకు వెళ్ళి "ఏదో! మాకు తోచింది చేస్తున్నాం" అన్నారు.

"వీధులు శుభ్రం చేయడం విశేషమైన విషయం కాదు, అయితే దానివెనుక ఉన్న మీ ఉద్దేశం మాత్రం గొప్పది." అంటూ ఆ పెద్దమనిషి చిరునవ్వు నవ్వుతూ మసీదువైపు వెళ్ళసాగాడు. బక్షీగారికి తాము చేస్తున్న పనికి లభించిన ప్రశంసతో పొంగిపోయాడు.

"అటు మెహతాని, అజీజ్‌ని చూడు! చీపురు కనీసం చేతితో పట్టుకోలేదు. పాపం! మెహతాగారికి బట్టమీద శ్రద్ధ ఎక్కువ." షేర్‌ఖాన్ నవ్వుతూ బక్షీగారితో అన్నాడు.

బక్షీ అటువైపు తిరిగి చూసాడు. అక్కడ మెహతాజీ శుభ్రంగా ఉన్న చేతులతో ఒక్కొక్క రాయిని తీసి గమేళాలో చక్కగా పేర్చుతున్నాడు. మనివేళ్ళతో ఒక్కొక్క రాతిని పట్టుకొని చాలా జాగ్రత్తగా ఆ గమేళాలో పెట్టసాగాడు. రెండో వైపున రామదాసు మాష్టారి మీసాలు జుట్టు దుమ్ముతో తెల్లగా మెరవసాగాయి.

అప్పటి వరకు వాసాన్ని చేతితో పట్టుకొని పచ్చిక బయలు దగ్గర నిలబడి ఉన్న జనరల్ కాలువ శుభ్రం చేసేవారిదగ్గకు వచ్చాడు.

"నన్ను కూడా ఒక చేయి వెయ్యమంటారా?" మిలటరీ ఫోజులో అన్నాడు. చుట్టుపక్కల నిలబడి ఉన్నవారంతా ఒక్కసారిగా నవ్వారు.

"సేవా కార్యక్రమాలు అన్నీ పెద్ద ఫార్సు. మురికి కాల్వలు శుభ్రం చేస్తే స్వరాజ్యం వస్తుందా!" శంకర్ నడుం ఎత్తి కాశ్మీరీలాల్‌తో అన్నాడు.

శంకర్, కాశ్మీరీలాల్ ఇద్దరూ చెమటతో తడిసిపోయారు. మురికి కాల్వ పక్కన మూడు చోట్ల వీళ్ళు చెత్తను గుట్టలుగా పోసారు.

"శంకర్! నోటికి వచ్చినట్లు మాట్లాడవద్దు. నీకు తెలివితేటలు పెరిగినట్లున్నాయి. బాపూజీ తెలివి తక్కువవాడు అనా! నీ వుద్దేశ్యం? రాట్నం వడకటం, సేవా కార్యక్రమాలు చేపట్టడం పనికిరాని పనులు అనుకుంటున్నావా!" అప్పుడే అటుగా వచ్చి శంకర్ మాటలు విన్న బక్షీ అతన్ని మందలిస్తూ అన్నాడు.

"చేస్తున్నాను కదా! సేవాకార్యక్రమాలన్నీ చేస్తూనే ఉన్నాం కదా!" శంకర్ వెనకా ముందు చూడకుండా మాట్లాడేస్తూ ఉంటాడు. అందుకే బక్షీగారికి ఆ విషయాన్నే అతనితో వాదానికి దిగటం ఇష్టంగా తోచలేదు. కాని, ఆయన ఆవేశాన్ని ఆపుకోలేక పోయాడు.

"శంకర్! కొంచెం అర్థం చేసుకోడానికి ప్రయత్నించు. ఈ సేవా కార్యక్రమం మనదేశ భక్తికి చిహ్నం. ఈవిధంగా మనం పేదల స్థాయికి రావటానికి అవకాశం ఉంటుంది. పేదవారితో కలిసి పనిచేయడానికి పాంటులు ధరించి వెళితే ఉపయోగం ఉండదు. ఖద్దరు ధరించి చీపురు చేతపట్టుకుని వెళితేనే, వాళ్ళు మనని విశ్వసిస్తారు.

"ఈ సేవా కార్యక్రమాలు మొదలు పెట్టినప్పటి నుండి ఉద్యమం ఆగిపోయింది. నూలు వడుకుతుంటూ, వీధులు ఊడ్చుకుంటూ ఉంటే సరిపోతుందా!" పారనిండా చెత్త తీసి గుట్టమీద పోస్తూ అన్నాడు.

జనరల్ జోక్యం చేసుకుంటూ – "నాకు తెలుసు నువ్వు దేశద్రోహివి. నువ్వు కమ్యూనిస్టువి" అన్నాడు బిగ్గరగా.

"జనరల్! నువ్వు మాట్లాడటం ఆపు." బక్షీగారు వెంటనే కల్పించుకున్నారు. జనరల్ మాట్లాడటం మొదలు పెడితే ఆపడని అతనికి తెలుసు.

"శంకర్! నువ్వు కూడా సమయం సందర్భం లేకుండా మాట్లాడతావు. వాదులాడుకునే స్థలమిదేనా?"

అప్పుడే ఒక మనిషి కమిటీ మైదానం వైపు నుండి పరిగెత్తుకుంటూ వచ్చి షేర్‌ఖాన్ ఇంటిసందు దాటి, ఆపేటలో ఒకచోట చేరి ఉన్న మనుషులు దగ్గరకు వెళ్ళి, రహస్యంగా ఏదో చెప్పసాగాడు. అతను నల్లరంగు వేస్టుకోటు ధరించాడు. ఆందోళనతో వున్నట్లు కన్పించాడు. అతను ఆవిధంగా పరుగెత్తుకు రావటం మామూలే కాని, పరుగెత్తుకొచ్చిన తీరు వింతగా ఉంది. చూస్తుండగానే అక్కడ ఉన్న గుంపులోని మనుషులందరు ఎటువాళ్ళటు తప్పుకుని వెళ్ళిపోసాగారు. కేవలం చిన్న చిన్న పిల్లలక్కడ ఉండిపోయారు. పరదాలచాటు స్త్రీలు కూడా లోపలికి వెళ్ళిపోయారు. ఒక స్త్రీ అటుగా బయటకువచ్చి బయలుకు కూర్చుంటున్న పిల్లలలో ఒకడిని ఈడ్చుకుంటూ ఇంటిలోపలికి తీసుకొని వెళ్ళిపోయింది. అక్కడ నిశ్శబ్దం రాజ్యం చేయసాగింది. కాంగ్రెస్ కార్యకర్తలకు ఏంజరుగుతుందో అర్థం కావటంలేదు.

తెల్లదుస్తులు ధరించి చేతిలో జపమాల పుచ్చుకొని మసీదువైపు వెళ్ళిన పెద్దమనిషి తిరిగి వస్తూ కన్పించాడు. మెహతాజీ, బక్షీ, ఏం జరిగిఉంటుందా?




అని ఆలోచించసాగారు. ఆ వచ్చే పెద్దమనిషి దగ్గరకు వెళ్ళి విషయం తెలుసుకుందామనుకున్నారు. చేతిలో జపమాల తిప్పుకుంటున్న ఆ పెద్దమనిషి వీరిదగ్గరకు వచ్చి ఒక్క క్షణం ఆగి.... "వీరు ఇక్కడ నుండి వెళ్ళిపోవడం మంచిది. మీమేలు మీరుకోరుకుంటే ఇక్కడి నుండి వెంటనే వెళ్ళిపోండి." అన్నాడు. ఈమాటలు అంటున్నప్పుడు అతని గొంతు కొంచెం వణికింది. ఆ పెద్దమనిషి బక్షీ మెహతాజీలతో మాట్లాడుతూ ఉండగానే బృందంలోని మిగతా వారందరూ అక్కడికి చేరుకున్నారు– "మీరు ఇక్కడి నుండి వెంటనే వెళ్ళిపోండి!" అంటూ, ఆ పెద్దమనిషి అక్కడినుండి వెళ్ళిపోయాడు.

అందరూ ఒక్కసారిగా నిశ్శబ్దంగా ఉండిపోయారు. బక్షీ, మెహతాజీ ఇద్దరూ ఒకరి ముఖం ఒకరు చూసుకోసాగారు. ఎప్పుడూ ఏదో పనికిరాని మాటలు మాట్లాడి గొడవలు తెచ్చే శంకర్, కాశ్మీరీలాల్ వల్ల ఏమన్నా గొడవ వచ్చిందేమో! అని బక్షీ అనుమానించాడు. లేకుంటే ఇటు వెళ్ళినప్పుడు పొగిడిన పెద్దమనిషి తిరిగి వచ్చేటప్పుడు ఎందుకు మండిపడతాడు?

అయితే ఒకరాయి ఎగురుకుంటూ వచ్చి బక్షీ దగ్గర పడింది. కాశ్మీరీలాల్, శంకర్ నిశ్చేష్టులై బక్షీ గారిని చూస్తుండి పోయారు.

"ఏం జరిగింది?" రామదాసు మాష్టారు అడిగారు".

"ఏదో గొడవ జరిగినట్లుంది. త్వరగా పదండి. మనం అసలు ఇక్కడకు

రావడమే తప్పు. ఏదీ? మనలను ఇక్కడకు తీసుకొచ్చిన దేశరాజ్ ఎక్కడ?" బక్షీ గొంతులో ఆందోళన కోపం ధ్వనించాయి. దేశరాజ్ అక్కడ లేడు. అతను అక్కడనుండి ఎప్పుడు జారుకున్నాడో. తప్పకుండా ఏదో అల్లరి జరిగే ఉంటుంది?"

ఇంతలోనే అక్కడ రెండుమూడు రాళ్ళు వచ్చిపడ్డాయి. ఒకరాయి రామదాసు మాష్టారు భుజానికి తగిలింది.

"వెళ్ళిపోండి. ఇక్కడ ఉండవద్దు."

కార్యకర్తల బృందం హడావుడిగా అక్కడనుండి బయల్దేరసాగింది.

"మీరంతా పిరికివారు. నాకు మీలో ప్రతి ఒక్కడి సంగతి తెలుసు. ఈ సేవా కార్యక్రమం పూర్తిచేసి నేనిక్కడి నుండి వస్తాను." చేతిలోని వాసాం పైకెత్తి అరిచాడు జనరల్.

బక్షీ అతని వైపు తీక్షణంగా చూసి మిలటరీ ఆర్డరు జారీచేసినట్టు చెప్పాడు– "జనరల్! నువ్వు జెండాపట్టుకొని బయల్దేరు."

జనరల్ ఎటన్షన్ ఫోజులో కొచ్చి చెప్పులు ఈడ్చుకుంటూ పచ్చిక బయలు దగ్గర ఉంచిన జెండాను తీసుకోడానికి బయల్దేరాడు. అప్పుడే రెండుమూడు రాళ్ళు వచ్చి ఒకటి పచ్చిక బయలు మీద, రెండోది జనరల్ నిల్చున్న చోట పడ్డాయి. అప్పుడే ముగ్గురు మనుషులు సందుమొదటలో వచ్చి నిలబడ్డారు.

కాంగ్రెస్ బృందం సభ్యులు అక్కడినుంచి నిశ్శబ్దంగా బయల్దేరారు. కాశ్మీరీలాల్ జనరల్ చేతిలో జెండా తీసుకున్నాడు. మెహతా రాళ్ళు ఉంచిన గమేళాను బోర్లించి, ఖాళీ గమేళా తీసుకొని మైదానం దాటసాగాడు. బక్షీజీ చేతిలో లాంతరు ఊగుతున్నది. ఆయనతల వంగిపోయింది.

"ఈ గమేళాలు, పాఉలు షేర్‌ఖాన్ ఇంటిలో, పెట్టి వెళదామా?" రామదాసు మాష్టారు బక్షీగారిని అడిగాడు.

"ఉన్నపళంగా బయల్దేరు. ఇక్కడెక్కడా ఆగవద్దు!!.

కాశ్మీరీలాల్ వెనకకు తిరిగి చూశాడు. అక్కడ సందుమొదలులో ముగ్గురుకు బదులు ఐదుగురు నిలబడి ఉన్నారు. కొందరు మైదానం దాటి వచ్చి అక్కడ నిలబడి వీరిని చూడసాగారు. ఆ పేట దాటి కుతుబుద్దీన్ సందులోకి వచ్చేసరికి అక్కడ నాన్‌బాయి దుకాణం వద్దకూడా వీరికి అటువంటి దృశ్యమే ఎదురయింది. నాన్‌బాయి దుకాణం ముందు నిలబడి ఉన్న యిగ్గురు మనుషులు వీరిని పట్టుపట్టి చూడసాగారు.

"ఎక్కడో? ఏదో? గొడవ జరిగి ఉంటుంది." బక్షీగారు మెహతాజీతో అన్నారు.

"ఏమో! ఏం చెప్పగలం? కాశ్మీరీలాల్‌గాని, శంకరో ఈ పేటలోని ఏ ఆడపిల్లతోనైనా సరసాలాడేరేమో? మీరు కాంగ్రెస్‌ను లోఫర్లతో నింపేశారు".

"మెహతాజీ! మీమాటలునాకు అర్థంకావడం లేదు. కాశ్మీరీలాల్ కాలువ శుభ్రం చేసే పనిలోనే ఉండటం మనం చూసాం కదా! ఇక్కడ ఇంకేదో జరిగినట్లుంది."

ఆ సందుదాటి వేరే సందులోకి తిరిగే సరికి సందుమొదటలో ముగ్గురు నలుగురు మనుషులు నిలబడి వీరికి కనిపించారు.

"బక్షీగారూ! ఎక్కడికి వెళ్ళుతున్నారు? అటువైపు మాత్రం వెళ్ళకండి". బక్షీగారికి పరిచయం ఉన్నవారిలో ఒకడు అన్నాడు.

"అసలు ఏం జరిగింది?"

"అవన్నీ ఎందుకు? మీరుమాత్రం అటు వెళ్ళకండి."

"అసలు ఏం జరిగిందో చెప్పు? విషయం తెలుసుకోవాలికదా?"

అప్పటికి కాశ్మీరీలాల్, జనరల్, రామదాసు మాష్టారులు బక్షీ, మెహతాజీల దగ్గరకువచ్చి చేరారు.

"ఆ సందులోకి చూడండి."

బక్షీ ఎదురుగా సందులోకి చూశారు. రోడ్డువతల ఆ సందులో ఒక మసీదు ఉన్నది. దాన్ని 'కేలామసీదు' అంటారు.

"ఏమైంది?"

"మీకేమి కనిపించడం లేదా? మసీదు ద్వారం కింద మెట్లవైపుకు చూడండి." మసీదు మెట్లమీద ఏదో నల్లటి వస్తువు పడి ఉంది.

"ఎవరో పందిని చంపి అక్కడ పారేసి పోయాడు."

బక్షీ మెహతా వైపు, "నేను చెప్పలేదా! ఏదో గొడవ జరిగి ఉంటుందని." అన్నట్టు చూసాడు.

అందరూ తిరిగి ఆవైపుకు చూసారు. మసీదు మెట్లమీద ఏదో నల్లని మూట ఉన్నట్టు కనబడింది. అందులో నుండి రెండుకాళ్ళు బయటకు కన్పిస్తున్నాయి. మసీదుయొక్క పంబరంగు దర్వాజా మూసి ఉన్నది.

"పదండి, పదండి, ఇక్కడనుండి త్వరగా వెళ్ళిపోదాం". రామదాసు మాష్టారు మెల్లగా అన్నాడు.

కాశ్మీరీలాల్ పందివైపు చూసి 'థూ.... ' అని ఉమ్మి వేసి ముఖం తిప్పుకున్నాడు.

"బక్షీగారూ! ఇక్కడి నుండి తిరిగి వెళ్ళిపోదాం. ముందున్నదంతా మహమ్మదీయులు నివసించే ప్రాంతమే!" రామదాసు మాష్టారు మరలా మెల్లగా అన్నాడు.

"ఎవరో కొంటితనానికి చేసినట్టుంది." మెహతాగారు మెల్లగా గొణిగారు.

"అది పందేనని మీరు ఖచ్చితంగా చెప్పగలరా?"

"ఏమో ఇంకా ఏదైనా జంతువై ఉండొచ్చుకదా?"

"ఇంకేదో జంతువైతే మహమ్మదీయులు ఇంత ఆవేశం ఎందుకువడతారు?" బక్షీగారు విసుక్కుంటూ అన్నారు.

జనరల్ ఆ మసీదు మెట్లవైపు పరీక్షగా చూసి ఒక్కసారిగా అరిచాడు– "ఇది తప్పకుండా తెల్లవాళ్ల పనే! ఆంగ్లేయులే చంపి ఈ పందిని ఇక్కడ పడవేసారు. నాకు తెలుసు".

"అవును ఇంగ్లీషు వాళ్ళ కొంటితనమే! నువ్వు కొంచెం నిశ్శబ్దంగా ఉండు." బక్షీగారు అతనికి నచ్చజెప్పారు.

"వెనక సందులోంచి తిరిగి వెళ్ళిపోదాం". రామదాసు మాష్టారు మరలా అన్నాడు. కాని ఈసారి జనరల్ అతనిమీద విరుచుకు పడ్డాడు.

"నువ్వు పిరికి పందవు. ఇది ఆంగ్లేయులు కావాలని చేసిన కొంటిపనే. వాళ్ళ



కుట్రను నేను బయటపెడతాను."

మెహతాజీ మెల్లగా బక్షీగారి చెవిలో చెప్పసాగారు.–

"ఈపిచ్చివాడిని ఎప్పుడూ ఎందుకు వెంట తీసుకు వస్తావు? వీడు అందరిని చంపిస్తాడు. వీడిని కాంగ్రెసు నుండి తొలగించు".

దారివెంట పోయే మహమ్మదీయులు మసీదు మెట్ల మీద దృష్టిపడగానే ముందు పరీక్షగా చూసి తర్వాత తిట్టుకుంటూ ముందుకు వెళ్ళిపోతున్నారు.

ఎదురుగా ఉన్న రోడ్డుమీద ఒక గుర్రపు బండి వేగంగా వెళ్ళింది. తర్వాత మసీదు పక్కన ఎవరో పరుగెత్తుతున్న అడుగుల చప్పుడు "వినిపించింది. రోడ్డుకు అవతల వైపున మేక మాంసం వేలాడదీసి వ్యాపారం చేసుకునే కసాయివాళ్ళు వాటిపై గుడ్డలు కప్పి దుకాణాలు మూసేస్తున్నారు. బక్షీగారు వెనుకకు తిరిగి చూసారు. రామదాసు మాష్టారు మెల్లగా జారుకుని వెనుదిరిగి వెళ్ళి పోవటం, అతని వెనుక అజీజ్, షేర్‌ఖాన్ కూడా వెళ్ళడం ఆయన చూసారు. సందులో అక్కడక్కడ ఇద్దరు ముగ్గురు గుంపులు గుంపులుగా ఉన్నారు.

"బక్షీగారూ! మీరు ఇక్కడ నుండి వెళ్ళిపోండి. మీరు ఇక్కడ ఉంటే లేనిపోని ఆవేశాలు పెరుగుతాయి." బక్షి పరిచయస్తుడు ఆయనకు నచ్చజెప్పాడు.

బక్షీ ఆ మనిషివంక చూసి, మరల కాశ్మీరీలాల్ వైపు తిరిగి చెప్పసాగాడు–

"వాసాం కర్ర నుండి జెండా తీసి చుట్టేసెయ్."

తనకు నచ్చజెప్పిన పరిచయస్తుని వైపు తిరిగి "ఈ పంది శరీరాన్ని ఇక్కడ నుండి త్వరగా తీసివేయాలి. అది ఇక్కడ పడి ఉన్నంతకాలం ఉద్రిక్తత పెరుగుతూనే ఉంటుంది." అన్నారు.

"మీరు ఆ పంది కళేబరాన్ని ఎత్తుతారా! నేను చెప్తున్నాను మీరు అసలు ఆవైపుకే వెళ్ళవద్దు." అంటూ ఆ పరిచయస్తుడు ఆందోళన పడ్డాడు.

"అవును నేనూ ఈయనతో ఏకీభవిస్తాను. మనం ఇందులో తలదూర్చకూడదు. దీనివలన విషయం మరింత కఠిన మౌతుంది." మెహతాజీ దృఢంగా పలికారు.

"మనం ఇక్కడి నుండి వెళ్ళిపోతే ఈ సమస్య పెరగదా! మహమ్మదీయులు ఈకళేబరాన్ని తొలగిస్తారా!"

"వాళ్ళు తొలగించకపోతే పాకీవాడినో, వెట్టివాడినో ఏర్పాటు చేసుకుంటారు. మనం ఏవిధంగానూ ఈ విషయంలో జోక్యం చేసుకోడానికి వీలులేదు."

బక్షీగారు తన చేతిలోని లాంతరును ఒక ఇంటి అరుగుమీద పెట్టి మెహతాజీ వైపు చూస్తూ–

"ఏమంటున్నారు మెహతాజీ! మనం మెదలకుండా ఇక్కడనుండి వెళ్ళి పోవాలంటారా? మనం చూడకుండా ఉంటే, ఆవిషయం వేరు." అంటూ జనరల్‌ను కాశ్మీరీలాల్‌ను పిలిచి తన వెంటరమ్మని వీరితో పాటు సందుగుండా మసీదు వైపునడవసాగారు.

కాశ్మీరీలాల్ వెళ్ళాలా! వద్దా! అని సందిగ్ధంలో పడ్డాడు. ఇమామీదీన్‌పేటలో రాళ్ళు పడ్డాయి. ఇక్కడ ఏం జరుగుతుందో! అతని ఒళ్ళంతా చెమటతో తడిసి పోయింది. అతని జెండా కర్రను గోడకానించి అక్కడే కదలకుండా నిలబడిపోయాడు. మోకాళ్ళలో సన్నగా వణుకు బయల్దేరింది. అప్పటికే జనరల్, బక్షీ ఇద్దరూ రోడ్డు దాటి ఆపక్కకు వెళ్ళిపోయారు. కాశ్మీరీలాల్ అక్కడే కొద్దిసేపు ఆలోచిస్తూ నిలబడి, తర్వాత మెల్లగా వారి వెంట వెళ్ళాడు. మెహతాజీ ఒంటరిగా అక్కడే నిలబడిపోయాడు. ఆ సందు అంతా ఆయనకు నిర్మానుష్యంగా తోచింది. కుడిచేతివైపు దూరంగా బావి చుట్టూ ఉన్న మూడు నాలుగు దుకాణాలు మూసి వేయబడి ఉన్నాయి. అక్కడ ఉన్న ఇద్దరు మనుషులు ఇటువైపే చూస్తూ నిలబడి ఉన్నారు. ఇళ్ళ తలుపులన్నీ మూసి వేయబడి ఉన్నాయి. అక్కడక్కడ బాల్కనీలలో నుండి జనం తొంగి చూస్తున్నట్లు ఆయనకు అనిపించింది.

"ముందు ఈ పంది కళేబరాన్ని ఇక్కడ నుండి తొలగించాలి" అంటున్నారు బక్షీ.

## ముక్కలు ముక్కలుగా...

మనిషి రోడ్డుమీద నడుస్తున్నాడు.
రోడ్డు ప్రక్కనే చెప్పులు కుట్టుకునేవాడు
మనిషి కాళ్ళకేసి పరకాయించి చూసి
తల మళ్ళీ తిప్పేసుకున్నాడు
ఆ ప్రక్కనే ఉన్న లాండ్రీవాడు
మనిషి చేతులకేసి, గుడ్డలకేసి చూసి
తన పనిలో మళ్ళీ నిమగ్నుడయ్యాడు.
ఆ ప్రక్కనే ఉన్న బార్బర్ షాపువాడు
మనిషి తలకేసి, గడ్డంకేసి చూసి
కుర్చీలో కూర్చున్నవాడి తలవంచేడు.
కారుహారన్ ధ్వనికి ఉలికిపడ్డ మనిషి
రోడ్డు ప్రక్కకి తప్పుకున్నాడు.
కారు డ్రైవరు మనిషికేసి చిరాగ్గా చూసి
గేరు మార్చాడు.
కార్లో వెనక సీట్లో కూర్చున్న
తెల్లబట్టల నాయకుడు మాత్రం
చిరునవ్వు చిందించాడు–
గతానికి కృతజ్ఞతగానూ,
భవిష్యత్తుకి పెట్టుబడిగానూ.

- దు. రామమోహనరావు

నల్లని పంది, ఎవరో దాని మీద గోనె పట్టా కప్పి వెళ్ళారు. ఆ గోనే పట్టా కింద నుండి, కాళ్ళు, మూతి కొంచెం పొట్ట కన్పిస్తున్నాయి.

మెహతాజీ ఇంకా ఆ సందులోనే గోడ నానుకుని నిలబడి ఉన్నారు. ఆయన ఇంకా వెళ్ళాలా! వద్దా! అన్న మీమాంసంలోనే ఉన్నాడు. పందిని అక్కడి నుండి తొలగించే పనిలో పాల్గొంటే గౌరవం వచ్చే మాట నిజమే! కాని, ఆయనకు తన తెల్లని బట్టలు మాసిపోతాయనే భయం కూడా ఉంది. జనరల్, బక్షీ కలిసి పంది కాళ్ళు పట్టుకుని లాగి ఈడ్చుకుంటూ రోడ్డు దాటించి తీసుకువచ్చి, ఒక రాళ్ళ గుట్ట వెనక కనపడకుండా పడవేసారు.

"ప్రస్తుతానికి దీనిని ఇక్కడ ఉండనీ. మసీదు తలుపులు తెరచిన తర్వాత ఆ మెట్లని శుభ్రం చేసుకుంటారు." అని కాశ్మీరీలాల్ వైపు తిరిగి "కాశ్మీరీ! నువ్వు ఈ పక్కన ఉన్న పాకీవాళ్ళ కాలనీకి వెళ్ళు. అక్కడ మున్సిపాలిటీలో పని చేసే పాకీ వాళ్ళుంటారు. వారిలో ఎవరైనా ఇద్దరు తన బండి తీసుకొనివస్తే దీన్ని ఎత్తి పారవేయవచ్చు" అన్నారు బక్షీ.

అంతలోనే నూతి పక్కనుండి ఎవరో పరుగెత్తుతున్న అలికిడి విన్పించింది. ముగ్గురూ అటుతిరిగి చూసారు. ఒక ఆవు పరుగెత్తుతూ వస్తూ ఉన్నది. దాని వెనుక తలగుడ్డ చుట్టుకొని చేతిలో కర్ర పట్టుకున్న ఒక వ్యక్తి దాని వెంట పరుగెత్తుతూ తోలుకుంటూ వస్తున్నాడు అతని ఛాతీ మీద తావీదు ఊగుతూ ఉన్నది. పెద్దపెద్ద కళ్ళతో కపిలవర్ణంలో ఉన్న ఆవు భయంతో తోకను పైకి లేపుతుంది. అది దారి తప్పినట్లున్నది. ముగ్గురూ నిశ్చేష్టులై పోయారు. తలగుడ్డ చుట్టుకున్న మనిషి ముఖం రోషంతో ఎర్రబడింది. ఆవును తోలుకుంటూ ఎడంవైపు సందులోకి తీసుకువెళ్ళాడు.

"పట్టణానికి చెడ్డరోజులు వచ్చినట్లున్నాయి. పరిస్థితులు ఏమాత్రం బాగులేవు." మెల్లగా అన్నాడు బక్షీ.

ఆయన ముఖం మరింతగా పాలిపోయింది. (ఇంకా ఉంది)

# వ్యక్తిగతం

## ట్రస్టులు కుంభకోణాలు ఆరోపణలు!

మహారాష్ట్ర ముఖ్యమంత్రి పదవికీ, అవినీతి కుంభకోణాలకూ, ప్రత్యేకించి ట్రస్టులకూ ఏదో సంబంధం వున్నట్టుంది! అబ్దుల్ రహమాన్ అంతులే కథ లింకా పాతబడకముందే ఎస్. బి. చవాన్ ఆశ్రితపక్షపాతం గాథలు వెలుగులోకివస్తున్నాయి. ఆయన కుమారుడు అశోక్, భార్య కుసుమ్ తాయి లకు నాందేడ్‌లోని ప్రగతి మహిళామండలి, సాయి సేవాభవన్ ట్రస్ట్‌లతో సంబంధాలున్నాయట. ఈ రెండు ట్రస్టులకు దుకాణాలను,



స్థలాలను మంజూరుచేయడంలో నాందేడ్ మునిసిపల్‌కౌన్సిల్ అక్రమాలకు తలపడిందట! స్వయంగా ముఖ్యమంత్రి కార్యాలయం నుంచి ఈ అక్రమాలకు అనుమతులు, ఆదేశాలు అందాయట. సాయి సేవాభవి ట్రస్ట్‌కు రిజిస్ట్రేషన్ కూడా కాకముందే లక్ష రూపాయల నిధిని, అతితక్కువ అద్దెకు రెండు కార్యాలయ గదులను మునిసిపల్ కౌన్సిల్ అందజేసిందట! ఈ ఆరోపణల మీద ఔరంగాబాద్‌లోని హైకోర్టుబెంచి విచారణ జరుపుతోంది.

★ ★ ★

హర్యానా ముఖ్యమంత్రి దేవీలాల్ కనుసన్నల్లో కర్నాల్ లోని ఒక కుటుంబంమీద దాడులు, దౌర్జన్యాలు జరుగుతున్నట్టు తెలుస్తున్నది. దేవీలాల్ అల్లుడు మొహిందర్ సింగ్

## హర్యానా ముఖ్యమంత్రి కసితీరుస్తున్న పోలీసులు!



లాధెర్‌కూ – తేజీందర్ సింగ్ మాన్ కుటుంబానికి మధ్యవున్న తగాదాలే ఇందుకు కారణం. తేజీందర్‌సింగ్ హర్యానాలో కాంగ్రెస్ మాజీమంత్రి సుర్జిత్ సింగ్‌మాన్ తమ్ముడు. పార్టీల వివాదాలకు, భూమి సంబంధమైన తగాదాలు కూడా కలవడంతో ఘర్షణ కోర్టుకేసులదాకా ముదిరింది. చివరికి తేజీందర్‌సింగ్ కుమారుడు, డూన్ పాఠశాల విద్యార్థి రణవీర్‌మాన్‌ను పోలీసు అధికారు లిద్దరు వచ్చి ఇంట్లోంచి తీసుకు పోయారు. జూన్ 17 మధ్యాహ్నం ఈ అపహరణ జరగగా, జూన్ 20 దాకా రణవీర్ జాడతెలియలేదు. తేజీందర్ సింగ్ కుటుంబం ప్రధానమంత్రి నుంచి స్థానిక పోలీసు అధికారుల వరకు ఎంతో మందికి విజ్ఞాపనలు పంపినా ఫలితంలేకపోయింది. ఆ ప్రాంత రైతులు ఒక ప్రదర్శనను నిర్వహించాలని తలపెట్టగా, పోలీసులు దాన్ని భగ్నం చేశారు. ఆ ప్రదర్శన మరొకచోట జరిగింది. ఫలితంగా మూడు రోజుల చిత్రహింసల తర్వాత రణవీర్‌ను వదిలేశారట. పోలీసులు ఈ మూడు రోజులలో అతన్ని అనేక పోలీసు స్టేషన్లకి మార్చారట!

## అలహాబాద్ పండితుడి ఆగ్రహం!

కమలాపతి త్రిపాఠీని విస్మరించడం అంత సులభం కాదు. అలా విస్మరించ



దలచుకుంటే మూల్యం చెల్లించవలసిందే. రాజీవ్‌గాంధీ అలా విస్మరించినందు వల్ల కలుగుతున్న విపరిణామాలు ఇప్పుడిప్పుడే వెలుగులోకి వస్తున్నాయి. ఈ మధ్యనే త్రిపాఠీ తన ఆత్మ కథను వెలువరించారు. దాని పేరు స్వతంత్రతా ఆందోళన్ ఔర్ ఉస్‌కే బాద్' (స్వాతంత్ర్యోద్యమం, తర్వాత) ఆ పుస్తకంలో గత రెండు దశాబ్దాలలో, ముఖ్యంగా గత మూడు సంవత్సరాలలో పార్టీ పని విధానంలోని కొత్త పరిణామాలను నిర్మొహమాటంగా, సూటిగా విశ్లేషించారు. పార్టీలో సహజ నాయకత్వాన్ని రద్దుచేసినందుకు శ్రీమతి ఇందిరాగాంధీని, దాన్ని వ్యవస్థీకరించినందుకు రాజీవ్‌గాంధీని ఆయన పూర్తిగా తప్పు పట్టారు....

## గుజరాత్ ముఖ్యమంత్రి కుమారునికి 15 గ్రేస్‌మార్కులు!

కోట్లాది రూపాయలు, ఎకరాలకొద్దీ భూములు లాంటి విషయంలో అవినీతి విచారణలేకుండా సమసిపోతున్నప్పుడు 15 మార్కులు అక్రమంగా అర్పిస్తే నష్టమేముందని గుజరాత్ ముఖ్యమంత్రి అమరసింహ చౌదరి అనుకున్నట్టున్నారు. ఎం. ఎస్. విశ్వవిద్యాలయం(బరోడా)లో ఎం. బి. బి. ఎస్. చదువుతున్న ముఖ్యమంత్రి కుమారుడు తుషార్ చౌదరి రెండో సంవత్సరం పాస్ కావడానికి 15 గ్రేస్‌మార్కులు పొందారు. తాను ఏ అక్రమానికి పాల్పడలేదని అంటూ ముఖ్యమంత్రి ఒక విచారణ కమిషన్ నియమించారు గాని వాస్తవానికి తుషార్ విద్యార్థినా చరిత్ర ఎంతో అనుమానాస్పదంగావుంది. 39 శాతం మార్కులేవచ్చినా ఆయనకు ఎం. బి. బి. ఎస్.లో ప్రవేశందొరికింది. 77 శాతంమంది పాసయిన రెండో సంవత్సరం పరీక్షలో ఆయన తప్పగా, ప్రత్యేకంగా నియమించిన ఒక అడ్‌హాక్ కమిటీ ఆయనకు 10 మార్కులు కలపాలని సిఫార్సుచేసింది. అవికూడా సరిపోవని, విశ్వవిద్యాలయ అధికారులు మరొక 5 మార్కులు కలిపారు! 15 మార్కుల అక్రమం కూడా అక్రమమేనా అనుకున్నట్టున్నారు......



# పచ్చటి పొలాలు...మెచ్చదగిన పంటలు!
# జైకిసాన్ శక్తితో దిగుబడులు కుప్పతిప్పలు.






హెచ్చు పోషక పాళ్లు గల జైకిసాన్ ఎరువుల్లో నిండివున్నాయి మరింత సమృద్ధమైన పోషక పదార్థాలు—మీకు పుష్కలమైన పంట ఇవ్వడం కోసం.

## జైకిసాన్ సామ్రాట్ 18 : 46 : 0

విత్తే సమయంలో ఇది అతి ముఖ్యం. బలమైన వేళ్ల కోసం. పూర్తిగా గింజ కట్టడం కోసం, ఫాస్ఫేట్‌తో సమృద్ధమైనది.

## జైకిసాన్ సంపూర్ణ 19 : 19 : 19

మొక్క అన్ని విధాలా ఆరోగ్యంగా పెరగడం కోసం అత్యధిక పాళ్లలో ఎన్ పి కె పోషక పదార్థాలు గల ఇటువంటి ఎరువు ఇదొక్కటే.

## జైకిసాన్ యూరియా 46.4% నత్రజని

నత్రజని నిండి వుండే ఈ స్వచ్ఛమైన తెల్లని గుళికల్లో బైయూరేట్ పాలు తక్కువ. పైపాటుగా వేయటానికీ, ఆకుల మీద చల్లటానికీ ఆదర్శవంతమైనది.







LINTAS ZUA 165 2317 TL

# నిష్కృతి

## డాక్టర్ ఆల్వాయిస్

అది ఓ నర్సింగ్‌హోమ్.

సమయం అర్ధరాత్రి పన్నెండు గంటలు దాటింది.

పరిసరాలన్నీ నిద్రావస్థలో వున్నాయి.

అంతటా నిశ్శబ్దంగా వున్నా లైట్లు మాత్రం దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

మూలిగే రోగులు సైతం ఆదమరచి నిద్రపోతున్నారు. కానీ భార్య మంచం పక్కగా ఓ బెడ్‌షీట్‌వేసి పడుకున్న ఆనందయ్యగారికి మాత్రం కంటిరెప్ప మూతపడ్డంలేదు. భయంకరమైన ఆలోచనలు అతన్ని వుక్కిరిబిక్కిరిచేస్తున్నాయి.

తలతిప్పి ఓసారి భార్య మంచంకేసి చూశాడు. విషయం తెలియని ఆవిడ హాయిగా నిద్రపోతోంది.

ఆనందయ్యగారు స్కూల్ టీచర్‌గా రిటయిరయ్యాడు. తన వుద్యోగకాలంలో, వున్న ఒకే కొడుక్కి మంచి చదువు చెప్పించి, తాతల్నాటి డాబా యింటిమీద రెండుగదులు వేయించగలిగాడు. అయితే డాబామీద గదులు వేయించడాని కాయన బేంక్‌లో కొంత లోన్‌కూడా తీసుకున్నాడు.

ఆయన కొడుకురఘు శ్రీరామచంద్రుడే. తండ్రి మాట వేదం. చాలా తెలివైనవాడు. అందంగా వుంటాడు. ఇటీవలే ఐ. ఏ. ఎస్. పాసయి ప్రస్తుతం ట్రైనింగ్‌లో వున్నాడు. ఆనందయ్యగారికి, ఆయన భార్య పార్వతమ్మకి ఆకాశంలో విహరిస్తున్నంత ఆనందంగావుంది.

"త్వరలో మా బాబు కలెక్టరైపోతాడు" అనుకున్నాడు ఆనందంగా. పెళ్ళి చేసేద్దామని సంబంధాలు కూడా చూస్తున్నారు. అలాంటిపరిస్థితుల్లో పార్వతమ్మ ఆరోగ్యం దెబ్బతింది. కాళ్ళు వాయడం, జ్వరం రావడం, నడుం నొప్పిగా వుండడంలాటివి చాలా వచ్చాయి.

ఆనందయ్యగారు డాక్టరుకి చూపించాడు. డాక్టర్ ఆవిణ్ని ఎగ్జామిన్ చేసి పిడుగు లాంటి ఓ వార్త చెప్పాడు.

ఆవిడకి కిడ్నీలు పూర్తిగా చెడిపోయాయి. బతకాలంటే వెంటనే కిడ్నీ మార్పిడి చెయ్యాలి.

"చెయ్యండి" అన్నాడు ఆనందయ్యగారు.

"కానీ.... చాలా డబ్బు ఖర్చవుతుంది" అన్నాడు డాక్టర్.

"ఎంతవుతుంది బాబూ?" ఆదుర్దాగా అడిగాడాయన.

"కిడ్నీ ఎవరైనా యిస్తే పదివేలతో అయిపోతుంది. లేకపోతే నలభైవేలదాకా అవచ్చు."

నలభైవేలా?" గొణుక్కున్నాడు ఆనందయ్యగారు.

"కిడ్నీ మీ రిస్తే....."

"సరే. నేను ఆలోచించిచెప్తాను. ఈ విషయాలేమీ నా భార్యకు తెలియనివ్వకండి" అని చెప్పి భార్యదగ్గరికొచ్చాడాయన.

"డాక్టర్‌గా రేవన్నారు?" మంచంమీద నించే అడిగింది పార్వతమ్మ.

"ఏంలేదు. ఏదో చిన్న అనారోగ్యం. పది రోజులు హాస్పటల్లో వుంటే తగ్గిపోతుందన్నారు." అందంగా అబద్ధం చెప్పాడు ఆనందయ్యగారు.

"పది రోజులే!"

"పదిరోజులు ఎంతలోకి గడుస్తాయే పార్వతీ! నీ కెందుకు? నువ్వు హాయిగా పడుకో అంతా సవ్యంగానే జరుగుతుంది" అన్నాడు అనునయంగా.

పార్వతమ్మ నిశ్చింతగానే పడుకుంది.

అయితే ఆనందయ్యగారికి మాత్రం రెప్ప అంటుకోవడంలేదు.

పదివేలు ఎలా పుట్టించాలి?

ఇదే ఆలోచన ఆయన్ని కలవరపెడ్తోంది.

"సేటుదగ్గర యిల్లు తాకట్టుపెడితే?" అనుకున్నాడు.

ఇల్లు బేంక్‌లో వున్నా సేటు డబ్బు యిస్తాడు. ఇల్లు బేంక్‌లోన్‌కన్నా చాలా ఎక్కువ చేస్తుందనైనా అవచ్చు. మొహమాటంవల్లా కావచ్చు.

తెల్లవారుతూనే భార్యకి కాఫీ అదీ యిచ్చి, సేటుదగ్గరికి పరిగెత్తాడు ఆనందయ్యగారు. అయితే దురదృష్టంకొద్దీ సేటు ఏదో పనిమీద బొంబాయి వెళ్ళాడు. పది రోజులదాకా రాడు.

విషయం చెప్పి సేటు కొడుకుని అడిగాడాయన. అయితే అతను వెయ్యి, రెండు వేలయితే చూడగలనుగానీ పదివేలు యివ్వడం తనవల్లకాదని నిర్మొహమాటంగా చెప్పేశాడు.

బేంక్ వాళ్ళనే బతిమాలుదామన్నట్టు పట్నం వెళ్ళాడు. అయితే బస్సుదొరికి అక్కడికి చేరుకునేసరికి బేంక్ క్లోజ్‌చేశారు. పైగా శనాదివారాలతో వరసాగ్గా నాలుగు రోజులు శలవుదినాలు వచ్చాయి. ఒకవేళ తర్వాత వెళ్తే మాత్రం డబ్బు వెంటనే యిస్తారనేవిటి?

ఆనందయ్యగారి మొహం కళతప్పింది. అయినా అభిమానాన్ని చంపుకుని ముఖపరిచయం వున్నవాళ్ళందర్నీ అడిగాడు.

"వెయ్యి, రెండు వేలయితే చూడచ్చుగానీ పదివేలు మాదగ్గరెలా వుంటాయి?" అనేశారు. నిజంకూడా అంతే.

ఆయనకి దిక్కుతోచలేదు.

విషయం కొడుక్కి తెలియపరుద్దామా అనుకున్నాడు. కానీ ఫలితం? అందుకే తన బాధేదో తనే పడదామని నిర్ణయించుకున్నాడు.

పార్వతమ్మకి అన్ని టెస్టులూ జరిపారు డాక్టర్లు. అదృష్టవశాత్తూ ఆనందయ్యగారి కిడ్నీ ఆవిడకి అమర్చచ్చు.

"కొంతలో కొంత నయం" అనుకున్నాడాయన.

"వారం రోజుల్లోపల ఆపరేషన్ చెయ్యాలి" మరోసారి హెచ్చరించాడు డాక్టరు.

"మీరు డేట్ ఫిక్స్ చెయ్యండి. నే నెలాగైనా డబ్బుతెచ్చిస్తాను" అన్నాడు ఆనందయ్యగారు.

ఆయనగురించి బాగా తెలిసినవాడవడంవల్ల ఆపరేషన్ డేట్ ఫిక్స్‌చేశాడు డాక్టర్.

ఆనందయ్యగారు అడిగినవాళ్ళని అడక్కుండా అడుగుతున్నాడు. అయినా ఫలితం శూన్యం.

రోజులు గడుస్తున్నకొద్దీ ఆయనలో తెలియని భీతి ఆవహిస్తోంది.

హఠాత్తుగా ఆయనకి మెరపులా ఓ ఊహతట్టింది. ఆయన మొహంలో కాస్త జీవంవచ్చింది.

వరంగల్లో ఆనందయ్యగారి తండ్రి స్నేహితుడైన ఓ వృద్ధుడున్నాడు. ఆయన ఆపదలో వున్నవాళ్ళని తప్పకుండా ఆదుకుంటాడు.

"తన పరిస్థితి చెప్పి, డబ్బు తెచ్చుకుని, ఇల్లు అమ్మి మెల్లగా అప్పు తీర్చచ్చు" అనుకుని వెంటనే డాక్టర్‌కి ఒకరకంగా, భార్యకొకరకంగా చెప్పి, చేతిలో కాస్తడబ్బుతీసుకుని స్టేషన్‌కేసి నడిచాడు. అయితే దురదృష్టం అతని వెంటవున్నట్టు వరంగల్‌లో వాళ్ళులేరు. వృద్ధుడు చనిపోవడంతో ఇల్లూ, వాకిళ్ళూ అమ్మేసి ఎక్కడికో వెళ్ళిపోయారట.

కళ్ళు తిరిగినంతపనయిం దాయనకి.

భార్య రూపం. ఆమె కొచ్చిన రోగం కళ్ళముందు నిల్చాయి. ఆయనకి దుఃఖం వచ్చేస్తోంది.

ఉసూరుమంటూ వరంగల్ స్టేషన్‌కొచ్చాడు. అప్పటికే ట్రైన్ స్టేషన్‌కొచ్చేసింది.

గభాల్న టికెట్ తీసుకుని ప్లాట్‌ఫామ్‌మీదికొచ్చేసరికి ట్రైన్ స్టార్టయిపోయింది.

క్షణం నిర్ఘాంతపోయినట్టుండిపోయి, మళ్ళీ తేరుకుని ట్రైన్‌తో పాటు పరిగెత్తి అతిప్రయాసగా ఓ కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కాడు.

అప్పటికే ట్రైన్ స్టేషన్‌దాటిపోయింది. పరిగెత్తిన ఆయాసం తగ్గి, వాస్తవంలోకొచ్చిన ఆనందయ్యగారికి పరిసరాలు చూసేసరికి మళ్ళీ దడ మొదలయింది.

కారణం అతనెక్కింది ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్!

సాధారణంగా ఆ ట్రైన్‌లో ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్ కూడా కిక్కిరిసేవుంటుంది. కానీ ఆరోజు మాత్రం ఎక్కువమంది వున్నట్టులేరు. అంతా నిశ్శబ్దంగావుంది.

ఏ టి.సి. అయినా చూస్తే? అన్న భయం ఆవరించింది ఆనందయ్యగారిని.

పక్క స్టేషన్ ఏదో అన్నట్టు క్షణం ఆలోచించాడు. తర్వాత ఆలోచించి ఓ నిర్ణయానికొచ్చాడు.

టి. సి. అడిగేముందే లోపలి ప్రయాణికులకి తన పరిస్థితి చెప్పి, పక్క స్టేషన్‌లో దిగిపోతానంటే సానుభూతి లభించచ్చు. అందుకే మెల్లగా కారిడార్‌లోంచి లోపలికి నడిచాడు. కొందరు అతన్ని గమనించినా పెద్దగా పట్టించుకోలేదు. వాళ్ళ వేషభాషల్ని చూశాక వాళ్ళని పలకరించడానికి ఆయనికి ధైర్యం చాల్లేదు.

అలా నడుస్తూ ఓ 'కుపే'దగ్గరకొచ్చాడు.

ఆ 'కుపే'లో ఓ వృద్ధుడు బల్లమీద అనుక్కూర్చుని, కళ్ళు మూసుకుని ఏదో ఆలోచిస్తున్నట్టున్నాడు.

అతని కాళ్ళదగ్గర ఓ పెట్టెవుంది.

"బాబుగారూ" మెల్లగా పిల్చాడు ఆనందయ్య గారు.

అతను పలకలేదు.

మరోసారి పిల్చాడాయన.

ఈసారీపలకలేదు.

అతను తాగున్నాడేమో అనిపించింది ఆనందయ్య గారికి. ఓసారి పరిశీలనగా చూశాడు.

అతను కూర్చున్న తీరు ఏదో అనుమానం కలిగించింది ఆనందయ్యగారికి. గభాల్నవెళ్ళి తట్టాడు.

అంతే! ఆయన ఒళ్ళు జలదరించింది.

కూర్చున్న వృద్ధుడు తల పక్కకి వాల్చేశాడు.

అతనిలో ప్రాణంలేదని గ్రహించిన ఆనందయ్య గారి గుండె ఆగినట్టయింది.

కంగారుగా 'కుపే' మొత్తం చూశాడు.

ఆ వృద్ధుడు తప్ప యింకెవ్వరూలేరు.

రైలు పరిగెడూతున్న శబ్దం తప్ప యితర శబ్దాలేం లేవు. బెర్త్ పక్కగా తెరిచివున్న బ్రీఫ్‌కేస్, దాన్నిండా నోట్ల కట్టలు!

ఆనందయ్య గుండె ఝల్లుమంది.

కళ్ళు విశాలమయ్యాయి. చూపులు డబ్బుమీద!

"డబ్బు!"

ఒంటరిగావున్న శవం పక్కగా డబ్బు!

తను కాళ్ళరిగేలా తిరిగినా దొరకని డబ్బు.

ఈడబ్బు తీసుకుంటే?

అయ్యో! డబ్బుకోసం తనే హత్య చేశాడని మూసేస్తారు. కలెక్టర్ కాబోతున్న కొడుక్కి ఆస్తిపాస్తులు యివ్వకపోగా, హంతకుడి కొడుకు అన్న బిరుదిస్తాడా! నో!"

ఆయన. ఒళ్ళంతా చెమటలు. దిగజారి పోతున్నాడు.

ముత్యుముఖంలోవున్న భార్య మొహం నీరసంగా కనిపిస్తోంది.

అలా చాలాసేపు మంచిచెడులమధ్య నలిగిపోయాడాయన. చివరికి స్వార్థమే గెలిచింది.

ఒణుకుతున్న చేతులతో డబ్బు తీసి చూశాడు. సరిగ్గా పదివేలు! తన భార్యకోసం ఆ భగవంతుడే



లెక్కబెట్టి పంపినట్టుంది! ఏడి వందనోట్లు కొన్ని వున్నాయి అడుగున.

ఆనందయ్యగారి అంతరాత్మ మరోసారి తప్పు చేస్తున్నావంటూ ఘోషించింది. అయితే మానవుడిలోని సహజ గుణమైన స్వార్థం మనసుని అవతలికి నెట్టింది.

ట్రైన్ పెద్దగా అరిచింది.

తృళ్ళిపడ్డ ఆనందయ్య గభాల్న డబ్బుతీసుకుని తన బేగ్‌లో సర్దేసుకుని ఓసారి వృద్ధునికేసి బెరుగ్గా చూశారు. అతను చాలా స్థితిపరుడని అతని బట్టలు, అతని వేళ్ళకున్న వజ్రపుంగరాలు చెప్తున్నాయి.

మరోసారి గర్జించింది ట్రైన్.

ఆనందయ్య మొహానికి పట్టిన చెమటని తుడిచేసుకుని, బ్రీఫ్‌కేస్ మూసేసి, అక్కడంతా కండువాతో తుడిచేసి బైటికొచ్చాడు. తలుపుదగ్గరగా లాగి గుమ్మం దగ్గరికొచ్చాడు.




మరో రెండు నిమిషాలకల్లా ఏదో స్టేషన్‌లో ఆగింది ట్రైన్. గబగబాదిగేశాడాయన.

అతన్నెవరూపట్టించుకోలేదు.

ట్రైన్ మళ్ళీకదిలింది.

చేతిలోని బేగ్‌తో సహాబైటకొచ్చి బస్టాండుకేసి నడిచాడు.

అయన చేతిలోని బేగ్ వెయ్యిటన్నుల బరువుగా అనిపించింది. ఒంట్లోని రక్తమంతా నీళ్ళలా అయిపోనట్టు నీరసం ఆవహించేసింది.

ఎలాగో యిల్లు చేరుకున్నాడు.

అయినా ఆయన ప్రతిక్షణం వులిక్కి పడుతున్నాడు. ఏ క్షణానైనా పోలీసులు తనని పట్టుకుపోతారన్న భయం ఆయన్ని ఒణికించేస్తోంది. డబ్బు తీసుకునేప్పుడున్న ధైర్యం మొత్తం పారిపోయింది. ఒకోసారైతే, ఆయనెవరో వెతుక్కుంటూ వెళ్ళి, వాళ్ళ వాళ్ళకి జరిగింది చెప్పెయ్యాలనుకున్నాడు. కానీ కొడుకు భవిష్యత్తు గుర్తొచ్చి ఆగిపోయాడు.

పార్వతమ్మ ఆపరేషన్ సక్సెస్ అయ్యింది.

రేపే డిశ్చార్జ్ చేస్తున్నారు. రఘు కూడా వచ్చాడు.

ఆ సాయంత్రం ఆనందయ్యగారు హాస్పటల్ కెళ్ళే సరికి భార్యతో ఎవరో మాట్లాడుతూ, ఆయన వెళ్ళగానే అవతలి కెళ్ళిపోయారు.

"ఎవరు పార్వతీ?" బలవంతంగా నవ్వుతూ అన్నాడాయన.

"పక్క బెడ్ పేషెంటు తాలూకు వాళ్ళంది! పాపం హఠాత్తుగా కూతురి పెళ్ళి ఆగి పోయిందిట! విషయం వినగానే తెలివి తప్పి పడి పోయిందిట. తీసుకొచ్చారు" నిట్టూరుస్తూ అంది పార్వతమ్మ.

"అలాగా! ఎందుకు ఆగిపోయిందట పెళ్ళి?" ఏదో అడగాలన్నట్టు అడిగాడాయన.

"ఏవుందిబాబూ! మా రాత!" పక్కనించి బాధగా అంది ఓ ముసలావిడ.

"అమ్మమ్మా! నువ్వూరుకో!" సున్నితంగా అందో యువతి. తలతిప్పి చూశాడు ఆనందయ్యగారు.

ఆ యువతికి సుమారు ఇరవైఏళ్ళుండచ్చు. రంగు తక్కువైనా కళగా వుంది మొహం.

"ఎలా వూరుకుంటానే, నా నోరు నొప్పెట్టేదాకా అంటూనేవుంటాను" కోపంగా అందా వృద్ధురాలు.

"ఫలితం ఏమైనా వుంటుందా?" గొణిగినట్టు అందా యువతి. వృద్ధురాలు మాట్లాడలేదు.

ఆనందయ్యగారిలో కుతూహలం తొంగిచూసింది. మెల్లగా వివరాలడిగి తెలుసుకున్నాడు. అంతే ఆయన మొహం మరింత నల్లబడింది.

* * *

రఘు ట్రైనింగ్ పూర్తయి సబ్‌కలెక్టర్‌గా జాయినయ్యాడు. ఆడపిల్లల తండ్రులు క్యూలో నిల్చున్నారు లక్షల కట్నంతో పాటు పిల్లనిస్తామని.

ఆనందయ్యగారు పాత సంఘటన కాస్త మరిచినట్టు వుత్సాహంగానే వుంటున్నాడు.

ఆ రోజు రాత్రి ఏడుగంటలకి ఆయన భార్యని, కొడుకుని హాల్లోకి పిలిచాడు. ఇద్దరూ వచ్చారు కుతూహలంగా.....

"కూర్చోండి" అన్నారాయన గంభీరంగా.

మొహాలు చూసుకుంటూ కూర్చున్నారిద్దరూ.

"నీకు పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాను" హఠాత్తుగా అన్నాడు ఆనందయ్యగారు కొడుకుతో.

"అదెప్పట్నించో అనుకుంటున్న దేగా?" అయోమయంగా అంది పార్వతమ్మ.

"నిజమే. కానీ మనం కల్లో కూడా వూహించని, రఘు ఏనాడూ చూడని అమ్మాయితో పెళ్ళి!"

"కాస్త అర్థం అయ్యేలా చెప్పండి నాన్నా!" అన్నాడు రఘు. ఆతనికి తండ్రిధోరణి వింతగా అనిపించింది.

"చెప్తానుగానీ, నేను చెప్పిన అమ్మాయిని నువ్వు చేసుకోవాలి! కాదనవుగా?" ఆయన గొంతు ఆదోలా ఒణికింది.

"మీ మాట ఎప్పుడైనా కాదన్నానా? చెప్పండి. మీ ఫ్రెండ్ కూతురెవరైనా వుందా??" మృదువుగా అడిగాడు రఘు.

"ఊహూ. నా విరోధి కూతురుంది."

"వ్వాట్!"

"అవును రఘూ. చింతలపూడి రాజారావుగారి మనవరాలు!"

"ఏవిటి?" కొయ్యబారిపోయింది పార్వతమ్మ.

తండ్రికి మతి చలించిందా అన్నట్టు చూశాడు రఘు. కారణం చింతలపూడి రాజారావు కుటుంబానికీ, ఆనందయ్యగారి కుటుంబానికీ బద్ధవైరం వుంది. వారిమధ్య బంధుత్వంవున్నా రెండుతరాలక్రితం ఏదో ఘర్షణమూలంగా దూరమయ్యారు. తర్వాత రాజారావు కొడుకు, ఆనందయ్యగారూ కోర్టులక్కూడా ఎక్కారు. చివరికి రెండు కుటుంబాలమధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమనేలా తయారయ్యారు.

"ఏమిటినాన్నా?" తేరుకుని అన్నాడు రఘు.

"స్వర్ణముఖి పెళ్లి నా మూలంగా ఆగి పోయింది."

"స్వర్ణముఖి అంటే ఆరోజు హాస్పటల్లో కనిపించిన అమ్మాయికదూ?"

ఏదో ఆలోచిస్తూ అంది పార్వతమ్మ.

"అవును. ఆమె ఎవరోకాదు. రాజారావుగారి మనవరాలు!"

"అలాగా..... కానీ ఆ అమ్మాయి పెళ్ళి మీ మూలంగా ఆగిపోవడమేవిటి"

"అది తర్వాత చెప్తాను. నీ ఆపరేషన్‌కి డబ్బెలా వచ్చిం దనుకున్నావ్?" గంభీరంగా అన్నాడు ఆనందయ్య.

"మీ స్నేహితుడెవరో యిచ్చారన్నారుగా!"

"పదివేలు యిచ్చే స్నేహితుడు కూడా వున్నాడా నాక్కు. నేను దొంగతనం చేశాను."

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్టమైన ఆముదము







శుద్ధి
చేసినది,
వాసన
లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

753-TG

## "తిగతిగప్ర"

ప్రతిపక్షాల బలహీనత
అధికారపక్షానికి బలవర్ధకం
కొన్ని సంవత్సరాలు తప్ప
పరిపాలన సాగిస్తున్నది
ప్రగతి నా ఒక్క దాని
ప్రతిభేనంటున్నది
ఇందిరా కాంగ్రెస్

★ ★ ★

నలభై ఒక్క సంవత్సరాలు
వచ్చినా అక్షరాలు రానివాళ్ళు
అనేక కోట్లమంది ఉన్నారు
గంజినీళ్ళు దొరకని వాళ్ళు
'గోచీపాతరాయుళ్ళు,
చెట్టు నీడనా, కొమ్మల పైనా
నివశించే వాళ్ళూ,
చలికీ, వానకూ, ఎండకూ
ప్రాణాలు విడిచేవాళ్ళూ
అనాధ ప్రేతలూ లెక్కకు
మిన్నగా ఉన్నారు
ఆగస్టు 15ను వస్తున్నది
పోతున్నది అశోకచక్రం
ఎగురుతున్నది. ఆకాశంలో
పాలకుల పర్యటనలు
ఖజానాకు ఖాళీ చేస్తున్నాయి
పేరు గొప్ప. ఊరు దిబ్బ

★ ★

అమెరికా, రష్యాలు
చూసి వస్తారేకాని
అక్కడి ప్రజల జీవన
సరళిని అమలు జరపలేరు.
చైనా, జపాన్ చూసి వస్తారే కాని
అక్కడి శ్రామిక ప్రగతిని
సాధించలేరు. కనీసం
ప్రయత్నించలేరు. ప్రగతి గతి
'తిగతిగప్ర' వంతుగా ఉంది.
అమ్మల్లారా, బాబుల్లారా
యువకుల్లారా, యువతుల్లారా
మీ రంగాలలో దుష్టత్వాన్ని
తుదముట్టించండి- పండుగనాడు
ప్రతిన పూనండి-

- ఎం. ఎస్. ఎం.

## నిష్కృతి

శిలలా అయిపోయింది పార్వతమ్మ. రఘు ఏదో అనబోతుంటే వారించి.....

"అమ్మా! స్వర్ణా" అంటూ పిల్చాడు ఆనందయ్యగారు.

వరండాలోంచి వచ్చిందో యువతి.

"మా అబ్బాయి రఘురామ్. ఐ. ఏ. ఎస్. ఆమె నాభార్య. ఇదిగో నర్రా ఈ అమ్మాయి స్వర్ణముఖి" పరిచయవాక్యాలు పలికాడు ఆనందయ్యగారు.

"నమస్తే" బిడియంగా రెండు చేతులూ జోడించిందా యువతి.

ఆ పిల్ల హాస్పటల్లో కనిపించిన అమ్మాయిగా గుర్తించింది పార్వతమ్మ. అప్పటికన్నా అందంగా కనిపించిం దా యువతి ఆమెకళ్ళకి.

"కూర్చుని విషయం చెప్పమ్మా స్వర్ణా!" అన్నాడు ఆనందయ్య. ఆమె కూర్చుని మొదలు పెట్టింది.

మా తాతగారి కాలంలో ఆస్తిపాస్తు లున్నా క్రమేపీ అవి అంతరించి పోయాయి. నాన్న దుర్వ్యసనాలకి బానిసయి మమ్మల్ని, అప్పుల్ని వదిలి పై లోకాలకి తరలి పోయారు. ఈ దిగులుతో తాతయ్య మంచం పట్టారు. అమ్మకి హై బి. పి. వచ్చింది. ఇళ్ళూ వాకిళ్ళూ అమ్మి అప్పులు తీర్చాం. నేనో చిన్న వుద్యోగం చేస్తూ ఎలాగో బతుకు ఈడ్చుకొస్తున్నాను. మా తాతయ్యకి నా పెళ్ళి చూసి పోవాలని ఆరాటం. కానీ కడుపునిండా తినడానికే లేని పరిస్థితుల్లో నా పెళ్ళెలా చేస్తారు. అలాంటి సమయంలో తాతయ్యకి తెలిసిన ఒకతను ఓ సంబంధం తెచ్చాడు.

అతను టెన్త్ క్లాస్ ఫెయిలయి ఓ హోటల్లో బేరర్‌గా చేస్తున్నాడు. సకల దుర్గుణాభిరాముడు. అయినా నన్ను చేసుకునేందుకు అయిదు వేలు కట్నం అడిగాడు.

కట్నం అయిదువేలు, కర్చులకి అయిదు వేలు. పది వేలు కావాలి ఎలా?

ఆలోచించి ఆలోచించిన తాతయ్యకి ప్రాణ స్నేహితుడులాంటి ఓ పెద్దమనిషికి పరిస్థితి అంతా వివరిస్తూ తాతయ్య వుత్తరం రాశారు.

మాకుటుంబం గురించి బాగా తెలిసిన ఆయన పదివేలు తను ఇస్తాననీ పెళ్ళికి ఏర్పాట్లు చేసుకోమనీ రాశాడు.

అంతే! నాపెళ్ళికి లగ్నాలు నిర్ణయించేశారు. నా అభిప్రాయం ఎవరూ అడగనూ లేదు. నేను చెప్పనూ లేదు.

అయితే డబ్బు స్వయంగా తెస్తానన్న ఆయన డబ్బు తేనూలేదు. పంపనూలేదు. అయినా చిల్లర అప్పులు చేసి పెళ్ళి పనులు ప్రారంభించారు.

రేపు పెళ్ళనగా కూడా ఆయన డబ్బు తేలేదు. అందరికీ గుండెల్లో రైళ్ళు పరిగెత్తాయి.

అప్పటికే పెళ్ళివారు కట్నం తాలూకు డబ్బు కోసం వందసార్లు తిరిగారు. తాతయ్య వాళ్ళకి నచ్చచెప్పి తనకి డబ్బు ఇస్తానన్న పెద్ద మనిషి ఫోన్ నెంబరెలాగో తెలుసుకుని ఆయనకి ఫోన్ చేయించాడు. అయితే ఆయన ట్రైన్‌లో హార్ట్ టాక్‌తో పోయాడని చెప్పారు. కట్నం ఇవ్వందే తాళి కట్టనన్నాడు పెళ్ళికొడుకు.

అంతే విషయం విని అమ్మ విరుచుకు పడిపోయింది. ఇదంతా నామూలానే అన్న బాధతో ఆత్మహత్య చేసుకోబోతున్న నన్ను అమ్మమ బతికించుకుంది" స్వర్ణముఖికి దుఃఖంతో మాట తడబడింది.

అలాంటి వాడు కూడా కట్నం లేకపోతే తాళి కట్టనన్నాడా?" విస్తుపోయింది పార్వతమ్మ.

"అతను కాదన్నందుకు నాకు బాధగా లేదమ్మా! అసలా పెళ్ళి తప్పిపోయినందుకు ఆనందించాను కూడా! కానీ దీనిమూలంగా అమ్మా, తాతయ్యా కృంగిపోయారు."

"అయితే ఇందులో మీ ప్రమేయం ఏం వుంది నాన్నా? ఆవిడ పెళ్ళి మరెందుకో ఆగిపోయింది" అన్నాడు రఘు.

ఆయన స్వర్ణ పెళ్ళి కోసం స్వయంగా తీసికెళ్ళే డబ్బుతోనే మీ అమ్మ ఆపరేషన్ జరిగిందిరా!" భారంగా ఆనాటి సంఘటన చెప్పాడు ఆనందయ్యగారు.

ఆయన కిప్పుడెంతో తేలిగ్గా వుంది. స్వర్ణముఖి అమ్మమ్మ ద్వారానూ, తాతయ్య ద్వారానూ విషయం తెలుసుకున్న ఆయనకి ఆపిల్ల పెళ్ళి ఆగిపోవడానికి కారకుడు తనే అనిపించింది.

"నాకు ఈ ఇంటి కోడలినవ్వాలన్నంత ఆశలేదు. బాబుగారు బలవంతంగా తీసుకొచ్చారు!" రెండు చేతులూ జోడిస్తూ అంది స్వర్ణముఖి.

రఘు చల్లగా నవ్వాడు.

ఆ నవ్వు చూశాక కొండంత ధైర్యం వచ్చింది ఆనందయ్య గారికి.

"పార్వతీ! కోడలు ఇంటికొస్తే. ఇంత వరకు కాస్త కాఫీ అయినా ఇవ్వక పోవడం బావుందా?" అన్నాడు నవ్వుతూ.

"కాఫీ ఏంకర్మ టిఫిన్ కూడా తెస్తానుండండి" మురిపెంగా ఆపిల్లకేసి చూస్తూ అంది పార్వతమ్మ.

ఆ పిల్ల సిగ్గుగా ఓసారి తలెత్తి రఘు కేసి చూసింది. అతని కళ్ళల్లో ఏం కనిపించిందో, ఆమె చెంపలు కందిపోయాయి, కళ్ళు వాలిపోయాయి.

"మీరెంత మంచి మనుష్యులు!" హఠాత్తుగా ఆనందరావు దంపతుల కాళ్ళ మీద వాలిందామె.

"ఛ! ఛ! లేమ్మా! ఇందులో మేం చేసిందేంలేదు. చేసిన పాపానికి నిష్కృతి చేసుకున్నానంతే!" ఆమెని లేవదీస్తూ గొణుక్కున్నాడు ఆనందయ్యగారు.

"సరిగ్గా నేను కోరుకున్న అమ్మాయి లక్షణాలన్నీ వున్నాయీమెలో!" తృప్తిగా అనుకున్నాడు రఘు! □

# బైద్యనాథ్ ......

## ఇద్దరికీ ఆరోగ్యము మరియు పెరుగుదల కొరకై

జీవితమంతా మీరు భాగస్వాములు కనుక
మీరు శ్రద్ధవహిస్తారు కనుక

మీరు ఒకరికి మరియొకరు ఆనందముగా ఉండుటకు శ్రద్ధ తీసుకుంటారు.

మీకు శక్తిని, బలమును కలుగచేసి రోజు రోజుకు సంవత్సరముల తరబడి విటా-ఎక్స్ మిమ్ములను కాపాడును.

స్త్రీ పురుషులకు బలవర్ధకమైన ఔషదము




**బైద్యనాథ్ విటా-ఎక్స్**

## మొటిమలా ?

తాత్కాలిక నివారణ మరియు శాశ్వత నివారణ
తాత్కాలిక నివారణకు సౌందర్యపోషకములు
సర్వదా వాడుతూ ఉంటారా లేక తెలివైన విధానముగ
శాశ్వత నివారణకు ఆలోచిస్తారా.

**బైద్యనాథ్ సురక్తా**









రక్తమును శుద్దిచేయును. చర్మమును నిర్మలముగా ఉంచును.





## స్త్రీల కొరకు....స్త్రీల టానిక్

స్త్రీలలో స్వయముగా వారికి కొన్ని అవసరములు కావలసియుండును. వాటిని మనసులో ఉంచుకొని, రక్తమును పెంచి, దడ, నీరసము, కీళ్ళ నొప్పులు తగ్గించి స్త్రీలకు, క్రొత్త శక్తి నూతన వికాసము, సంతోషము మరియు సౌందర్యమును కలుగచేయును.

**బైద్యనాథ్ సుందరీ కల్ప ఫోర్ట్**

BAB/3P/39/Tel.

సీరియల్

# రాబందులు - రమ్యభావాలు

హరికిషన్

(గత సంచిక తరువాయి)

## సత్య సైకాలజీ

సత్యభామ తండ్రి గోపాలరావుకు వ్యాపారం ఉండి అదృష్టవశాత్తూ కలిసొచ్చి లాభాలు వస్తున్నా ఆయన జీవితంలో రెండు గట్టి దెబ్బలు తిన్నాడు. మొదటిది వారం రోజులు జ్వరం వచ్చి పదేళ్ళ కొడుకు చనిపోవటం. ఆ షాక్ నుంచీ తేరుకోకుండానే కొడుకు పోయిన మూడు మాసాల్లోపలే భార్య పోవటం రెండో గట్టి దెబ్బ. ఇక ఆయనకు మిగిలింది కూతురు సత్యభామ. డబ్బు కలవారి ఏకైక పుత్రిక. హోదాలో పదహారో ఏడు వెళ్ళేంత వరకూ గారాబంగా పెరిగినా కాలేజీలో చేరాక కాస్త మనస్సు విదిల్చి మసులుకోసాగింది సత్యభామ.

ఆశ మనస్సును పీడిస్తుంటే ఆ వ్యక్తి ఆర్థిక పరంగా జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు దెబ్బ తినక తప్పదు. ఆశ మనస్సుతో స్నేహభావంతో ఉండి, సన్మార్గంలో నడిపిస్తూ ఉంటే మనస్సు పుణ్యకార్యాల వైపు, దానధర్మాల వైపు మొగ్గు చూపుతూ ఉంటుంది. ఈ తండ్రి, కూతురూ ఈ కోవకు చెందిన వారు కావటంతో ఆయన సంపాదించే డబ్బు కూడా గౌరవం హెచ్చింది.

ఎన్ని చేసినా, ఎంత చేసినా, మనస్సు ఎంత సంతోషంగా ఉన్నా, వయస్సు మనిషి శరీరం మీద ఏదో రకంగా దాడి చేస్తూనే ఉంటుంది. వయోభారాన్ని వెళ్ళగొట్టే సామర్థ్యం డబ్బు కూడా లేదు. మందుల వల్ల ఉన్నా అది తాత్కాలికం.

ఆయన మనస్సులోని ఉద్దేశ్యం ఎప్పుడు చెప్పినా సత్యభామ నవ్వి ఊరుకుంటుంది. అంతటితో ఆ విషయాన్ని మరో ఆర్నెల్ల వరకూ ఆయనే వాయిదా వేస్తాడు.

ఈ సారి ఆయన ఈ సమస్యని వాయిదా వేసేట్టు లేదు. కారణం ఆయనకు స్వల్పంగా గుండె నెప్పి వచ్చింది. పది రోజులు నర్సింగ్ హోంలో ఉండి కాస్త తగ్గిన తరవాత ఇంటి దగ్గరే విశ్రాంతి తీసుకుంటున్నాడాయన.

మాత్రలూ, క్యాప్సూల్స్ చేతిలో వేసుకుని మంచినీళ్ళ గ్లాసుతో వచ్చింది సత్యభామ.

"డాడీ, ఈ మందులు వేసుకోండి" మంచం మీద కూచున్నది. చేతికి ఇవ్వబోయింది. ఆయన తీసుకోలేదు.

"నేను ఇక నుంచీ మాత్రలూ, గొట్టాలూ వేసుకోను, ట్రీట్‌మెంట్ క్యాన్సిల్" అన్నాడాయన. అర్థంకాక చూసింది సత్యభామ.

"నువ్వు పెళ్ళి చేసుకోకపోతే నేనెందుకు బతకాలమ్మా. పేషంట్‌కు ట్రీట్‌మెంట్ ఎంత అవసరమో వయసొచ్చిన ఆడపిల్లకు పెళ్ళి అంత అవసరమే. నువ్వు పెళ్ళి చేసుకోకుండా ఇంకా ఎన్నాళ్ళు ఇట్లాగే పుస్తకాలు చదువుతూ కూర్చుంటావు తల్లీ" అన్నాడాయన.

"డాడీ, నువ్వు చెప్పింది నేనూ వింటాను, ముందు ఈ మాత్రలు వేసుకో" ఆయన మాత్రలు వేసుకొని మంచినీళ్ళు తాగాడు.

"కాసేపు రిలాక్స్ అవండి" మళ్ళీ పుస్తకం చదువుకుంటూ కూర్చున్నది. పది నిమిషాలు గడిచాయి.

"డాడీ, డాక్టర్ సలహా ప్రకారం హార్ట్ పేషంట్ మందులు వేసుకోకపోతే ప్రాణాపాయం అని చిన్నపిల్లవాడు కూడా చెప్తాడు. వయసొచ్చిన ఆడపిల్లకు పెళ్ళి కాకపోతే ప్రాణాపాయం రాదు, ఎవర్నయినా అడగండి" ఆయన నిట్టూర్చి దిగులు పడ్డట్టుగా చూశాడు.

"ప్రాణాపాయం రాకపోవచ్చు కాని చెడ్డపేరు వస్తుందమ్మా, ఈ నిర్ణయానికి నువ్వెందుకు వచ్చావో నాకు అర్థం కావటం లేదు" కాస్త కోపంతో అన్నాడాయన.

"నేను పెళ్ళికి ప్రాధాన్యత ఇవ్వటం లేదు, అట్లాగని మరో విధంగా

జరిగిన కథ 19 : అభిలాష్‌ను బాగు చేసేందుకు పర్సనల్ అసిస్టెంటుగా సావిత్రిని నియమిస్తుంది శాంతాదేవి. హేమంత్ ఎవరో తెలుసుకోవడానికి శ్రీవిద్య ప్రయత్నాలు మొదలు పెడుతుంది. త్యాగరాజు పేరుతో వచ్చిన ఆగంతకుడు సావిత్రిని మోసగించి పాతికవేలు తీసుకు పోతాడు. శ్రీవిద్యకు ఓ అజ్ఞాత వ్యక్తి ఆమె శరీరాన్ని వర్ణిస్తూ ఉత్తరం రాస్తాడు. హేమలత బంధువు ఆదిత్య వల్ల తన చెక్కు సమస్య తీరుతుందా అని ఆలోచిస్తుంది శ్రీవిద్య.



మరొకరితో శారీరక సంబంధం పెట్టుకునే చెడ్డ పేరూ తెచ్చుకోను. నా మనస్సూ, శరీరమూ కూడా నన్ను పెళ్ళి చేసుకోమని హెచ్చరించటం లేదు, తల్లి లేనిదాన్ని, తల్లి వయినా తండ్రి వయినా నువ్వే కదా నా బాగోగులు చూసే సంరక్షకుడివి. నేను స్త్రీత్వం లేని జడ పదార్థాన్ని కాదు డాడీ, కాని నా మనస్సు పెళ్ళి మీద ఏ మాత్రం మొగ్గు చూపటం లేదు. సంసార సౌఖ్యం వల్ల స్వార్థం పెరుగుతుందే కాని, నిస్వార్థం వైపు మనస్సు పోదు డాడీ, నాలోని అంతరంగ మథన ఒక రూపాన్ని సంతరించుకుంటే, నా వల్ల, నా జీవితం వలనా ఎవరికి ఎంత వరకూ ఉపయోగం అనే సమస్య కొంత వరకూ తీరుతుంది. నాలో ఇప్పుడున్నది అస్పష్టపు భావాలే కావచ్చు, నా వలన కొంత సాంఘిక ప్రయోజనం ఉండాలనేదే నా కోరిక" అన్నది సత్యభామ.

ఆయనకు పూర్తిగా అర్థం కాలేదు..కొంత వరకూ అర్థం చేసుకొన్నాడు.

"సంఘ సంస్కర్తగా మారిపోతానంటావా, వరకట్నం, లంచగొండితనాన్ని రూపుమాపటం, వ్యభిచార నిర్మూలనా వీటి కోసం నీ జీవితాన్ని అంకితం చేస్తావా, ఏమిటమ్మా నువ్వు సాధించబోయే సాంఘిక ప్రయోజనం? నా మాట విని నీ ఇష్టం వచ్చిన వరుణ్ణి పెళ్ళి చేసుకో సత్యా, ఆదర్శాలు పుస్తకాల్లో చదువుకునేవే గాని జీవించటానికి సహాయకారి కావమ్మా" అన్నాడాయన వ్యథ పడుతూ.

తండ్రి మాటలకు నవ్వేసి ఊరుకున్నదే గాని సమాధానం చెప్పలేదు. ఆ రోజు గడిచి పోయింది. మర్నాడు రాత్రి ఆయనకు ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టనే లేదు. తండ్రీ, కూతురూ ఇంతగా ఎన్నడూ తర్కించుకోలేదు. ఆయనకు కూతురు ప్రవర్తన మీద ఏ అనుమానం లేదు. కాని ఈ గుండె జబ్బు వచ్చినపట్నుంచీ, నిరంతరం సత్యభామ పెళ్ళి విషయమే ఆలోచిస్తున్నారాయన.

రాత్రి పన్నెండు దాటినా నిద్ర పట్టక ఆయన నెమ్మదిగా లేచి పక్కనే ఉన్న సత్యభామ గదిలోకి వెళ్ళాడు. ఆదమరిచి నిద్ర పోతున్నది. టేబుల్ సొరుగు లాగి సత్యభామ డైరీలు తీసి, తన గదిలోకి వెళ్ళి తలుపు మూసి లైటు వేసి చదువుకోసాగాడు. తెల్లవారు ఝామున మూడయింది. సత్యభామకు మెలుకువ వచ్చి చూస్తే ఇద్దరి గదుల మధ్యా ఉన్న గుమ్మం తలుపు వేసి ఉండటంతో

# ఆడపిల్లలు – అనుభవాలు

ఏమిటా అని కళ్ళు నులుముకుంటూ వెళ్ళి తలుపు తీసింది. డైరీలు చదువుతూ తండ్రి మంచం మీద కూర్చున్నాడు. దగ్గరకు వెళ్ళి చూసింది. తన డైరీలు పాతవి మూడు, ఈ సంవత్సరంది ఒకటి. వచ్చిన కోపాన్ని చిరునవ్వుగా మార్చుకుని, మంచం దగ్గరకు కుర్చీని లాక్కుని కూర్చున్నది. ఆయన ఖిన్నుడై డైరీని మూసేసి పక్కన పెట్టాడు.

"క్లూ దొరికిందా డాడీ" అన్నది.

"క్లూనా" తల వంచుకుని అన్నాడాయన.

"అవును, నేను భగ్నప్రేమికురాలినో, దగాపడి కడుపు తీయించుకున్న పతితనో అనేగా మీ అనుమానం, నాకు వాతలు పెట్టగల, ఇంట్లో నుంచీ తరిమేయ తగినంత అప్రాచ్య, అశ్లీల, అసహ్య, జుగుప్సాకరమైన సంఘటనలు ఏవైనా చదివారా డాడీ" కాస్త కోపంగానే అన్నది.

"లేదమ్మా నీ డైరీలు చదవటం నాదే తప్పు."

"తప్పుకాదు నాన్నగారూ. ఒక బాధ్యత గల తండ్రిగా, మీ అనుమానాన్ని నివృత్తి చేసుకున్నారు, మీరు చెప్పినట్లు విని నేను పెళ్లి చేసుకుంటాను అంటే నేను పవిత్రురాలిననీ, నేను పెళ్లి చేసుకోను అంటే నేను చెడిపోయిన దానిననీ మీరు భావిస్తున్నారు కదూ! కన్న కూతురు మీద ఇంతటి ఉదాత్తమైన భావాన్ని, అభిప్రాయాన్ని ఏర్పర్చుకున్నందుకు నేను చాలా సంతోషిస్తున్నాను డాడీ, నా వైపు చూడండి, నాలో ఆ అల్పబుద్ధి ఉండాలే గాని, మీకు దొరికి పోయేటట్లుగా ప్రవర్తిస్తానా డాడీ" పౌరుషంగా, ఉక్రోష పడుతూ అన్నది.

"నన్ను క్షమించమ్మా, నీ డైరీలు చదవటం చాలా పొరపాటేనమ్మా" అని డైరీలు ఇచ్చేశాడాయన.

"డాడీ, ఐ యామ్ వెరీ సారీ, ఈ నాటి మీ చర్య నా నిర్ణయానికి ఇంకా బలాన్ని ఇచ్చింది. మీ అభిప్రాయ ప్రకారం నేను పెళ్ళి చేసుకుని నా భర్తతో కాపరం చేస్తూనే, మరో పర పురుషుడితో సంబంధం పెట్టుకుంటే మీరు హర్షిస్తారు. పెళ్ళి చేసుకోకుండా కన్యగా ఉండిపోతే నేను కట్టు తప్పిన నెరజాణననే మీ భావం, వాటే గ్రేట్ సైకాలజీ డాడీ, వాటే గ్రేట్ మెంటాలిటీ" గద్గద స్వరంతో వెక్కుతూ అని ఆ డైరీలు అక్కడే ఆయన పక్క మీదనే ఉంచి తన గదిలోకి వెళ్ళి కుమిలిపోతూ పడుకున్నది.

* * * * * * * *

మరో రెండు రోజులు గడిచాయి. తండ్రీ, కూతురూ ఈ ప్రస్తావనే చెయ్యలేదు. మూడో రోజున ఆయనే అన్నాడు.

"చూడు సత్యా, రాయిలాంటి బిడ్డ, లక్క లాంటి తల్లి అన్నారు పూర్వీకులు. సామెత పాతదే అయినా సర్వకాలాలకూ వర్తించేదే. మీ అమ్మే బ్రతికి ఉంటే నాకు ఈ సమస్య ఉండేదే కాదు. ఒక్క చిన్న రిక్వెస్ట్."




ఆయన కళ్ళలోని కన్నీటిని చూసింది సత్యభామ. "ఏమిటో చెప్పండి, కన్యాత్వపు పరీక్ష చేయిస్తారా."

ఒక వైపు తండ్రి మనోవ్యథనూ అర్థం చేసుకున్నది, మరో వైపు తన నిర్ణయానికి కట్టుబడి ఉన్నది.

"నీ మీద అంతటి ఘోరమైన అనుమానం లేదమ్మా, నువ్వీ నిర్ణయానికి రావటానికి కారణం ఏమిటో సైక్రియాటిస్ట్ని సంప్రదిస్తే."

ఒక కొత్త అనుభూతి సత్యభామ మనస్సులో ప్రవేశించింది. ఒక్క క్షణం ఆలోచించి తన అంగీకారాన్ని చెప్పింది. ఆ రోజే డాక్టర్ నాగేంద్రబాల సైక్రియాటిస్ట్ దగ్గరకు వెళ్ళారు ఇద్దరూ. ఫీజు కట్టి పేరు రాయించుకున్నా అరగంటకు పిలుపు వచ్చింది. కన్సల్టింగ్ రూంలోకి వెళ్ళారు. తన బయోడేటా చెప్పింది సత్యభామ. చక్కగా మాట్లాడింది. సమస్యను చెప్పమన్నది లేడీ డాక్టర్ అండ్ సైక్రియాటిస్ట్ నాగేంద్రబాల.

"నన్ను మీరు చూస్తున్నారు, నా ఆరోగ్యం మీద ప్రాథమిక అవగాహనకు వచ్చే ఉంటారు, నాకు తల్లి లేదు, నాకు పెళ్ళి చెయ్యాలని తొందర పడుతున్నారు మా డాడీ. ఆయన హార్ట్ పేషంట్. నాకు పెళ్ళి చేసుకోవాలనే ఉద్దేశ్యం, కోరికా లేవు, ఇదే సమస్య" అన్నది సత్యభామ.

ఆవిడ కేస్ షీట్ తీసుకున్నది పాయింట్స్ రాసుకోటానికి.

"మీ నాన్నగారు హార్ట్ పేషంట్, మీ అమ్మగారు చనిపోయారు, ఆయనకు మీ రొక్కరే కూతురు, మరెవ్వరూ లేరు, మీరు పెళ్ళి చేసుకుని కాపరానికి వెళ్ళిపోతే, మీ ఫాదర్ని చూసే వాళ్ళు ఎవ్వరూ ఉండరని, కన్నతండ్రి మీద సానుభూతితో మీరు ఈ నిర్ణయానికి వచ్చారు."

"లేదు, మా దంపతులకు వ్యాపార బాధ్యతలూ, ఆస్తిపాస్తులూ అప్పగించి ఆయన మా దగ్గరే ఉండాలని డాడీ కోరిక, కాబట్టి డాడీని విడిచి పెట్టి వెళ్ళే సమస్య లేదు."

"కాలేజిలో చదువుతున్నప్పుడు ఎవర్నయినా ప్రేమించారా, కులం పట్టింపు లాంటి అడ్డుగోడలు మీ ప్రేమను భగ్నం చేసినయ్యా."

"నేను అందర్నీ లైక్ చేస్తాను, అందరితో హుందాగా మాట్లాడతాను, ఆర్థిక ఇబ్బందులు లేవు. ఆ వ్యక్తి సహృదయతను బట్టి కాస్త అభిమానాన్ని పెంచుకోవచ్చు. లైకింగ్ ఈజ్ నాట్ లవ్" అన్నది చిరునవ్వుతో.

"దానధర్మాలూ, బీదవాళ్ళకు సహాయం చెయ్యటం లాంటివీ, ఇష్టపడతారా"

"చాలా, పూర్వజన్మ సుకృతం వల్ల దళం వేసుకొని పుట్టాను, పుణ్యపాపాల యందు నమ్మకం ఉన్నది. ఆర్థికంగా కొందరికయినా సహాయం చెయ్యటం నా విధిగా భావిస్తాను"

"కాలేజీ జీవితంలో మీరెప్పుడయినా టీచింగ్కు గురయినారా, మీరెవరినయినా టీచ్ చేశారా."

"అటువంటి వాతావరణానికి చాలా దూరంగానే ఉండేదాన్ని."

"ఉక్రోషం,ఉడుకుమోతు తనం, ఇన్ సల్ట్గా ఫీలవటం, ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు, ఇటువంటి మనస్తత్వం మీకున్నదా."

"లేని మాట అంటే ఆడపిల్లకు ఉక్రోషం రావడం సహజం. అది ఆడపిల్లకు సహజం, నేనెప్పుడూ ఇన్ఫీరియర్గా ఫీలవలేదు, నేను బీద పిల్లను కాను."

"వెల్, అయితే గొప్పింటి పిల్లనే ఎగోయిజంతో నోరు జారితే, ఎదుటి వారు ఎదురు తిరిగి సమాధానం చెపితే మీ అహం దెబ్బతినేదా."

"మాటకు మాట చెప్పటం ఎగోయిజం కాదు. గొడ్డలితో చెట్టును కొట్టి నరికి వేస్తే మాను మళ్ళీ చిగురిస్తుంది. మాటలతో మనస్సును బాదితే విరిగిన మనస్సు చిగురించదు."

"మనస్తత్వం అంత సున్నితం అయినప్పుడు ఆడపిల్ల తోడూ, నీడా లేకుండా జీవించడం చాలా కష్టం కదా."

"కాదనే నా అభిప్రాయం."

"సరే, పెళ్ళి చేసుకోవలసి వస్తే :– కాబోయే భర్త–



# రచయిత జవాబులు

పి. శ్రీను రామేశ్వరం

ప్ర : చాలామంది సమాజంలో వరకట్నాన్ని ఏ విధంగా పరిష్కరించాలో ఆలోచిస్తారే గాని సమాజం అంటే ఎవరో కాదు మనమే అని గ్రహించరు ఎందుకని?

జ : ఎడంచెయ్యి అయినా, పుర్రచెయ్యి అయినా ఒకటే. వరకట్నం అనేది అరిషడ్వర్గాల్లో ఒకటి. పో, పో, పో అన్న కొద్దీ మొండికేసి కూర్చుంటుంది.

శివరామ్, బందరు

ప్ర : 21వ శతాబ్దంలోకి వచ్చినా ఇంకా ప్రతి విషయానికీ కుల ప్రసక్తి ఎత్తేవారిని ఏం చెయ్యాలి?

జ : భగవద్గీతలో చెప్పినవి నాలుగే కులాలు. కుల గీతలో (కమ్యూనల్ జీ. ఓ.) ఎన్నో కులాలు ఉన్నయ్యి. నేటి రాజకీయాలలో కులం ఓతూరుపు ముక్క.

మాడభూషి నరసింహాచారి, నర్సాపురం

ప్ర : ఏ రచయిత (త్రి) బాగా పాపులర్ కావాలంటే వాళ్ళు వ్రాసే నవలలో వస్తువు, శైలి, శిల్పం. ఈ మూడింటిలో దేనికి ప్రాధాన్యత ఇవ్వాలో ఒక సీనియర్ రచయితగా మీ అభిప్రాయం తెలుపండి?

జ : మూడూ ముఖ్యమైనవే.

యల్లపు భాస్కరరావు, అనకాపల్లి

ప్ర : రచనల ద్వారా సమాజంలో మార్పును తీసుకురావచ్చంటారా?

జ : ఆనాటి రచయితలు చాలావరకు మార్పును తీసుకువచ్చారు. ఈనాటి కొందరు రచయితలు తీసుకురావటానికి ప్రయత్నిస్తున్నారు.

యం. డి. షకీనాబేగం, పుల్లూరు

ప్ర : నేటి సాహితీ సాగరం నుండీ రాళ్ళు, రప్పలేగాని, రత్నాలు వెలువడ్డం లేదు, కారణం? రత్నాలు అయిపోయాయా? వీటిని శోధించే ప్రయత్నం జరగటం లేదా?

జ : రత్నాలూ ఉన్నయ్యి. కాని కొంతమంది రాళ్ళతో సరిపెట్టుకుని, రత్నాల్ని వదిలేస్తున్నారు.

పోలాశి రమేష్‌బాబు, గురజాడ

ప్ర : మనిషిపైకి రావాలంటే, లేక నాశనం కావాలంటే స్త్రీయే కారణం అంటారు, నిజమా?

జ : కానేకాదు, తెలివి తేటలు, అదృష్టం.

అభినయ, రామవరం

ప్ర : ఒక రచయిత (త్రి) సమాజపరంగా ఎంతో బాధ్యత గలవారని నా అభిప్రాయం. మరి అవాస్తవిక, అభూత కల్పనలు సృష్టించి పాఠకుల్ని భ్రమల్లో ముంచటం సమంజసమంటారా?

జ : బాధ్యతగా తీసుకుంటే రచయిత పాఠకులూ ఇద్దరూ బాధ్యులే. కాని వ్యాపార సరళి అనే ఆర్థిక వాతావరణందే ప్రస్తుతం పైచెయ్యిగా ఉన్నది.

ఎమ్. రాజ్యలక్ష్మి, వీరవాసరం

ప్ర : ఈ నవల స్త్రీ స్వాతంత్ర్యానికి అయువు పట్టులా ఉన్నది. చదువుతున్నంతసేపూ స్త్రీ స్వేచ్ఛ ఎంత అభివృద్ధి చెందినదో అనిపిస్తోంది. మీరేమంటారు?

జ : ఈ నవలలోని స్త్రీ పాత్రలన్నీ చాలా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అనుభవిస్తున్నవే అంటాను.

కె. నందిని, ఏలూరు

ప్ర : 21వ శతాబ్దపు అంచులకు చేరుకున్నా స్త్రీని మగవాడు అమానుషంగానే అడుగడుగునా అణగదొక్కుతూనే ఉన్నాడు. స్త్రీల జీవితాలకు విముక్తి లేదా ఎంత మార్పు వచ్చినా?

జ : ఈ 21వ శతాబ్దం అనేది ఓ పొలిటికల్ స్లోగన్. ఇంకా పన్నెండేళ్ళు గడవాలి. అమానుషం ఎప్పుడూ ఆర్థిక పరిస్థితిని బట్టి మారుతూ ఉంటుంది.

ఎమ్. సూర్యప్రకాశరావు, రామరాజులంక

ప్ర : చక్కని చిక్కని శైలిలో మనస్సుకు హత్తుకుపోయేవిధంగా పాత్ర చిత్రణ చేస్తారుకదా (మీ పాత సీరియల్స్ చదివాను) ఈమధ్య ఎక్కువగా పత్రికల్లో మీ సీరియల్స్ రావటం లేదు. కారణం?

జ :, మనస్సుకు హత్తుకుపోయే సీరియల్స్, పాత్ర చిత్రణ కొంతమంది పాఠకులు ఇష్టపడరు.

ప్ర : 'ఆడపిల్లలూ - అనుభవాలు' సీరియల్ ద్వారా నేటి సమాజంలో ఎటువంటి మార్పు మీరు ఆకాంక్షిస్తున్నారు?

జ : యువతీ యువకుల్లో ధైర్యం, సామాజిక అవగాహన. సదాచార మనస్తత్వం, నిశితమైన ఆలోచనాశక్తి, మనోనిబ్బరం.

జి. రమేష్, ప్రత్తిపాడు

ప్ర : అనుమానం ముందు పుట్టి ఆడది వెనక పుట్టిందంటారు. ఎందువల్ల?

జ : అది పాతకాలపు సామెత. ఇప్పుడు ఈ సామెత కొంతమంది మగవారికి వర్తిస్తుంది.

---

ఈ వారం వచ్చిన వాటిలో ఉత్తమ ప్రశ్నగా ఏది ఎంపిక కాలేదు. —రచయిత

---

(1) ఆడంబరం, అట్టహాసం, స్టైలిష్‌గా ఉండే భర్త కావాలా?

(2) సామాన్యమైన అందచందాలూ, సామాన్యమైన దుస్తులూ వేసుకుంటే చాలా?

(3) మీ చెప్పుచేతలలో ఉండి, మీ మాటనే వినాలా?

(4) సామాన్యుడైన మేధావి కావాలా, చదువు తక్కువయినా ఐశ్వర్యవంతుడు కావాలా?

(5) మీకూ మీ మాటకూ గౌరవాన్ని ఇస్తూ బైట ప్రపంచంలో అతను ఎట్లా తిరిగినా ఇష్టమేనా?

(6) డాక్టరూ, ఇంజనీరు, బ్యాంకు ఆఫీసరు, ఐ. ఎ. ఎస్. అధికారి, ఆర్కిటెక్ట్, వ్యాపారస్తుడూ, సినిమా హాలు ప్రొప్రయిటరూ, ఫైవ్ స్టార్ హోటల్ యజమాని, గొప్ప పారిశ్రామికవేత్త, ఎవరు కావాలి?

(7) సరదాగా పార్టీలకూ, క్లబ్బులకూ తీసుకు వెళ్ళే భర్త కావాలా, ఇంటి బాధ్యతను చూడమని ఆదేశించే భర్త కావాలా?

(8) అత్తమామలూ, ఆడబిడ్డలూ, మరుదులూ ఉన్నా సర్దుకు పోతారా లేక ఏ బాధ్యతా లేని ఏకైక ప్రబుధుడున్న సంబంధం కావాలా?

(9) రచయితా, కాలేజి లెక్చరరూ, ఇల్లే ఒక చిన్న ట్యుటోరియల్ కాలేజీని చేసే విద్యావేత్త కావాలా?

(10) తను పేకాటకూ వెళుతూ, నాకు అయిదొందలు ఇవ్వు సత్యా అని ఆ డబ్బును కూడా మిమ్మల్నే అడిగి, అంతటి ఆర్థిక బాధ్యతనూ మీకే వదిలి పెట్టే భర్తయినా సర్దుకు పోగలరా?

ఈ విధంగా ఉన్న ఎవర్ని మీరు భర్తగా కోరుకుంటారు.

పెదవి బిగబట్టి మనస్సులో నవ్వుకున్నది.

"డాక్టర్, సెక్సును గురించి మీరు మాట్లాడలేదు, చాలా సంతోషం". నవ్వింది లేడీ డాక్టర్.

"తరువాత పాయింట్స్ సెక్స్‌కు సంబంధించినవే. మనస్సు, తరవాత శరీర సంబంధమైన విషయాలు, దాంట్లో భాగమే సెక్స్."

"వెల్‌సెడ్ డాక్టర్, నేను పెళ్ళి కనక చేసుకుంటే –

(1) విద్యావంతుడై ఉండాలి, కనీసం పోస్ట్ గ్రాడ్యుయేట్

(2) తెలివైన వాడు, స్వతంత్రంగా ఆలోచించగల వ్యక్తి అయి ఉండాలి.

(3) చెప్పేడు మాటలు విన్నా పూర్వాపరాలు తెల్సుకోగల విచక్షణా జ్ఞానం కలవాడై ఉండాలి.

(4) ఒకరిపైన ఆధారపడక తననూ, తనకుటుంబాన్నీ అన్ని విధాలా సమర్ధించగల వ్యక్తి అయి ఉండాలి.

(5) ఎటువంటి అక్రమసంబంధాలకూ పాల్పడని వాడై ఉండాలి.

(6) కోపతాపాలు తనకేకాదు తనభార్యకూ ఉంటయ్యి అనే ఆలోచన కలవాడై ఉండాలి.

(7) వ్యాపారమో, ఉద్యోగమో చేసుకున్నా, ఆ సంబంధమైన సమస్యలతో బాధపడుతూన్నప్పుడు భార్య సలహాను కూడా తీసుకునేవాడై ఉండాలిగాని, ఆ కోపాన్ని భార్యా పిల్లల మీద చూపిస్తే ఆ వ్యక్తి మనిషికాదు, ఇంగిత జ్ఞానంలేని రాక్షస హృదయుడు, అటువంటి వాడిని నేను గౌరవించను.

(8) దుబారాగా కర్చు చేసినా సహృదయుడైతే సహిస్తాను గాని స్వార్ధపరుడైతే సహించను.

(9) ఆలోచనా, అభిప్రాయాలూ సంసార పక్షంగా ఉండాలి గాని నేను మగవాడిని అనే ధీమా ఉంటే సహించలేను.

(10) ఇన్ని సద్గుణాలు ఉన్న వ్యక్తికి పాదపూజ చెయ్యమన్నా చేస్తాను గాని, ఆధిపత్యం తనదే ననే పురుష అహంకారం గల వ్యక్తిని నేను హర్షించను.

డాక్టర్ నాగేంద్రబాల ఆశ్చర్యపోయింది. "నీ అభిప్రాయాలకు హేట్సాఫ్, కాని అటువంటి భర్తను బ్రహ్మ కూడా సృష్టించ లేడు" అన్నది.

"డాక్టర్, అందుకనేగా నేను పెండ్లి చేసుకోను అని చెప్పింది. ఆల్‌రైట్ సెక్స్ పరంగా నన్ను ప్రశ్నించండి, మీఇష్టం,

లేడీ డాక్టర్ గోపాలరావ్ వైపు చూసింది. అయన ఆగదిలో నుంచీ ఇవతలకు వచ్చేశాడు.

"డియర్ పేషంట్ ఐయామ్ రియల్లీ ప్రౌడాఫ్ యూ, పగ, కోపం, హానికలిగించాలనే పట్టుదల, చిన్న కారణం వలన కూడా తాత్కాలికమైన ఉద్రేకం కోపం వస్తయ్యా? ఈరకమైన మనస్తత్వాన్ని మెలివోలెన్స్ అంటారు, ఈ మనస్తత్వం ఉన్నదనుకుంటాను",

నవ్వు ముఖంతో చూసింది సత్యభామ.

"నో డాక్టర్, నా మనస్తత్వం అలాంటిది కాదు".

"ఒక వస్తువునో, ఒక మనిషినో చూసినపుడు అనవసరంగా భయపడటం, అంతరంగ మధన, కల్లోలం కలుగుతుందా".

కాస్త ఆలోచించింది సత్యభామ.

"నాకు ఇష్టం లేని పరిస్థితి ఎదురైతే కాస్త కల్లోల పడతాను. భయం కాదుగాని, అయిష్టతతో కూడిన పరిస్థితికి బాధపడతాను".

"ఆ మనస్తత్వం పేరే ఫోబియా, ఈ మధ్యకాలంలో, ఇటీవల వయసొచ్చిన పెళ్ళికాని ఆడ పిల్లల్లో ఈ "ఫోబియా" అనే మానసిక రుగ్మత ఉంటున్నది. అది పెద్ద జబ్బు కానేకాదు. వొడుదుడుకులకు తట్టుకో లేకపోవటం, సరే, మెనోసెస్‌కి ముందు రోజుల్లో చిరాకు, నీరసం, విసుగు, శరీరం బరువుగా ఉండటం, కోపం ఈ మార్పులు కనిపిస్తయ్యా, అంటే ఈ పరిస్థితి పేరు "ప్రీ మెన్స్ట్రువల్ సింద్రోమ్" అంటే బహిష్టు సరిగా ....." అన్నదావిడ.

"డాక్టర్ అటువంటి బాధ నాకెప్పుడూ లేదు. నో లేట్, నాట్ బిఫోర్....." నవ్వుతూ అన్నది.

"సినిమాలో ప్రేమ ఘట్టాలు చూసినా, మధురాతి మధురమైన కలలు వచ్చినా, మానసికంగా, శారీరకంగా, ఆ భావం కలిగి నప్పుడు అవయవాల యాక్షన్, రీయాక్షన్ ఎట్లా ఉంటుంది."

"ఏవిధమైన ఉద్రేకం నాలో కలగదు, చూసి తాత్కాలిక ఆనందాన్ని పొందటమే తప్ప మనస్సుకు పట్టించుకోను. సెక్స్ అనే భావం నా మనస్సులోకి చొరబడదు, మంచిని చూస్తాను చెడును విమర్శిస్తాను, అంతే,

"వెరీ నైస్ "ఫిజియోలాజికల్ లుకోరియా" ఉన్నదా".

"సారీ డాక్టర్ కట్టుకున్న బట్టలే తప్ప తెల్ల బట్ట ఎప్పుడూ లేదు. నా జననేంద్రియాల్లో ఏ జబ్బూ లేదనే నా నమ్మకం. నేను సంపూర్ణమైన స్త్రీత్వం ఉన్న ఆడపిల్లని. మానసిక వ్యభిచారం, మనస్సుతో సంసారం ఎప్పుడూ చెయ్యలేదు. ఆశ, కోరిక, అభిలాష, ఇష్టతా ఉన్నయ్యి గాని వాంఛ, తృష్ణ, కామాతురత, సంసారం చేస్తున్నాననే ఊహా మాత్రపు ఫీలింగూ నాలో లేవు. నేను ప్రేమను గురించి మాట్లాడితే అది పెదవుల బాధ్యతే గాని, వాంఛాపరమైన సంభాషణ కాదు. ఐయామ్ పర్‌ఫెక్ట్ వర్జిన్ గరల్" అన్నది సత్యభామ స్వచ్ఛమైన భావాలను ముఖకవళికల్లో చూపిస్తూ.

సత్యభామకు నమస్కరించింది లేడీ డాక్టర్. గోపాలరావును కూడా పిల్చింది. ఆయనా వచ్చి కూర్చున్నాడు.

"గోపాల రావుగారూ, ఇంతటి ఉదాత్త భావాలూ, తెలివి తేటలూ, విచక్షణ, విమర్శనా శక్తి గల కూతురుకు తండ్రికావడం మీ అదృష్టం. పెళ్ళి చేసుకోమని బాధ పెట్టకండి, సత్యభామ మనస్తత్వం సామాన్యంగా ఈ వయస్సులో ఉండే ఆడపిల్లల మనస్తత్వం లాంటిది కాదు. విశ్లేషణ, తెల్సుకోవాలనే కోరిక, అంతరంగ స్పందన ఉన్న ఆడపిల్ల. పెళ్ళి, సంసారం, పిల్లలు కలగాలనే కోరిక ఇదంతా సర్వ సామాన్యంగా ఒకేరకమైన ప్రేరణ అయినా, సత్య హృదయ స్పందన ఆపరిధిలో నే ఉండే తత్వం కలది కాదు. దానికి కారణం తల్లి మరణం, తండ్రి గుండెజబ్బు, ఆడపిల్లగా ఇంట్లో ఉంటున్న వంటరి తనం, తన కడుపులోని మాట చెప్పుకునేందుకు తగిన ఆత్మీయులు లేక పోవటం ఒక కారణం కావచ్చు. నేను సత్యను మరోసారి ఇంటర్వ్యూ చేస్తాను" అన్నదావిడ, సత్యభామను చిరునవ్వుతో అభినందించింది.

(ఇంకా ఉంది)






# బుచ్చమ్మ భూలోక యాత్ర!

ఆదూరి సావిత్రి



"ఎవరండీ లోపల? కాస్త తలుపు తెరుస్తారూ?" కిటికీలోనుంచి లోపలికి తొంగిచూస్తూ అన్నదో కంఠం.

మేలిముసుగు చాటున మొనాలిసాలావున్న ఆ కంఠం తాలూకు అపురూప లావణ్యాన్కి ముగ్ధురాలై చూసి తలుపుతెరిచింది అనసూయ.

తెల్లని సైను పంచె కట్టుకుని, తలనిండా ముసుగు లాక్కొని వున్న ఆ యువతి అనసూయను చూస్తూ "లోపలికి రావచ్చా?" అన్నది.

"రండి రండి" అంటూ అడ్డు తప్పుకుని ఆహ్వానించింది అనసూయ. "కూర్చోండి" అంటూ కుర్చీ చూపించింది.

"కింద చతికిలపడతాలేమ్మా. నాకు కుర్చీలెందుకు. వెధవ ముండాదాన్ని."

"ఇంతకీ మీ రెవరు? కిందమాత్రం కూచోకండి. కుర్చీలో నే కూర్చోండి."

"నాపేరు బుచ్చమ్మ."

"అంటే..... గిరీశంగారు ప్రేమించింది మిమ్మల్నేనా?"

"ఏం ప్రేమోలేమ్మా! ఊరుకో! ఎవరైనా వింటే బాగోదు. ఆయనంతే. అలాగే మాటాడతారు" సిగ్గు దొంతరలమధ్య మనోహరంగా మెరుస్తున్న మొహాన్ని కిందికి దించుకుంటూ అన్నది బుచ్చమ్మ.

"మీరు చాలా అందంగా వున్నారు. కానీ.... ఆ సైను పంచేమిటి? ఏం బాగోలేదు. నా దో వాయిల్ చీరిస్తాను. కట్టుకోండి. మీరు మా యింటికి రావటం నాకు చాలా సంతోషాన్ని కలిగిస్తోంది" బీరువాలోనుంచి శుభ్రంగా వుతికి గంజిపెట్టిన యిస్త్రీ లేపాక్షి ప్రింటు చీరను తీసి బుచ్చమ్మకందిస్తూ అన్నది అనసూయ.

"అమ్మయ్యో! రంగు వాయిలు చీరలే! ఒద్దొద్దు."

"ఎందుకంత భయం? ఇప్పుడు రోజులు మారాయి. ఇంత చిన్నతనంలో మొగుడుపోతే...... వీలయితే పునర్వివాహాలుకూడా చేసుకుంటున్నారు. పూర్వంలాగా పదేళ్ళకే పెళ్ళి చెయ్యటం, పెళ్ళయిన పదిరోజులకే ఆ మొగుడు చచ్చూరుకుంటే, ఎప్పుడెప్పుడా అని చూస్తున్నట్టు ఆ పిల్లమీద రాక్షసుల్లాపడి, బుర్ర గొరిగి సైనుపంచె చుట్ట బెట్టటం లాంటి చవట అచారా లిప్పుడులేవు. పూర్తిగా అభివృద్ధి చెందకపోయినా...... అప్పటంత ఛాందస భావాలిప్పుడులేవు."

"ఆయనా అదే చెప్పారు."

"ఆయ నెవరు?"

"అదే..... గి....రీ.....శం గారు!"

"ఓహ్ ఆయనా? సరే, ముందు చీర మార్చుకోండి మీరు. లేకపోతే నేను మీతో మాట్లాడను."

"అయ్యో, అలా అనకమ్మా! ఇటుతే."

తనే కుచ్చెళ్ళు పెట్టి పొందికగా చీరకట్టింది అనసూయ.

"ఇప్పుడు చూసుకోండి అద్దంలో ఎంత బావున్నారో?" అన్నది నవ్వుతూ.

బుచ్చమ్మ కూడా తన ప్రతిబింబాన్ని చూసుకుని థ్రిల్లింగ్‌గా ఫీలవుతూ నవ్వింది.

"రండి భోజనం చేద్దురుగాని" అన్నది అనసూయ.

"భోజనమా! వద్దులే. అరటిపళ్ళున్నాయి. అవి తింటాను."

"మ్మరేం పర్లేదులెండి. మేముకూడా మీ యింటి పార్టీవాళ్ళమే. మా నాన్నగారిపేరు తిప్పావధాన్లు."

"ఏవిటీ!"

"మరే! ఎలాంటి శంకలూ పెట్టుకోకండి."

"మీ అమ్మా, నాన్నగారూ ఏరి?"

"అన్నం తిన్నాక చెపుతాలెండి."

"సరే! ఏం వొండేవు?"

"బంగాళాదుంప వేపుడు, సాంబా రు."

"కూరలో ఉల్లిపాయ వేశావా? సాంబారేమిటి? మడిగా చేశావా?"

"ఉల్లిపాయవేశాను. సాంబారంటే.... కాస్త అటూ యిటూగా మన ఉల్లిపాయల పప్పుచారు లాంటిదే. మడి అంటే? స్నానంచేసే వండాను."

"నేను ఉల్లిపాయ తిననమ్మా. మైలగా వండిన అన్నం కూడా తినకూడదు."

"అయ్యో! ఇప్పుడెలా? పన్నెండయింది."

"మరేం పర్లేదులేమ్మా! ఎలాగా పొద్దుతిరిగాకే నేను భోజనంచేసేది. తలమీద రెండు చెంబుల నీళ్ళు గుమ్మరించుకొచ్చి కాస్త అన్నం పుడకేసుకుంటాలే. ఆ చేత్తోనే కాస్త కందిపచ్చడి రుబ్బి, ఇంగువ, పోపేసి చారు పడేస్తాను. గంటలో అయిపోతుంది."

"అలాగే కానివ్వండి."

* * *

భోజనాలయ్యాక వచ్చి తన పక్కనే పడుకున్న అనసూయను చూస్తూ "ఇప్పుడు చెప్పు. మీ వాళ్ళెక్కడికెళ్ళారు?" అన్నది బుచ్చమ్మ.

"నాకు పెళ్ళి సంబంధం చూడటానికి." నిర్లిప్తంగా అన్నది అనసూయ.

"ఏమిషీ! నీ కింకాపెళ్ళికాలేదూ?"

"లేదు!"

"అదేమిటీ! నీ కెన్నేళ్ళు?" అనసూయలాగా 'షీ'బదులు 'టీ'పెట్టి మాట్లాడుతూ అన్నది బుచ్చమ్మ.

"దాదాపు ముప్పయ్యేళ్ళు. ఇలా యింకో

అయిదారేళ్ళు గడిస్తే..... యిహ నేను కూడా మీలాగే ఏ కాటికి కాళ్ళు చాపుకున్నవాడినో చేసుకోవాలి."

"అలా ఎందుకు జరుగుతుంది? ఇప్పుడు కన్యాశుల్కాలు లేవటగా? మరి అలాంటప్పుడు ఆడపిల్ల తన వయసుకు సరిపోయేవాడిని చేసుకోటానికి ఏమిటి అభ్యంతరం?"

"ఆ రోజుల్లో 'కన్యాశుల్కం' అనే రాక్షసి మీ లాంటి ఆడపిల్లల పీకె నొక్కేస్తే..... ఈనాడు 'వరకట్నం' అనే పిశాచం మా గొంతులు నొక్కేస్తోంది....



అప్పుడు ఆడపిల్లల తల్లిదండ్రులు తమ కః
అమ్ముకుని పేదరికంనుంచి బయటపడే ప్ర
త్నంలో అభం శుభం తెలియని పసిపిల్లల్ని
ముసలి భాగ్యవంతుడికో అమ్ముకుని వ
జీవితాలని నాశనంచేసేవారు. ఇప్పుడు ఆ పాః
మగపిల్లల తల్లిదండ్రులు తమ కొడుకుః
మార్కెట్‌లో పెట్టి వేలం వేస్తున్నారు. ఎంః
ఎక్కువ ధరకు అమ్ముకుంటే అంత గొప్పగా ఫీలవుతున్నారు. విపరీతమైన ధర పెట్టి కొనుకున్న అమ్మాయికి తమ కొడుకులు పెంపుడు కుక్కల్లా మారినా వాళ్ళు కించపడటంలేదు.

కన్యాశుల్కం వెనుక అవసరము, స్వార్ధమూ ప్రధానపాత్రవహిస్తే.... వర విక్రయం వెనుక కేవలం స్వార్ధమే గూడుకట్టుకునివుంటోంది.

ఆడదాని వివాహ విషయంలో ఆనాడూ ఈనాడూ పురుషాధిక్యతే చోటుచేసుకుని వున్నది.

ఎలా అంటే.... మూడు కాళ్ళ ముదుసలి కూడా తన దగ్గర డబ్బుంటే అందమైన, అమాయకురాలైన ఒక పసితనం వీడని అమ్మాయిని కొనుక్కుని దర్జాగా తన భార్యగా చేసుకునేవాడు.

వరకట్నం వచ్చినా కూడా యిలాంటి అవకాశం ఆడదానికి లేదు.

ఉండాలని నేను కోరుకోటంలేదు. కాకుల్ని కొట్టి గ్రద్దలకు వేసినా..... లేదూ.... గ్రద్దల్నికొట్టి కాకులకు వేసినా ఫలితం ఒక్కటే....

మీ కాలంలో ఆడపిల్ల తల్లి దండ్రుల స్వార్ధానికి బలియై పసి వయసులోనే ఎవడో ఒకడికి యిల్లాలుగా మారిపోయి బ్రతుకును ముక్కలు చేసుకునేది.

ఈనాడు మగవాడిని కొనుక్కునే స్థోమతులేక ముప్ఫయ్యోపడిలో పడ్డా ఎవరికీ యిల్లాలు కాలేక నిస్సారమైన జీవితాన్ని గడుపుతోంది ఆడపిల్ల. ఎవడో ఒకడు భర్తగా లభిస్తే చాలనుకుంటోంది.

ఆడపిల్లకు అప్పుడూ యిప్పుడూ తప్పటంలేదీ అడ్జస్ట్‌మెంట్.

సగటు మధ్యతరగతి ఆడపిల్లల కన్నీటి వైవాహిక గాథ అప్పుడూ యిప్పుడూ ఒకే పల్లవితో వున్నది. మావాళ్ళు నాకోసం.... మగపిల్లాడున్న ప్రతి గడపా ఎక్కిదిగుతున్నారు.

నేను అందంగా వుంటాను. చదువుకున్నాను. నా యింటిని సక్రమంగా తీర్చిదిద్దుకోగల తెలివితేటలు, ఓర్పు నాకున్నాయి.

మగాడిని మెప్పించటానికి ఈ క్వాలిఫికేషన్స్ చాలవు. సాటి ఆడవాళ్ళయినా. మగాడి అక్క చెల్లెళ్ళు, తల్లులూ ఈ విషయంలో ఛస్తే రాజీపడరు. మగాడిని పడనివ్వరు.

ఆడపిల్లకు ఈ క్వాలిఫికేషన్సేవి లేకపోయినా పర్లేదు. వాళ్ళు కోరినంత కట్నమివ్వగల స్థోమ తొకటే వుంటేచాలు.... అదిలేని ఆడపిల్లల గతి అధోగతే!

సు
— ఐ
తోస్తో
"అంతేనా
నిరుత్సాహంగా అ
"మార్పులేకేం? ఒ
బుర్ర గొరిగించుకో
కట్టనక్కర్లేదు.... రా
సరిపెట్టుకో నక్కర్లేద
మయిపోనక్కర్లేదు. ఇద
కాదూ?"
"ఏడిసినట్టుంది. ఎవడిక్కావా
సొచ్చిన ఆడపిల్ల వివాహ విషయం
వ్యథకూ గురికాకుండా తనకు తగిన ఒక మ
జీవితాన్ని ముడివేసుకుని, చిన్న పొదరిల్లు లా
సంసారాన్ని ఏర్పరుచుకుని సుఖశాంతలతో జీవితాన్ని గడపగలగటం కావాలి. ఈ వరకట్నాలు, కన్యాశుల్కాలూ నసించిపోవాలి. కొనుక్కోటాలు, అమ్ముకోటాలూ అంతరించిపోవాలి.

ఇన్ని సంవత్సరాలు గడిచింది. ఈమాత్రమయినా మీరు సాధించి వుండలేకపోతారా అనుకున్నాను. ఆ రోజుల్లో ఎటూ సుఖపడలేక, ఒక పశువులాగా జీవితం గడిపాను. ఇప్పుడు మళ్ళీ మీమధ్యన పుట్టి..... ఈసారయినా నిండయిన జీవితం గడపాలనే ఆశతో......" పేలవమయిన కంఠంతో అన్నది బుచ్చమ్మ. ఆమెముఖంలో ఆశాభంగం కొట్టొచ్చినట్టు కనపడుతోంది.

"ఒద్దొద్దు. అలాంటి పిచ్చికోరికలు కోరుకోకండి. నన్ను చూస్తున్నారుగా? ఇక్కడి పరిస్థితులు తెలుసుకున్నాక కూడా మీలో ఆ కోరిక మిగిలివుందా? నామాటవిని, హాయిగా..... మీ రిప్పుడెక్కడి నుంచి వచ్చారో అక్కడికే వెళ్ళిపొండి.

అప్పటికీ యిప్పటికీ ఆడదాని విషయంలో మేం సాధించిన ప్రగతి ఏమీలేదు. మీకన్నా దయనీయమైన చరిత్రలుమావి....." తడి కళ్ళతో అన్నది అనసూయ.

మలినమైన ముఖంతో నిశ్శబ్దంగా అక్కడినుంచి కదిలి వెళ్ళిపోయింది బుచ్చమ్మ! 

# వారఫలం

## 26-8-1988 శుక్రవారం మొదలు 1-9-1988 గురువారం వరకు

★ **మేషం** : అదాయమున్నది. సాధు సజ్జన సద్గోష్ఠికి అవకాశం, దైవ కార్యాచరణమునకు ఆస్కారం, విద్యావంతుల పరిచయం, నూతన వస్తు సేకరణకు ఆస్కార వారం. స్త్రీలకు : వృత్తి వికాసం, శుభ వార్తా శ్రవణం, స్వల్పాదాయం.

★ **వృషభం** : ఏ వ్యవహారమైనా అనుకూలంగా సానుకూల మవటంలో ఆక్షేపణ లేదు. నూతన వృత్తియందు వికాసం లేకపోలేదు. ఉద్యోగ మందు అభివృద్ధి కనిపించక పోలేదు. స్త్రీలకు : వస్త్రములో, నగలో కొనుగోలు చేయగలుగుతారు. సజ్జన సాంగత్యమున్నది.

★ **మిధునం** : సాధు సజ్జన స్సాంగత్యమున్నది. వృత్తియందు అభివృద్ధికరములయిన మార్పులు రావచ్చు ఒకానొక వ్యవహారం అనుకూల దాయకమే గాక లాభ ప్రదాయక మవుతుంది. గ్రహించండి. స్త్రీలకు : అనుకొన్న విధంగా, ఆశించిన విధంగా కార్యక్రమం సాఫీగా జరిగి పోతుంది. వృత్తి వికాసవంతమవుతుంది.

★ **కర్కాటకం** : విధీ విరామం ఎరుగక యత్నిస్తారు. బాగా శ్రమిస్తారు. అనుకూలమైన లాభార్జన గావిస్తారు. ఆరోగ్యమందు అభివృద్ధి చెప్పదగిన గ్రహస్థితి గల వారం. క్రమ క్రమంగా మీ రాశి అభివృద్ధిని పుంజుకొంటుంది. స్త్రీలకు : రాజకీయంగా అనుకూలత, ఉద్యోగ రీత్యా సదవకాశాలు చెప్పదగిన అంశాలు.

★ **సింహం** : ఉత్తముల సాహచర్యం మేలనిపించి, ఆశించిన విధంగా ఒకానొక కార్యాన్ని సాధించుకో గలుగుతారు. రాజకీయవాదులకు ఏ విధంగా అనుకూలంగాదు. వ్యాపారము అంతే, అందుకుతోడు 'కేతుగ్రహమే' రాశియందున్నాడు గదా! స్త్రీలకు : కళారంగ విఖ్యాతి, రాజకీయంగా ప్రఖ్యాతి, యత్నించి చూడండి.

★ **కన్య** : 'ఏది మంచిది, ఏది కాదు, ఎవరిని చేరుకోవాలి, ఎక్కడకు వెళ్ళకూడదు' అని తెలియక కొన్నాళ్ళు వ్యయిస్తారు. కాలం కలిసి రావటం లేదని పనులు చేయక వదులుతారు కొన్నాళ్ళు. కృషి వదలరాదు. పట్టుదలతో కార్యానుకూలత సాధించాలి. స్త్రీలకు : వస్తు వాహన సేకరణకు అనుకూలం, విద్వద్గోష్ఠి.

★ **తుల** : ఎవరేమనుకొన్నా మీకే విధంగా భయం లేని పరిస్థితి. మీ ఆరోగ్యమందు అభివృద్ధి చెప్పక తప్పదు. 'కృషితో నాస్తి దుర్భిక్షమ్' 'జపతో నాస్తి పాతకమ్' అని గ్రహింపగలుగుతారు. స్త్రీలకు : ధనలబ్ధి, వృత్తి వికాసం, రాజకీయ నాయకులతో సమాగమం కొందరకు.

★ **వృశ్చికం** : బంధు మిత్ర సమాగమం. 'వార గ్రహ స్థితి' వలన ఒకటి చేయబోయి మరొకటి చేస్తారు. వృత్తి మార్పునకు యత్నించి విఫలు లవుతారు. విరోధివర్గమున్నది. ఎలా మసలు కొంటారో జాగ్రత్త. స్త్రీలకు : వృత్తియందు ఏదో తటఫటాయింపు, రాజకీయంగా అనుకూలత లేకుండుట గమనించగలరు.

★ **ధనుస్సు** : చక్కని పరిజ్ఞానము గల వారితో సహవాసము. సత్కృషి వలన ఆశించినంత అధికాదాయము. ముఖ్యులను కలిసికొనుటతో, కాల వ్యయము. చాల కాలం నుండి రాని పైకం చేరుటకు అనుకూలం. స్త్రీలకు : కొంత వయసు మళ్ళిన వారు జాగ్రత్త పడవలె, ముఖ్యంగా ప్రయాణించుటయందు, ఆరోగ్య విషయాన. స్వల్పంగా ఆదాయం లేకపోలేదు.

★ **మకరం** : మీ వ్యాపారం హాయిగా సాగిపోతుంది. విరోధి వర్గం కొంత తగ్గుముఖం పడుతుంది. వారమంతా ఆనందదాయకంగా సాగుతుంది. ఉద్యోగులకు శుభ వర్తమానం అందుతుంది. స్త్రీలకు : ప్రయాణావకాశాలు, సాగించి వస్తువులు పోగొట్టుకొనుటో, గొడవలు తెచ్చుకొనుటో కొందరకు తప్పవు.

★ **కుంభం** : దూర బంధువులో, మిత్రులో బాగా తెలిసిన వారో యింటికి రాగలరు. ఆదాయం, కార్యానుకూలత, ప్రత్యేకంగా ఒకానొక కుటుంబ వ్యవహార చర్చలందు అనుకూలత చెప్పదగిన ముఖ్యాంశం. స్త్రీలకు : వృత్తి, ఉద్యోగాలు యధాతధంగా జరిగిపోతాయి. వ్యాపారం సాగించే లాగైతే మేలున్నది. గ్రహించండి.

★ **మీనం** : సకల విధాలా అనుకూల వారం. మిత్రానుకూలతకు ఆస్కారం, నాట్య నాటక కోవిదులకు సదవకాశం, రాజకీయంగా విశిష్టంగా మేలుంటుందని ఊహించి, గ్రహించి, శ్రమించండి. మీరు వ్యాపారం చేస్తున్నారా?? అదీ మేలే. స్త్రీలకు : భూ వసతి గల వారికి అనుకూల వారం. శుభ కార్యాలను గూర్చి చర్చించే వారికి అనుకూలదాయక సూచనలు.

—విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి

## నిత్య నూతన సీరియల్




(గత సంచిక తరువాయి)

నాల్గు రోజులైన తరువాత శాస్త్రిగారు రాలేదు. నాయుడు తండ్రితో మాట్లాడి "శాస్త్రిగారు లోకోక్తిగా అన్నారట క్షమించు మన్నా"రని చెప్పెను. రంగారావు "సరే" అనెను. హరప్ప "కుదిర్చినచో ఆయనయే కుదుర్చును. వారి చేతనే మరల తమరు మందు పుచ్చుకొనవలయును." అని మనవి చేసెను. రంగారావుగారు వ్యాధివలన బాధ పడలేక మౌనము వహించిరి. ధర్మారావు పోయి శాస్త్రిగారిని మరల తెచ్చెను. శాస్త్రిగారు వైద్య మారంభించిరి. ఆయన "యీ మందు వాడుచుంటిని. రేపు ప్రొద్దునకే గుణము కనబడును" అని చెప్పి మందు వాడును. ఔషధము చెప్పినట్లు జవాబిచ్చును. హరప్ప "వ్యాధి యెన్నాళ్ళలో కుదురు"రని అడిగెను. శాస్త్రిగారు "వ్యాధి ప్రారంభించి పదునారేండులు కావచ్చు చున్నది. మూడేండ్ల నుండి ముదిరినది. రెండేండ్లయిన నౌషధసేవ చేసినగాని కుదర"దనిరి. అంగీకృతి వచ్చినది.

నాగేశ్వరరావుగారు రాజీనామా యిచ్చిరి. ప్రతిచిన్న విషయములోను నాయుడు జోక్యము కలిగించుకొనుట కాయన యిష్టపడలేదు. హరప్ప ధర్మారావును "మిమ్ము దివానుగా వేయుదు"నని పిలిచి చెప్పెను.

ధర్మారావు: నేను తమకు చిన్నతనము నుండి దివానునే! మా పూర్వులందరు మీ పూర్వులకు మంత్రులు. వారు జీతము బత్తెము లేని కొలువు చేసిరి. నేను జీతము మాత్రమే లేని కొలువు చేయు చుంటిని. బత్తెము పది పదునొకండేండ్ల నుండి ముట్టుచున్నది. మీరు నాకు జీతము దమ్మిడి యిచ్చినను పుచ్చుకొనను." అనెను. హరప్ప నేత్రములలో మైత్రియో కృతజ్ఞతయో యౌదార్యమునకు మెప్పుదలయో కొలుకులందు మినుకు మినుకు మనెను.

హరప్ప తాను ప్రభువు నైతినని తెలిసికొనెను. ఇంక మాతృకర్మ చేయవచ్చునా? స్వామికి కల్యాణములు చేయవచ్చునా? హరప్పకు తనయందు తనకు నమ్మకము కుదురు వఱకు ఆషాఢమాసము వచ్చెను. స్వామికల్యాణము వైశాఖ పూర్ణిమకు జరుగును. పదినెల లాగినగాని కల్యాణమునకు వేళ రాదు. కర్మలు కూడ అప్పుడే!

## 23వ అధ్యాయము

కుమారస్వామికి పుత్రోదయము, ఉద్యోగము ఒకసారి అయ్యెను. కాలేజిలో నతడాంధ్రోపన్యాసకుడయ్యెను. నెలకు నూటపాతిక రూకలు జీతము. అతడు తెలుగులో బి. ఏ. పరీక్ష యిచ్చి యేడాదియైనది! ఈయేడు ఎమ్. ఏ. పరీక్షకు వెళ్ళును. అతడు సంఘ సంస్కారం వివాహము చేసికొనుట మిషనరీల కాలేజీలో నది ఎమ్. ఎ. ప్యాసైనంత గుణమిచ్చెను. కొడుకునకు ధర్మారావని పేరుపెట్టెను. శ్యామల కొడుకును, "మా గురువుగారు" అని పిలుచును. కుమారస్వామి ఒకనాడు ధర్మారావుతో తన కొడుకును జూపి "మాష్టరుగారూ, మావాడేమి సామాన్యుడనుకొన్నారా? చక్రవర్తి యటు, వీడిటు" అనెను.

ధర్మా: ఇతడు దేనికి చక్రవర్తి?

కుమార: మావానికి మాత్రము మనోవృత్తి రాకపోవునా? చూతము.

శ్యామల: చక్రవర్తి మీద మీ కింకను కసిపోలేదు. నాలుగైదు దినములు నేనాయనతో మాటాడినందుకే యింత వైరము పెంచుకొనవలయునా?

ధర్మా: ఇప్పుడాయనేమి చేయుచున్నాడు?

కుమార: చెప్పితినికదా, తండ్రి యిచ్చిన మనోవృత్తి తినుచున్నాడు.

శ్యామల: చక్రవర్తి యటు, వీడిటు ఏమిటి?

కుమార: ఆ చక్రవర్తితో ఇంక మా అబ్బాయియే వాదించును. మాష్టరుగా రక్కరలేదు.

ధర్మా: ఏరుదాటి తెప్ప తగుల వేయుచున్నావు.

ఒకనాడు మంగమ్మయు, కుమారస్వామియు, కూర్చుండిరి.

మంగమ్మ: నెలకు నూటపాతిక సంపాదించుచున్నావు. ఏమిచేయుచుంటివి?

కుమార: ప్రాత అప్పులు తీర్చుచుంటిని.

మంగ: నాది మాత్ర మప్పుకాదా?

కుమార: కాదని మీరేకదా చెప్పితిరి!

మంగ: నాల్గువంద లెగవేసెదవా?

కుమార: తెలివి తక్కువ ఎవరిది? కాగితము వ్రాయించుకో మనగా వ్రాయించుకొన్నారా? నోటున్నచో ఇచ్చెడివాడనే. ఇప్పుడు నాకు ప్రాణ మొప్పుటలేదు.

మంగ: ఒప్పదొప్పదు. కొడుకునకు మెడలో గొలుసు చేయించి పెట్టెదను; ప్రాణమొప్పునా?

కుమార: నిజముగా మీ ముందు జమిందారులెందుకండీ. ఈమాత్రపు మాట అన్న బంధువులే లేరు. మీరు మఱల వెనుకకు వేయరాదు సుడీ! ఏదో పద్యమున్నది. "ఆడిన మాటను దప్పిన గాడిదకొడు కంచుదిట్టగానయ్యయ్యో వీడా నాకొక కొడుకని గాడిద యేడ్చెంగదన్న ఘనసంపన్నా!" ఆడిన మాట తప్పరాదు.

మంగ: నీవును, నీ కొడుకును వట్టి పిచ్చివాండ్రు. నోటిలో వ్రేలు పెట్టిన కొరకను గూడలేరు, పాపము.

కుమార: మా అబ్బాయికి పండ్లు వచ్చినవని యెర్వలేరా?– ఆనాటి సాయంకాలమున చిన్న ధర్మారావు మెడలో బంగారపు గొలుసు వెలసినది.

కుమార: మీరు మా అబ్బాయిని వరించితిరా? మా అబ్బాయి నలుడు; మీరు దమయంతి. అచ్చముగా గాదులెండి– అభినవ నలుడు, అభినవ దమయంతి, కలికాలములో దమయంతి పతివ్రత కానక్కరలేదు. మా అబ్బాయి పెద్దవాడవు వఱకు భార్యాభర్తలకు సుమారు పాతకేండ్ల వారడి. మన సిద్ధాంతమునకు

జరిగినకథ- 55: రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటారు. దేవదాసి ప్రతి రోజూ దేవాలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది. ధర్మారావు భార్య ఆరోగ్యం చెడిపోతుంది. సుబ్బన్నపేటలో నాగరికత పెరుగుతుంది. గణాచారి అన్నగారి ఇంటిని వదలి దేవాలయంలో నివాసం ఏర్పాటు చేసుకుంటుంది. రంగమ్మ మహిళా మండలిలో చేరుతుంది. మంగమ్మకు మహిళా మండలి కార్యక్రమాలు అంతగా నచ్చవు. రంగారావుగారు సుసానీ ఇంగ్లాండు పోయిన తరువాత బియాట్రిస్ అనే ఫ్రెంచ్ వనితను తీసుకు వస్తాడు. రంగారావుగారు వ్యాధిగ్రస్తుడవుతాడు. హరప్పనాయుడు కోటకు అధికారి అవుతాడు.

సరిపోవును.

మంగ: నీవింక పెద్దమనిషి తరహా నేర్చుకొనవలయును కొక్కిరాయిగా ఉన్నచో ఉద్యోగముండదు.

కుమార: కేషబ్బీ నిర్భ్రమణ మైనదిగా శిక్షాపద్ధతి పూర్వమువలె బిగిసియుండదు.

మంగ: ఇది అంతకన్న ఎక్కువ అది లోపల సడలు పైకి బిగువు. ఇది లోపల బిగువు. పైకి సడలు. అప్పుడు ధర్మారావు వచ్చెను. కుమారస్వామి కొడుకునుతెచ్చి చూపించెను. ధర్మారావు నీ కొడుకు రోజు రోజుకి క్రొత్త కొడుకా యేమిటి? వచ్చినపుడెల్ల చూపింతువు.

కుమార: అది కాదండి నేను మంగమ్మగారికి నాలుగు వందలప్పు పెట్టినాను. అస లీయకపోయిన మానెకాక, వడ్డి యిమ్మన్నాను. ఆమె పట్టి దరిద్రురాలు కదండీ తిండిలేక చచ్చిపోవుచున్నది. తనవద్ద డబ్బులేదని యీ గొలుసు– పూర్వమెప్పుడో చేయించుకొన్నది– క్రొత్తగా మెరుగుపెట్టించి వడ్డీ క్రింద ఇచ్చినది? అది మీకు చూపించుచున్నాను.

మంగ: ఇంక అసలీయలేదు. అంతకు దీనితో సరిపెట్టుకొనుము



కుమార: వెనుక గేదెపడ్డ నిత్తునంటిరిగదా, మా అబ్బాయికి పెండ్లి యాడుటకు మఱచిపోయినాను మాష్టారుగారూ; మా అబ్బాయికి సంబంధము కుదిరినది. పెండ్లి యెప్పుడు చేయుదుము?

ధర్మా: ఇది బాల్య వివాహము క్రింద లెక్క. శారదా చట్టము క్రిందికి వచ్చును.

కుమార: శారదా చట్టములో పెండ్లికొడుకు చిన్నవాడయ్యినచో అంత పట్టింపులేదు. పెండ్లికూతురు పాతికేండ్లదండీ. ఒకవేళ తప్పైనను మాకు కొంత వయస్సు ముదరా రావలయునుగదా. యావరేజి కట్టినచో బాల్య వివాహము కాదు

మంగమ్మ: నీ మాత్రముబుద్ధి వారికిలేదు.

కుమార: లేకయేమి? మాకిద్దఱకు అసలసలుగా నుండగా వడ్డీలు గిట్టుచున్నవి.



శ్యామల: మీకు సరే. ఆయన కేమిటి? ఒహో అదా

కుమార: చక్రవర్తి తలపునకు వచ్చినాడు కాబోలు.

శ్యామల: ఇంక నెన్నాళ్ళి సాధింపు?

వాకిట ఎవరో వచ్చినట్లయినది. అందరు అటు చూచిరి. వచ్చినాయన "ధర్మారావున్నాడా? అండీ" అనెను. ధర్మారావు కంఠము గుర్తుపట్టి బయటికి పోయి "ఎప్పుడు వచ్చితివి? నేనెందున్నానని ఎవరు చెప్పి"రనెను. శ్యామలయు, పంకజమ్మయు "దయచేయండి? రాఘవరావుగారూ మీరు చెఱనుండి ఎప్పుడు వచ్చితి"రని అడిగిరి.

రాఘవరావు: వచ్చి నాల్గు నెలలయినది.

ధర్మా: మఱల ఎప్పుడు వెళ్ళుచున్నావు.

రాఘవ: ఇంక వెళ్ళినచో మఱలరాను. ఇంతవరకు మూడుసారులైనది. నాకు క్షయపుట్టి బతుకనేమో అని వదలిపెట్టిరి. బయటకు వచ్చిన తరువాత క్షయలేదు. గియలేదు. నా బదులు నా భార్యకు ప్రాణము మీదకి వచ్చినది.

ధర్మా: మరి యిప్పుడెందుకు వచ్చితివి?

రాఘవ: నీకోసమే. ఇంటికి పోదమా? ఈ ఊరిలో రాజశేఖరశాస్త్రిగారున్నారట. ఆయన నీవు చెప్పినచో వచ్చునట.

ధర్మా: జబ్బేమిటి?

రాఘవ: ఏమిటో గోల. చెప్పెదనులే.

శ్యామల: చెప్పండి. మాకు ఆదుర్దాగానున్నది.

రాఘవ: ఏమియు లేదమ్మా. రెండు నెలల గర్భిణి. గర్భస్రావమైనది. నాల్గు దినములు జ్వరము

## పర్వతాలపై స్కయింగ్



అధునిక క్రీడగా ఉన్న పర్వతాలపై స్కయింగ్‌కి 1896లో ఆస్ట్రియా దేశానికి చెందిన మాథియాస్ డ్వార్‌స్కీ రూపకల్పన చేసాడు. మలుపులు తిరిగేటప్పుడు సహాయంగా ఉండే మొట్ట మొదటి స్కయిలని, బైండింగ్‌లని ప్రత్యేకంగా ఆయన తయారు చేసాడు.

## అత్యంత భారీ క్రీడాకారుడు



అమెరికాకి చెందిన మల్లయుద్ధ వీరుడు విలియం ('హాపీ హంఫ్ర') కోబ్ అత్యంత బరువు గల క్రీడాకారుడు 1962లో ఈయన బరువు 363 కిలో గ్రాములు.

## వేయి పడగలు

వచ్చినది. మేము వట్టి జ్వరమనుకొన్నాము. అమ్మవారు పోసినది.

ధర్మా: బాపట్లలో నా, నరసారావుపేటలో నా?

రాఘవ: ఈ నాలుగు నెలల నుండియు నేను బెజవాడలో ఉంటిని.

ధర్మా: తిండి?

రాఘవ: తిండికెవ రున్నారు? తెలియదా.

ధర్మా: నాల్గు నెలల నుండి యిచట నుండియు, నాకు తెలియజేయలేదేమి?

రాఘ: తెలియ జేసినచో నీవువత్తువా? సరే, పోదము. రాజశేఖరశాస్త్రిగారి నీనాడే తీసికొని పోవల్లయును.

శాస్త్రిగారు నాటి రాత్రి పది గంటలకు బెజవాడలో రోగిని చూచిరి. చూచి బయటికి వచ్చి ధర్మారావుతో లాభము లేదనెను. అయినను యేదో యౌషధము నడిపెను, తెల్లవారుజామున ఆమె యీ లోకమును త్యజించెను. శాస్త్రిగారు తిరుగు రైలు మీద సుబ్బన్నపేటకు పోయెను. మిగిలినది సూర్యపతియు, ధర్మారావు, రాఘవరావు. మిత్రులు ముప్వురు నొకరి మొగము లొకరు చూచుకోలేక మోకాళ్ళ మీద మొగము లాన్చుకొని గూర్చుండిరి. నాలుగు గంటలైనది. రాఘవరావు "ఏడ్చుటకు కూడ ఎవరును లేకపోయిరి కదా" అని కులిమిపోయెను. ధర్మారావు పట్టుకొని ఓదార్చెను. సూర్యపతి "తెల్లవారువరకు శవమును మనమే శ్మశానమునకు చేర్చుకొనవలయును. ఈ వ్యాధితో పోయిన దనగా ఎవ్వరును పట్టుటకురారు. మొన్ననిట్లే మా యింటి ప్రక్క నొక అవిడ ప్రసవించి మశూచికము వచ్చిపోయెను. ఈ బ్రాహ్మణులు కాకిముండకొడుకులు. వీరికి డబ్బు తప్ప నీతియు, జాతియు లేదు. ఆనాడు వారింట్లో చాల యిబ్బంది పడిరి. మనము తెల్లవారకముందే ఏదో చూడవలె"ననెను. రాఘవరావు "కర్మ సంగతి యేమిటి." ధర్మారావు "ఇట్టి చావులకు కర్మ యేమియు లేదు. ఇప్పుడు దహనమూ కూడలేదు. వట్టి ఖననమే. పది పదునేను రోజులు దాటిన తరువాత కర్మ ప్రారంభించవలయును." అనెను.

రాఘవ: మరి శ్మశానమునకు చేరుట ఎట్లు.

ధర్మా: ధన మెంతైన నొసగి బ్రాహ్మణులను దేవలయును,

రాఘవ: ఏధైనను బండిమీద తీసుకొని పోరాదా?

సూర్య: బండివాండ్రను రారు. పోయి రావలయును. ధర్మారావు తాను పోయివత్తుననెను. అతడు పోయి యెంత మంది నడిగినను రాలేదు. చివరి కొక సాహెబు మూడు రూకల కిచ్చుకొని యింటిదాక వచ్చి "మశూచిక మటండీ నేను రా"నని తిరిగి పోయెను. భళ్ళున తెల్లవారెను. ధర్మారావు మరల గ్రామము వెంట తిరగజొచ్చెను. తిరిగి తిరిగి కాళ్ళు బలపములు కట్టెను. కాని బండి దొరకలేదు. ఇంటికివచ్చి మిత్రు లిద్దరితో చెప్పెను. చివరకు ధర్మారావు "మనమిద్దరము తీసికొని పోదము. ఏమి చేయుద"మనెను. సూర్యపతి "నేనుపోయి బండి మాటాడుకొనివత్తును. నాకు కూడ కుదరనిచో అట్లే చేయవచ్చునని పోయి పదిగంటలకొక బండివాడు "బండి ఇచ్చెదను. మీరే తోలుకొనవలయు'ననెను. మూడు రూపాయల కొప్పుకొనెను. సరే తెచ్చిరి. ధర్మారావు బండి తోలుచుండెను. బండిలో శవముంచిరి. వెనుక రాఘవరావు, సూర్యపతులు వచ్చుచుండిరి. ధర్మారావు దుర్వాసనకు కూరుచుండలేక పోయెను. దిగి తోలుదమన్న బండికి ముందు బరువు చాలలేదు. అట్లె ముక్కు క్రోవులు బిగబట్టి శ్మశానము చేరిరి. రాఘవరావునకు శరీరములో బొమికలే మిగిలెను. అతనికీ యైదు దినముల నుండియు నిద్రాహారములు లేవు. మనిసి తూలిపోవుచుండెను. గోయి మాలవాండ్రు త్రవ్వి వెడలిపోయిరి. మరి కొంత త్రవ్వవలసి వచ్చెను. ధర్మారావు త్రవ్వెను. ధర్మారావు. రాఘవరావు ధర్మారావులు శవమును గోతిలో నుంచిరి. ధర్మారావు సూర్యపతులు పాఱలతో గోయి పూడ్చిరి. బండి అంతయు కృష్ణలో కడిగి తాము స్నానములు చేసి తడిగుడ్డలతో ఇంటికి వచ్చిరి. రాఘవరావు మూర్ఛపడిపోయెను.

సూర్య: అతని ఒడలిలో ప్రాణమెచ్చట నున్నది? అసలే అంతంత, జైలతనన్ తినివేసెను. వారు పెట్టెడి అన్నము తినినచో క్షయాది సకల వ్యాధులను వచ్చును. నేను ఎఱుగుదును గదా. రెండుసారులు వెళ్ళువరకు నాపని యైనది. రాఘవరావును సేదతీర్చి అన్నము తినిపించిరి. అతని మామగారికి, అన్న గారికి తంతి యిచ్చిరి, రాఘవరావు తల్లి అదివఱకే చనిపోయెను. అతని అన్నగాని, అన్న భార్యగాని రాలేదు. రాఘవరావునకు సంతానములేదు. తమ్ము పిల్లయేమో పోయినది. ఇంక పోవుట ఎందు కని అత్తమామలు రాలేదు. రాఘవరావు తలచుకొని తలచుకొని తలంచుకొని, నాభివద్ద నుండి సెలవేసికొనగా ముక్కుక్రోవుల వెంట కంత ప్రదేశ నీరుద్ధ దుఃఖోల్బణమును బ్రకటించెను. మిత్రులతని నాదరించుకొనలేక పోయిరి, నాల్గునాళ్లిట్లో జరిగినది. సూర్యపతి ధర్మారావుతో నేను బందరు పోయి రావలయును. నీవు రాఘవుని చూచుచుండుము అని, చెప్పెను.

# సుదూర్ పడవపందాలు

సైకిల్ లాగా తొక్కుతూ నడిపే సుదూరపడవ పందాల పోటీలు టెక్సాస్ వాటర్‌సఫారీ. ఇవి క్రమం తప్పకుండా నిర్వహించబడుతున్నాయి. ఈ పోటీలో మొత్తం దూరం 419 మైళ్ళు (674 కి.మీ). అమెరికాసంయుక్త రాష్ట్రాలలో నిటెక్సాస్‌లో ఉన్న శాన్ మార్కోస్, గ్వాడలూపే నదులపై ఇవి జరుగుతాయి.



ధర్మా: బందరెందుకు.

సూర్య: పని యున్నది పోవలయును.

ధర్మారావు "సరే పోయిర"మ్మనెను. మరునాడు ధర్మారావు రాఘవరావును వెంటతీసికొని, అతడద్దెకున్న యింటికి పోయి ఈ ఇల్లు ఖాళీ చేసి, ఉన్న కొద్ది సామాను సూర్యపతి యింటికి చేర్చెను. ధర్మారావు మిత్రుని కూర్చుండనీయలేదు. గ్రామము వెంటనే త్రిప్పెను. సాయంకాలమున కృష్ణ ఒడ్డున కూర్చుండబెట్టి "రాఘవా మనచిన్న నాటికి ఇప్పటికి భేదమెంతయో చూడుము ఆ రోజులలో మన బ్రతుకు లిట్లగునని మనమనుకొంటిమా! నలుగురము నాల్గుదారులకు పోతిమి. కిరీటి మట్టుకు కిరీటి నిక్షేపమువంటి డిప్యూటీ తహసిల్దారు పని, మామగారిప్పించినది వదలుకొని, స్కూలుమాస్టరు చేయుచుండెను. నా చదువు ఫలితమునకే రాలేదు. నీ విట్లయితివి. సూర్యపతికి తగిన కష్టములు సూర్యపతియు ననుభవించుచున్నాడు. మా సుబ్బన్నపేటయే కాదు. లోకమంతయు నట్లేయున్నది. వృధాగా మాయలో పడెదము కాని, మనము కర్తలము కాము. భోక్తలముకాము. భోక్తృభ్రాంతి ఉన్నది. కష్టపరంపరచేత గర్తృభ్రాంతి కొంత వదలినది ఆమె యెవరు? నీవెవరు? ఆమెకొఱకు దుఃఖించుట యెందులకు? దుఃఖించి తేలేము కదా? మన శక్తికి దాటిన దానిని గురించి విచారించి ఫలితము లేదు. అట్లు విచారించిన వాడే మూర్ఖుడు. మనము గ్రుడ్డివారము. యాథార్థ్యము తెలిసికొనలేము కదా. మనకు గ్రుడ్డి పొరయొకటియే. ధనవంతునకు రెండు పొరలున్నవి. మనము సంసారాంధులము మాత్రమే. వాడు ధనాంధుడు కూడను. మనము విద్యతో ఈ పొరను గోసితిమేని మనకు దృష్టి భాసించును. చూడుము. ఇందులో నేమున్నది. నేడు నీ భార్య చనిపోయినది. రేపు నా భార్య చనిపోవచ్చును.. తరువాత నీవు చనిపోవవచ్చును. నేనును చనిపోవచ్చును. మా హరప్పనాయుడు స్వామియవతారము. ఆయన మాత్రము స్థిరమనియున్నదా. అసలు సంపూర్ణావతారము వేణుగోపాలదేవుడు. ద్వాపరాంతముననేల చనిపోవలయును? శ్రీరామచంద్రులు గతించుట యేమి? అంత మనునది విచిత్రముగా వచ్చును. నీవు పరమ బుద్ధిమంతుడవు; దేశమునకు హితమనుకొన్నది ప్రతి నెత్తురు బొట్టుతో ఆచరించితివి. నీకు బయటకన్న జైలులోననే తగిన స్థలము. మూడుసార్లు మూడు రెండాడేండ్లు జైలులో ఉంటివి. ఆమెకును నీకును ఏమి సంబంధము? ఆ సంబంధము జైలులో మన్నప్పుడేమైనది? ఇప్పుడు అంతే అనుకొనుము. నీ వింక హృదయమును కుదుట పఱచుకొనవలయును" అనెను.

రాఘవరావు "అవును నేను దుఃఖమును. దీసివేసితిని" అని లేచి నిలుచుండెను. విచిత్రముగా రాఘవరావు పూర్వమువలెనే మాటాడజొచ్చెను. రాత్రికి సూర్యపతి తిరిగివచ్చెను. మరునాడుదయమున రాఘవరావు కనిపించలేదు. తమకన్న ముందేలేచి ఆత డెచటికి పోయెనో సూర్యపతి, ధర్మారావులు వెదకిరి. పది గంటలకు పోలీసువారు రాఘవరావును పట్టుకొనిపోవుచుండగా చూచిరి. ఏమిటని కనుగొనిరి. రాఘవరావు రాజకీయోద్యోగులనుద్యోగముల నుండి మానుడని ప్రబోధించుచు కాగితములు పంచిపెట్టి ఒక కాగితము సబ్ కలెక్టరునకు తీసికొని పోయి యిచ్చెను. అతనిని పట్టుకొనిరి. బందరు తీసికొనిపోయి సబ్‌జైలులో ఉంచిరి. సూర్యపతి, ధర్మారావు లతడు సబ్ జైలులో నున్నన్ని దినములును తిండి తిప్పలు చూచుచుండిరి.

ఆనాటికి నాల్గవ దినమున సూర్యపతి ధర్మారావులు కలిసి సబ్ జైలునకు పోయిరి. తాలూకా ఆఫీసునకు చేరువరకు ఇద్దరిలో ఎవ్వరును మాట్లాడలేదు. జైలులోనికి పోయిరి.

రాఘవరావు నవ్వుచు త్రుళ్ళుచుండెను. ప్రక్కనింకొక రాజకీయ నిర్బంధితు డుండెను. అతనితో "అరుగో మా వాండ్రు వచ్చిరి. నాకు ప్రతిపూటయు అన్నము తెత్తురు. సబ్‌జైలు లోనికి మంచిచెంబుతో నీళ్ళు, పఱుపు, దీపము తెచ్చిరి. రేపు రాజమహేంద్రవరములో నివి అన్నియు ఎవరిత్తురు. నేను వద్దనగా వినరు. ఇచట నీ కించిత్సుఖ మెందులకు? నన్నందరు వదలిపెట్టిరి. కాని వీరిద్దరు మాత్రము వదలిపెట్టలేకున్నారు. వీరితో పాటు మరొకాయన ఉన్నాడు ఆయన

## పతాకవందనం

నేడు జెండా ముందు
నిలబడి ఏమని వందనం చెయ్యాలి?
మా గొప్పలు ఇవంటూ ఏం చాటుకోవాలి?
దేశమంతా దుర్భిక్షం లేకుండా
సుభిక్షంగానే ఉందనాలా?
కులాల మతాల కార్పణ్యాలు,
టెర్రరిస్టుల మారణహోమాలు
మచ్చుకైనా లేవని వివరించాలా?
కృంగదీసే నిరుద్యోగం
నిలువునా బూడిద చేసే
వరకట్నాల హింసాజ్వాలలు
కలిక్కానిక్కూడా లేనే లేవని చెప్పాలా?
బోఫోర్సుల ఫోర్సు
దేశద్రోహుల ఫోర్సు
కట్టు కథలని ఓ హరికథ చెప్పాలా?
ప్రతి రేపు, మాపు చెయ్యబడుతున్న
'రేపు'లు,
ఖాకీల హత్యల ఎన్‌కౌంటర్లు
లేవని చాటి చెప్పాలా?
పదవీకాంక్ష, బంధుప్రీతి
ఎలక్షన్లలో రిగ్గింగ్
అసల్లేవని ఒట్టేసి చెప్పాలా?
ఏమని చెప్పాలి?
ఇంకేమని చెప్పాలి?
జాతి జెండా ముందు
ఏమంటూ అభివాదం చెయ్యాలి?

–కొడిమెల శ్రీరామమూర్తి

యుచట లేఖ కనుక బ్రతికిపోయినాను. నా భార్యకూడ నన్ను వదలి పోయినది. వీరిద్దరును నన్ను వదులునట్లు లేరు. నేనే వీరిని వదలి పోవలయు" అని చెప్పెను. ద్వితీయ నిర్బంధితుడు "వారిద్దరు మీకేమి కావలయునని అడిగెను. రాఘవరావు "ఏమి కావలయును? ఒకరు తల్లి, ఒకరు తండ్రి. కనిపించుటలేదా? ఇద్దరును పసిమి రంగు గలిగి దబ్బపండ్లవలె ఉన్నారు. ఈ రెండవ ఆయన ఖైదులోనికి పోవుటచేత ఆయన మనకు సహోదరుడు లెండి. మేకులు, పురుగులు తిని నల్లబడినాడు. ఆ రెండవయాయన సుబ్బన్నపేటలో వేణుగోపాలస్వామి గుడిలో శర్కర పొంగలి, దధ్యోదనముతిని మరియు వన్నె తేలినాడు. ఆజానుబాహువు. అతని కన్నులలో చూడుడు! దేవుడున్నాడు కదూ! ఆ యిద్దరును నాకు తల్లియు. తండ్రియు. తల్లి యెవరో, తండ్రి యెవరో మీరే నిశ్చయించుకొనుడు. నేను నిశ్చయించితినా వారు నన్ను కొట్టవత్తురు" అనెను. అందఱును నవ్విరి.

124 (ఎ) సెక్షను క్రింద రాఘవరావునకు రెండున్నఱ యేండ్లు కఠినశిక్ష వేయబడినది.

## 24వ అధ్యాయము

"వాలి సుఖముగా నున్నాడా?-" "సుగ్రీవుని రమ్మనుచున్నాడు. "సుగ్రీవుడు నిదుర పోవుచున్నాడు. తన తారను గాజేసిన వాలిమీద పగ దీర్చుకొనుట ఎట్లాయని శ్రీరామచంద్రునివంటి ప్రత్యగాత్మతో, సుషుప్త్యవస్థలో కలసి విచారించుచున్నాడు"

"నాకీ వేదాంతము తెలియుటలేదు."- "తత్పూర్వ భాగము తెలిసినదా?"- కొంతసేపు దమయంతి యందువు, కొంతసేపు తార యందువు, నీ యిష్టమే యిష్టము." అవతారములు మాఱవా?

మంగమ్మ : నీ కుద్యోగమైన తరువాత మరియు పట్టపగ్గములు లేకున్నవి.

## వేయి పడగలు

కుమారస్వామి ఇదిగో చూడుము. ఆడవారేమన్నను తప్పులేదు. మగవాండ్రు కొంచెమన్నచో వానిమీద పడిపోదురు. ఒక్క విషయము చూడుము. రుక్మిణీదేవి తన యిష్టమైన క్రిష్ణమ్మకు కబురంపినది. అది లోకమున కందఱకు లక్ష్మీదేవి విష్ణుమూర్తిని బెండ్లాడినట్లున్నది. భీష్మకుడు, రుక్మియు ఇచ్చెదమన్నారుగదా అని శిశుపాలుడామెను వాంఛించెను. శిశుపాలుడు జగద్ద్రోహియైనాడు. ఇది తత్త్వము. స్త్రీ వాంఛించినదా బయటికి పొక్కదు. అది శృంగార రసము. ఆమె వాంఛించకపోయినచో రసాభాసము. కావ్యములలో రసాభాసము మాత్రమే. లోకములో ?!

మంగమ్మ : లోకములో నేమిటి?

కుమార : ఏమిటని అడుగుచున్నారా? బడితెపూజ, ఒక్కొక్కప్పుడు శిరచ్ఛేదము, ఖూని. స్త్రీ మూలముగా లోక మెంత చెడిపోవుచున్నదనుకున్నారు? హత్యలు, ఖూనీలు జరుగుచున్నవి.

మంగమ్మ మారుమాట లేకుండ తిరిగి పోయినది, కుమారస్వామికి కారణము తెలియలేదు. ఆమె యింటికి పోయినంతనే వాలి కిచకిచలాడెను. చెంగలరావును పిలిచి "వాలికి కాఫీ పోసితివా?" అని అడిగెను. చెంగల్రావు "కాఫీ తెచ్చువఱకు చల్లారిపోయెను. వాని దొరతనమునకు వాడు చల్లారిన కాఫీ త్రాగునా? తాను తాగనన్నాడు. నేను కాదని బలవంతముగా నోటి దగ్గఱ పెట్టితిని! ఇదిగో నన్నొదలంతయు గీఱ. నెత్తురు కండలు చేసినాడు. పండ్లికిలించినాడు. ఇట్లయినచో నీకసలు కాఫీయే లేదని నేను మానివేసితిని" అనెను.

మంగమ్మ : "నాయనకదా! ఆ కాఫీ కొంచెము వెచ్చగిలపెట్టి యిమ్ము" అని లోనికిపోయెను. పోయి పరుండి ధీర్ఘాలోచనము ప్రారంభము చేసెను. 'కుమారస్వామి తన్ను విషయమున సూటి పోటి-మాటలనడు. కానీ యీ మాట తన్ను వచ్చి ఎట్లు తాకినది? ఇతని మాట యేమి? చాలమంది వక్రోక్తులు. తన్ను విషయము చేయుచున్నవి. తాను లజ్జాభిమానములు వదలి పెట్టినది; ఏ మాటకును, దేనికిని రోషము పదరాదు? పడి చేయునది యేమి? తా నన్నిటికి తెగించెను. లేకపోయిన తా నా ఊరిలోనే నాటకములో వేషములు కూడ వేయునా. జీవితములో తప్పునది ఒకసారి చేయుము! చివరిదాక దాని కర్మమంతే. పాపము, జోస్యులు నన్నెంత ప్రేమించెను. అతడసుందరుడు. నేను సౌందర్యవతిని. తనకు నేను దొరకినందుల కతని సంతోషము భూమి పట్టినదికాదు. రామేశ్వరము నాకు చేసిన అన్యాయమునకు తగిన ప్రతిక్రియయే తాను జరిపెను. తాను జోస్యులకు చేసిన అన్యాయమున కేమి ప్రాప్తియో? ఏమి ప్రాప్తి ఉన్నది. ఆఱువది డెబ్బది వేల ఆస్తితో తాను మహారాణివలెనున్నది. కాసాపేటలో పెద్ద మేడ. దానిమీద నలువదిరూక లద్దె వచ్చుచున్నది. సినిమా యెంత చెడినను నెలకు వేయి మిగులుచున్నది. నాటకమాడినపుడెల్ల మూడు వందలు, నాల్గు వందలు గిట్టుచున్నవి. హాలున కద్దెయని వంద రూపాయలు. లైట్లకే పాతిక, రెండు వందలు. పైన నఘుర్చిన కుర్చీలకు, వందకు రూపాయన్నరకు అది యొక పదేను రూకలు. తనకు నూటపదార్లు చీట్లపేక యాడినపుడు దీపపు ఖర్చు, పేకలు కొన్న డబ్బు, యింటి . అద్దె- ఈరీతిగా ధనమెంతయేని వచ్చుచున్నది. తనకేమి సుఖము కాక? ఎప్పుడో దైవము తలను చిదుకపొడుచును.

మంగమ్మ పెట్టె తీసి అందులో జోస్యుల ఛాయా పట మొకదుండగా అది బల్లమీద పెట్టెను. దొడ్డిలోనికి వోయి పారిజాతపు పూలు కోసి తెచ్చి, సన్నని దండ గ్రుచ్చి ఆ పటమున కలంకరించెను.

(ఇంకా ఉంది).



# ఆంప్రో మిల్క్ బేస్

# బడిపిల్లల బిస్కట్



ampro®

Milk Base

Sista's EIPL-97/88 Tel

పాలలోని పౌష్టికత పరిపూర్ణంగా గలది.



ప్రథమ ప్రయత్నంలోనే వరుసగా మూడు టెస్టులలో అది మూడు 'సెంచరీలు' చేసి భారత క్రికెట్ రంగంలోనే గాక ప్రపంచ క్రికెట్ రంగంలో సంచలనం సృష్టించి, మేటి ఆటగాళ్ళను మించిన 'మగ' ఆటగానిగా గుర్తింపు పొందిన 'వండర్ బాయ్', తెలుగు బిడ్డ, హైదరాబాద్‌వాసి మహమ్మద్ అజారుద్దీన్ భవిష్యత్తు గురించి అనేక విధములైన విమర్శలు వినిపిస్తున్నాయి. అజారుద్దీన్ యిప్పటికి దక్షిణమండలం తరఫున ఎంపిక అయి దులీప్ ట్రాఫీ పోటీలో సెంట్రల్‌జోన్ జట్టుపై అది 'డబుల్‌సెంచరీ' చేసాడు. అతర్వాత భారతదేశం తరఫున 'టెస్టు' పోటీలో ఇంగ్లాండుపై అది వరుసగా మూడు టెస్టులలో మూడుసెంచరీలు చేసాడు.

అజార్ 1984 నుండి 88 వరకు (యీ వ్యాసం రాసే సమయానికి) 24 టెస్టులు (36 యిన్నింగులు), 70 ఒకరోజు పోటీలు (63 యిన్నింగులు), 64

# మాయమైన అజారుద్దీన్ మాజిక్‌టచ్!

ఆడిన 24 టెస్టు పోటీలలో మొత్తం 6 సెంచరీలు మాత్రమే చేయగలిగాడు. 1984–85లో మొదటి సారిగా టెస్టు పోటీలలో ఇంగ్లాండుపై ఆడినప్పుడు మూడు, ఆ తర్వాత 1986–87లో శ్రీలంకపై ఒకటి, పాకిస్తాన్ పై రెండు సెంచరీలు చేసాడు. 24 టెస్టులలో, 36 యిన్నింగులలో 1646 పరుగులు సాధించగా, మూడు సార్లు 'నాట్ అవుట్'గా యున్నాడు. భారతదేశం కీర్తిని ప్రకాశింప చేయ గలడని ఆశించిన అజారుద్దీన్ ఆ తర్వాత 'టెస్టు'లలో ఆడిన పద్ధతి నిరాశ కలిగించింది. క్రికెట్ పండితుల అంచనాలు తారుమారు అయ్యాయి. దీనితో అజారుద్దీన్‌పై ఆశ వదలుకోవచ్చునన్న అనుమాన పరిస్థితి ఏర్పడినది.

అజార్ క్రికెట్ ఆటలో మొదటి నుండి అనేక ఒడిదుడుకులు ఎదుర్కొన్నాడు. హైదరాబాద్‌లో విద్యార్థిగా యుండగా ఉస్మానియా విశ్వవిద్యాలయం, నిజాం కాలేజి క్రికెట్ జట్లమధ్య పోటీ తీవ్రముగా ఉండేది. మొదట్లో అజార్ ప్రతిభను గుర్తించక అవకాశము యివ్వలేదు. 1981లో ఆడే అవకాశము లభించినది. అజార్ మొదటి సారిగా పోటీలో పాల్గొనటానికి వెళ్ళినప్పుడు తాతగారి ప్రోత్సాహము ఎంతో లభించింది. ఆరోజు పోటీలో 75 నిమిషాలు ఆడి 97 పరుగులు చేసాడు. తోటి ఆటగాడైన అర్షాద్‌అయూబ్ అజార్‌ను పిల్ల వానిగా చూచేవాడు.ఇప్పుడు యిద్దరూ టెస్టు ఆటగాళ్ళు. అదేసంవత్సరము హైదరాబాద్, తమిళనాడు మధ్య హైదరాబాద్‌లో జరిగిన రంజీట్రాఫీ పోటీలో ఆడాడు. తమిళనాడు జట్టుతో వచ్చిన అగ్రగామి టెస్టు ఆటగాడు ఎస్. వెంకట్రామన్ అజార్‌లోని ప్రతిభను గుర్తించి ప్రశంసించాడు. కాని మరుసటి ఏడు ఆ రెండు జట్లమధ్య తిరిగి హైదరాబాద్‌లో ఆడిన పోటీలో అజార్‌కు స్థానములేదు. ఇది వెంకట్రామన్‌ను ఆశ్చర్య పరిచింది. హైదరాబాద్ జట్టు సారథి నరసింగరావు అజార్ పరుగులు సాధించుటలో విఫలమగుటచే అవకాశము యివ్వలేదు అన్నాడు.

అప్పటికి అజార్ వయసు 20 ఏళ్ళు. కాని 1983–84 రంజీ సీజన్‌లో బందరులో ఆంధ్రతో ఆడిన పోటీలో మొదటిసారిగా 'సెంచరీ' చేసాడు.

హైదరాబాద్‌లో విశ్రాంతి సమయంలో ఇంటి బయట అజారుద్దీన్



ప్రథమశ్రేణి పోటీలు (94 యిన్నింగులు)లో పాల్గొన్నాడు. అందులో రంజీ పోటీలతో 12 సార్లు, దులీప్ ట్రాఫీ 7, ఇరానీకప్ రెండు, ఇతర పోటీలు 19 ఆడాడు. అజారుద్దీన్ మొత్తం 4384 పరుగులు సాధించాడు. 15 సార్లు 'నాట్ అవుట్'.

1985 – 86లో శ్రీలంక, ఆస్ట్రేలియాపై ఆడిన పోటీలలో అజార్‌తృప్తికరముగా ఆడక పోవుటచే విమర్శలు వినిపించాయి. అజార్ 'బాటమ్–హాండ్' ఆటగాడు. అందుచేత సరిగా ఆడలేక పోతున్నాడని 'క్రికెట్ మేధావుల' అభిప్రాయము. కాని మొదట నుండి తనకు అలవాటు అయిన పద్ధతి యిప్పుడు మార్చుట కష్టమని అజార్ అంటాడు. అప్పటికి సునీల్ గవాస్కర్ సలహా పై తనలో గల కొన్ని లోపాలు సరిచేసుకున్నాడు. అంతేగాక తాను పరుగులు – సెంచరీలు సాధించాలని అందరు ఆశిస్తారు. కాని అంతర్జాతీయ పోటీలో పరుగులు తీసుకోవాలి అంటే ఎంత కష్టము అనేది ఆలోచించరు. ఫీల్డింగ్, బౌలింగ్‌లో కూడా నైపుణ్యము చూపిస్తున్నాడు. పైకి వచ్చు సమయములో తొందరపడి వివాహము ఆడుటవలన ఆటలో ఎక్కువ శ్రద్ధ వహించ లేక పోతున్నాడనే అభిప్రాయము కూడా ఉన్నది.

కాని కొందరి అభిప్రాయము అజార్ మొదటి మూడు టెస్టులలో చేసిన 'సెంచరీ' లు అతని ప్రతిభ వలన గాక అనుకోని విధముగా లభించాయి అంటారు. హైదరాబాద్ కోచ్ ఇ. బి. ఐబ్రా యిదే అభిప్రాయము వ్యక్తపరిచారు. క్రికెట్ మేధావులు మాత్రము దీనిని అంగీకరించుటంలేదు.

ఏది ఏమైన నాలుగు నెలల తర్వాత రాబోవు టెస్టు, ఒకరోజు పోటీలో అజార్ భవిష్యత్తును నిర్ణయించ గలవు.

–ముకరమ్




# ఈ సారి పుట్టిన రోజుకు మీనాకు అన్నిటినీ మించిన కానుకను ఇచ్చింది ఫెయిర్ అండ్ లవ్‌లీ.

ఈసారి పుట్టిన రోజుకు మీనాకు అన్నిటినీ మించిన కానుకను ఇచ్చింది ఫెయిర్ అండ్ లవ్‌లీ.

గత రెండు నెలలుగా మీనా ఈ రోజుకోసం ఎదురుచూస్తూ ఏర్పాట్లు చేసుకుంటోంది. ఆ ఏర్పాట్లలో ఫెయిర్ అండ్ లవ్‌లీ కూడా ఓ ప్రముఖ పాత్ర వహించిందనుకోండి. ఫెయిర్ అండ్ లవ్‌లీ సహజంగా, మృదువుగా పనిచేసి ఆమె ఎల్లప్పుడూ కలలు కంటున్న మెరిసే, నునుపైన వంటి ఛాయను ఆమెకు సమకూర్చింది. అందంగా ప్యాక్ చేయబడిన కానుకను అందిస్తూ రవి వెన్నెలను ఆస్వాదించే చకోరంలా మెచ్చుకున్నది ఆమెకు సమకూరిన ఆ పసిడి ఛాయనే. ప్రశాంతమైన ఆమె ముఖంలో ఓ చిరునవ్వు. ఇదే సమయంలో ఆమె హృదయంలో ఫెయిర్ అండ్ లవ్‌లీ పట్ల కృతజ్ఞతా గీతికల గానం.

మీనా లాగే మీరూ ఇతర్లు గుర్తించేలాంటి మెరిసే ఛాయను సమకూర్చుకోవచ్చు ఫెయిర్ అండ్ లవ్‌లీతో.

**ఓ ముఖ్యమైన వైజ్ఞానిక విజయం**

ఫెయిర్ అండ్ లవ్‌లీ... మీ వంటికి సహజమైన రీతిలో మెరుగైన ఛాయనివ్వడానికి దీనిలో వుంది


ఫెయిర్ అండ్ లవ్‌లీ వాడక ముందు


ఫెయిర్ అండ్ లవ్‌లీ వాడిన తర్వాత

ఓ సాటిలేని ఫార్ములా, ఇది ముఖ్యంగా రెండు విధాల పనిచేస్తుంది. ఒకటి, ఇది చర్మం అడుగున పనిచేసి



శరీరం స్వతహాగా లోలోనే నల్లబడటాన్ని అరికడుతుంది—ఇంకే క్రీమూ చెయ్యలేని తీరులో. రెండు, దీని డబల్ సన్‌స్క్రీన్ చర్య, నల్లబరిచే సూర్యకిరణాల నుంచి చర్మాన్ని కాపాడుతుంది. అందుచేత 6 నుంచి 8 వారాల్లో పైకొచ్చే కొత్త చర్మ పొరలు మరింత మెరుగైన ఛాయ కలిగి వుంటాయి. మీరు ఫెయిర్ అండ్ లవ్‌లీని నియమానుసారంగా రోజుకు రెండుసార్లు ఉపయోగిస్తూంటే, మీ వంటి ఛాయ ఎంతో అందంగా, మృదువుగా, సహజమైన మెరుపుతో అలాగే నిలిచి వుండటం ఖాయం.

**ఉపయోగించే పద్ధతి**

ముఖం, మెడ, చేతులు కడుక్కున్నాక, వాటి మీద ఫెయిర్ అండ్ లవ్‌లీ క్రీము చుక్కచుక్కలుగా రాయండి. ఇప్పుడు వేళ్లతో ఎగువకు రుద్దుతూ నెమ్మదిగా మాలిష్ చేయండి. ఫెయిర్ అండ్ లవ్‌లీ పనిచేయడం ప్రారంభించగానే మీకు కొద్దిగా జిమజిమలాడవచ్చు. భయపడకండి, అది తొందరగా తగ్గిపోతుంది.

**సులభంగా లోపలికి ఇంకుతుంది**

ఫెయిర్ అండ్ లవ్‌లీ ఇంతకు ముందుకన్నా ఇప్పుడు మరింత మృదువైనది, నేవళమైనది. ఇది చర్మం అంతటా మరింత సమానంగా పరుచుకొని, మరింత సులభంగా లోపలికి ఇంకుతుంది. త్వరలోనే ఆ తేడాని మీరు అనుభూతి చెందుతారు... వంటితో చూస్తారు కూడా!

మీరు ఫెయిర్ అండ్ లవ్‌లీ గురించి ఇంకా ఏమైనా అడిగి తెలుసుకోవాలనుకుంటే, ఈ చిరునామాకు వ్రాయండి: శ్రీమతి కవితా కుమార్, ఫెయిర్ అండ్ లవ్‌లీ అడ్వయిజర్, పి. ఓ. బాక్స్ 768, బొంబాయి 400 021.

**ఫెయిర్ అండ్ లవ్‌లీ**

**వంటి ఛాయని మెరుగుపరిచే క్రీమ్**




## వంటి ఛాయను మెరుగుపరుస్తుంది సహజంగా, మృదువుగా... ఇతర్లు గుర్తించేలాగ!

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

# ముగ్గురు ప్రముఖులకు డిలిట్ బిరుద ప్రదానం

ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం విద్వత్కవివతంసులైన డాక్టర్ సి. నారాయణరెడ్డి గారి కులపతిత్వంలో అభ్యుదయ పథంలో ముందుకు ఉరుకుతున్నది. కులపతే అన్నట్టు ఈ విశ్వవిద్యాలయం శైశవావస్థలో ఉన్నా, పురోగతి నిరాఘాటంగా కొనసాగుతున్నది. వివిధ శాఖలలో ఉన్నత విద్యకు అవకాశం కల్పిస్తున్నది. 1982 లో స్థాపితమైన ఈ విశ్వవిద్యాలయం ఈ స్వల్ప వ్యవధిలోనే 50 వేల మంది విద్యార్థులను సమోదు చేసుకొంది. రాష్ట్రమంతటా 57 అధ్యయన కేంద్రాలు నిర్వహిస్తున్నది. ఈ విశ్వవిద్యాలయం శిక్షణ పద్ధతులలో ముద్రిత గ్రంథాలు, వైయక్తిక కక్ష్యలు, రేడియో పాఠాలు, ఆడియో- వీడియో కార్యక్రమాలు, వేసవి తరగతులు ఉంటాయి. ఇంత వరకు 96 కోర్సులకు పాఠ్యగ్రంథాలు సిద్ధపరుప బడ్డాయి. అదనంగా 58 కోర్సులు తెలుగు మీడియంలో సిద్ధపరచారు. వివిధ విషయాలను గురించిన పాఠాలు ఆకాశవాణిలో ప్రసారమయి లక్షలాది శ్రోతలను విజ్ఞానవంతులను చేస్తున్నది. ఇంత వరకు 1067 పాఠాలు ఆకాశవాణిలో ప్రసారమయాయి. ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావు గారి నాయకత్వంలో వున్న, రాష్ట్ర ప్రభుత్వం ఈ విశ్వవిద్యాలయం కోసం జూబిలీ హిల్స్ ప్రాంతంలో 54 యకరాల స్థలం కేటాయించింది. త్వరలో భవనాలు లేస్తాయి. ప్రముఖులను గౌరవ బిరుదులతో సత్కరించడమనే సంప్రదాయంలో నిరుడు 1987 లో బ్రిటిష్ ఓపెన్ యూనివర్శిటీ వైస్ చాన్సలరును, ఇందిరా గాంధీ ఓపెన్ యూనివర్శిటీ వైస్ చాన్సలర్ ప్రొఫెసర్ డాక్టర్ రామ్‌రెడ్డి గారిని డాక్టర్ లిటరేచర్ బిరుదంతో గౌరవించింది. ఈ సంవత్సరం ఏప్రిల్ 30 వ తేదీ ఉదయం జరిగిన రెండవ స్నాతకోత్సవంలో ప్రముఖ పత్రికా రచయితలు తిరుమల రామచంద్ర, ప్రముఖ చలన చిత్ర దర్శకుడు శ్రీ కె. విశ్వనాథ్ ప్రముఖ ఉరుదూ పత్రికా సంపాదకులు శ్రీ అబిద్ అలీఖాన్ గారలను గౌరవ డాక్టర్ ఆఫ్ లిటరేచర్ బిరుదంతో గౌరవించడం జరిగింది. ఈ గౌరవ బిరుదులను, ఉత్తీర్ణులైన వివిధ శాఖల విద్యార్థులకు పట్టాలను రాష్ట్ర గవర్నర్ శ్రీమతి కుముద్‌బెన్ జోషి అందజేశారు. శ్రీ విశ్వనాథ్ తెలుగు, తమిళ, కన్నడ, హిందీ చలన చిత్రాలు పెక్కింటికి దర్శకత్వం వహించి ప్రజారంజకులైన ఉత్తమ కళాకారులు. ఆయన శంకరాభరణం అజంతా చిత్రం వంటిది. శంకరాభరణం విజయానికి కారణం ఆయనలో పూర్తిగా జాతీయత, ఆంధ్రత తొణికిస లాడడమే. శ్రీ విశ్వనాథ్ దర్శకత్వం వహించిన 'ఆత్మ గౌరవం' మొదట రాష్ట్ర ప్రభుత్వం అవార్డు పొందింది. అప్పటి నుంచి వరుసగా ఐదేళ్ళు అవార్డులు పొందింది. కాలం మారింది, చెల్లెలి కాపురం, శారద, ఓ సీత కథ, జీవనజ్యోతి, సీతామాలక్ష్మి వంటి చిత్రాలు జనరంజకమయాయి. సప్తపది జాతీయ సమైక్యత వృత్తం గలది గనుక నర్గిస్‌దత్ అవార్డు, రాష్ట్ర ప్రభుత్వ నగదు బహుమతి పొందింది. సంగీత నృత్యమయమైన సాగర సంగమం పెక్కు అవార్డులు పొందింది. స్వాతిముత్యంతో ఆయన దర్శకత్వం గొప్ప ఉన్నతిని అందుకొంది. ఇది ఆస్కార్ అవార్డుకు కూడ సూచింపబడింది. శ్రీ విశ్వనాథ్ మరొక విశేషం ఫిలింఫేర్, ఎక్స్‌ప్రెస్ గ్రూప్ పత్రికల అవార్డులు పొందడం. ఈయన హిందీ చలన చిత్రాలు కామ్‌చోర్, సంజోగ్, సర్‌గమ్ వాణిజ్య చిత్రాలకు భిన్నమైన విశిష్టతగలవి. విదేశ భారతీయులు గూడ ఈయనను పెక్కుసార్లు ఆహ్వానించి సత్కరించారు. భారతీయ చలన చిత్ర పరిశ్రమ చరిత్రలో ఈయనకు శాశ్వతమైన స్థానం వుంది. ఈయన ఈ శతాబ్దపు విశిష్ట కళాకారులలో ఒకరు.

శ్రీ కె.విశ్వనాథ్



శ్రీ విశ్వనాథ్ సనాతన ధర్మపరాయణుల వంశంలో జన్మించారు. ఇంజనీరింగ్ పట్టభద్రులైన పిదప సుప్రసిద్ధ వాహినీ స్టుడియోస్‌లో సౌండ్ ఇంజనీర్‌గా చేశారు. ప్రముఖ చలన చిత్ర దర్శకుడు శ్రీ బి. ఎన్. రెడ్డి ఈయన కౌశలాన్ని గుర్తించి, చలనచిత్ర దర్శకత్వంలోను శిక్షణ ఇచ్చారు. ఈ యువ ఇంజనీరు చలన చిత్ర పరిశ్రమలోని వివిధ శాఖలలో తగినంత జ్ఞానం సంపాదించారు. పిదప ఈయన ప్రఖ్యాత చలన చిత్ర దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావుతో కలిసి పని చేశాడు. మూగ మనసులు దర్శకత్వంతో ఈయన దర్శకత్వ జీవితం ప్రారంభమైంది. ప్రముఖ పత్రికారచయిత ఉరుదూ విద్వాంసుడు, రచయిత, విద్యావేత్త, సంఘ సేవకుడు శ్రీ అబిద్ అలీఖాన్ 'సియాసత్' అనే ఉరుదూ దిన పత్రిక సంపాదకుడు. ఈ పత్రిక ఉరుదూలో విశేష ప్రచారం గల రెండవ పత్రిక. సియాసత్ ప్రతిష్ఠవల్ల శ్రీ అబిద్ అలీఖాన్ ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా డైరెక్టర్‌గాను, సమాచార భారతి డైరెక్టర్‌గాను, ఇండియా ప్రెస్ కౌన్సిల్ సభ్యులుగాను నియమింపబడ్డారు. శ్రీ ఖాన్ 1920 మార్చి 19న హైదరాబాద్‌లో ఉన్నత కుటుంబంలో జన్మించారు. మదరసా ఇ ఆలియాలో చదివి, 1942లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పట్టభద్రులై విద్యావ్యాప్తికి, ముఖ్యంగా ఉరుదూ వ్యాప్తికి 1949లో 'సియాసత్' ఉరుదూ పత్రిక స్థాపించారు. మాడల్ స్కూల్సు స్థాపించారు. 197[illegible]లో ఉరుదూ తాలిమీ ట్రస్ట్ స్థాపించారు. ఉరుదూ రచయితల సహాయం కోసం స్థాపించిన అబాబీ సంస్థ మేనేజింగ్ ట్రస్టీగా వున్నారు. అంతే కాక ఉరుదూ భాషా సాహిత్యాల అభివృద్ధికి నెలకొల్పిన పెక్కు సంస్థలతో సంబంధమున్నవారు విద్యావేత్తగా పెక్కు విద్యా సంస్థలతో సంబంధమున్నవారు. ఉరుదూ అకాడెమీకి నిర్వాహకాధ్యక్షుడు, సాహిత్య అకాడెమీ సభ్యులు, ప్రపంచ తెలుగు మహాసభ ఉపాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం విజిటింగ్ ప్రొఫెసర్ శ్రీ ఖాన్ అభ్యుదయ దృక్పథం గలవారు, ప్రొగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్ స్థాపక కార్యదర్శి. కార్ల్ మార్క్స్ పుస్తకాలు అనువదించారు. చైనాపై రెండు పుస్తకాలు రచించారు. శ్రీ ఖాన్ పెక్కుసార్లు ప్రపంచ పర్యటన చేశారు. 1962లో సోవియట్ యూనియన్‌లో ప్రపంచ యువజనోత్సవ ప్రతినిధివర్గ సభ్యుడుగా పర్యటించారు. ఆఫ్గనిస్థాన్, హంగరీ, యుగోస్లావియా, అమెరికా మొదలైన వివిధ దేశాలలో పర్యటించారు. పెక్కు సన్మానాలు

# అవీ-ఇవీ-అన్నీ

## "విజయవాడలో విశ్వనాథ కాంస్య విగ్రహం"

ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో అనన్య సాధ్యమైన స్థానం పొందిన కళా ప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణగారి కాంస్య విగ్రహం విజయవాడలో నెలకొల్పటానికి జనవరిలో జరిగిన స్మారకోపన్యాసాల సందర్భంగా నిర్ణయం జరిగింది. శిష్యులు, అభిమానులు ముందుకువస్తే పర్వతనేని బ్రహ్మయ్య మెమోరియల్ ట్రస్టు తమ వంతు సహాయ సహకారం అందించగలదని ట్రస్టు సభ్యులు టి. టి. డి. ఛైర్మన్ శ్రీ డి. సీతారామయ్యగారు అనాటి సభాధ్యక్షులుగా ప్రకటించారు. ఆ సభలోని వారి శిష్యులు కొందరు రు. 1,116/- విరాళంగా ప్రకటించారు. ఆచార్య జె. వి. సుబ్రహ్మణ్యం వారి కుమార్తె చి. సౌ. శ్రీ లక్ష్మి చెరి రు. 1,116/-లు విరాళం అందించగలమని వర్తమానం పంపారు. కేంద్ర మంత్రి గౌ. పి. వి. నరసింహారావు గౌరవాధ్యక్షులుగా శ్రీ డి. సీతారామయ్యగారు అధ్యక్షులుగా ఈ కార్యాచరణను నిర్వహింపనున్న సారధ్య సంఘంలో విశ్వనాథ శిష్యులు, అభిమానులు ఎందరో వున్నారు. ఒక మహాకవి శాశ్వత స్మృతికి సార్థకమైన బాధ్యతను వారి అభిమానులు, శిష్యులు సహకరించవలసినదిగా సారధ్య సంఘం నేడు ఒక ప్రకటనలో పేర్కొన్నది.

వివరాలకు కార్యదర్శి. విశ్వనాథ కాంస్య విగ్రహస్థాపన సమితి, 23.32.17, పాపరాజువీధి, సత్యనారాయణపురం, విజయవాడ-11 వారికి వ్రాసి తెలుసుకొనవచ్చును. □



హైదరాబాద్ మానేజ్‌మెంట్ అసోసియేషన్ వారు అందజేసే ప్రతిష్ఠాత్మకమైన "మానేజర్ ఆఫ్ ది ఇయర్" అవార్డు ఈ ఏడాది(1988) గోదావరి ఫెర్టిలైజర్స్ మానేజింగ్ డైరెక్టర్ శ్రీ ఎం. గోపాలకృష్ణ, ఐ. ఎ. ఎస్. కి లభించింది. జూలై 24న హైదరాబాద్ లోని జూబిలీ హాల్‌లో జరిగిన అవార్డు ప్రదానోత్సవ సభలో కేంద్ర మానవ వనరుల శాఖ మంత్రి శ్రీ పి. శివశంకర్ "మానేజర్ ఆఫ్ ది ఇయర్" అవార్డుని శ్రీ ఎం. గోపాలకృష్ణకి అందచేస్తున్న దృశ్యం. సభకి అధ్యక్షత వహించిన హైదరాబాద్ మానేజ్ మెంట్ అసోసియేషన్ అధ్యక్షులు డాక్టర్ సుశీలారావుని కూడా చిత్రంలో చూడవచ్చు.

పొందారు. 1981లో పద్మశ్రీ బిరుదం పొందారు. వీరు ముగ్గురికి సంబంధించిన ప్రశంసాపత్రాలు చదివిన పిదప గవర్నర్ గౌరవ డి. లిట్ బిరుదులు అందజేశారు పిదప వైస్ చాన్సలర్ డాక్టర్ సి. నారాయణరెడ్డి 1982 ఆగస్టులో సార్వత్రిక విశ్వవిద్యాలయం స్థాపించినప్పటి నుంచీ సాధించిన విజయాలను వివరించారు. తర్వాత ముఖ్య అతిథి, యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ వైస్ చెయిర్మన్ డాక్టర్ కె. సచ్చిదానందమూర్తి స్నాతకోపన్యాసం చేశారు. దేశంలో తొలిసార్వత్రిక విశ్వవిద్యాలయం స్థాపించిన కీర్తి ఆంధ్రప్రదేశ్‌కు లభించింది.

ఈ విశ్వవిద్యాలయం ఆరు సంవత్సరాలలో సమకాలిక భారతీయ కవులలో అగ్రేసరులయిన వారిలో ఒకరైన డాక్టర్ సి. నారాయణరెడ్డి నాయకత్వాన త్వరితగతిని అభివృద్ధి సాధిస్తున్నది. అందరికీ ఉచితంగాను, శాశ్వతంగాను విద్యాబోధ కొనసాగాలన్నది ప్లేటో అంతటి ప్రాచీనమైన భావం. త్వరితగతిని మారుతున్న ప్రపంచ పరిస్థితులలో మానవుల మధ్య సంబంధాలూ మారుతున్నాయి. ఈ మార్పులలో ప్రజలు ఇతరులతోను, ప్రకృతితోను సామరస్యంగా మెలగలేక పోతున్నారు. దానికి తోడు కాలానుగుణం కాని విద్య వారికి తగిన మార్గాలు, సంపూర్ణ జీవితాన్ని అనుభవించే పద్ధతులు చూపలేక పోతున్నది. మానవుడు వ్యష్టిగాను, సమష్టిగాను రాజకీయార్థిక సాంకేతికాభివృద్ధిని అవగాహన చేసుకొని, ఆ రంగాలను నియంత్రించడానికి తగిన అర్హతలు సంపాదించడం అవసరం. ఏ విధమయిన విద్య అయినా మానవునికి జీవితంలోని విభిన్న రంగాలలో వివిధ దశలలో జ్ఞానం సంపాదించ గలదిగా వుండాలి. సంపాదించడానికి చదువు అన్నంత మాత్రం చాలదు, మానవుడు జీవించి వున్నంత వరకు నేర్వడమెట్లో తెలుసుకోడం అవసరం. సాధారణ విశ్వవిద్యాలయాలే కాక, సార్వత్రిక విశ్వవిద్యాలయాలు సంఘ స్వరూపాన్ని-భావాన్ని, శీలాన్ని రూపుదిద్దే పెక్కు అనియత సంస్థలున్నవి. ఉదాహరణకు కుటుంబం ఒక ముఖ్యమైన సంస్థ. దాని ద్వారా తరతరాలుగా సంస్కృతి ప్రసారమౌతుంది. ఆ విధంగానే మత సంస్థలు, మ్యూజియంలు, రేడియో, పత్రికలు ప్రజలకు వివిధ రీతులుగా విద్యను అందజేస్తున్నాయి. విద్యను సంఘాన్ని నియంత్రించేది గనుక ప్రతి బోధన పద్ధతిలో జాగ్రత అవసరం. సమాన లక్ష్యం, వివిధ పద్ధతుల సమన్వయం లేకపోతే సాధారణ విద్యా సమాజం రూపొందదు. కనుక వివిధ విశ్వవిద్యాలయాల నుండి విద్యను ఆర్జించేవారు వ్యష్టి, సమిష్టి అభివృద్ధి కావాలంటే, సాధారణ ప్రపంచాభిప్రాయాలను అవగాహన చేసుకోవాలి. సమానమైన జాతీయ చైతన్యం వాంఛనీయమైతే, ఈ విషయంలో జాగ్రత్త పడాలి'- అని డాక్టర్ సచ్చిదానందమూర్తి అన్నారు.

స్నాతకోత్సవం ప్రారంభంలోను, చివరను గవర్నర్, విశ్వవిద్యాలయాచార్యులు, డి. లిట్ సమాన్యులు ఊరేగింపుగా వేదికను చేరారు. వేదికదిగి ఊరేగింపుగా వెళ్లారు. స్నాతకోత్సవం బ్యాండు బృందం జాతీయ గీతాలాపంతో సమాప్తమైంది. □

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor: M. Madhava Rao, Chief Editor: S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667



"బజార్ రౌడి"లో నదియా

## కృష్ణ, కోడి రామకృష్ణల కాంబినేషన్‌లో "గూండా రాజ్యం"

"సమాజంలో జరిగే దుర్మార్గాన్ని, ద్వేషాన్ని, గూండాయిజాన్ని నిర్మూలించి, ధర్మస్థాపన కోసం కంకణం కట్టుకున్న ముగ్గురు మనుషుల కథ. న్యాయస్థాపన కోసం వారి మార్గాలు వేరయినా ధ్యేయమొక్కటే. ఈ పాత్రలలో కృష్ణ, ఊర్వశి శారద, విజయశాంతి విజృంభించారు. ఆగస్ట్‌లో మూడు పాటల షెడ్యూల్‌తో మొత్తం షూటింగ్ పూర్తవుతుంది.," అన్నారు కోడి రామకృష్ణ. ఈయన దర్శకత్వంలో జి. శివరాజు, ఆర్. వెంకట్రాజు నిర్మించే శ్రీ విజయలక్ష్మి ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో మురళీమోహన్, గొల్లపూడి మారుతీరావు, గిరిబాబు, నూతన్ ప్రసాద్, ప్రసాద్‌బాబు, మల్లికార్జునరావు, భాస్కరబాబు, వెంకట్రావు, మురళీకృష్ణ మురళి, వై. విజయ తదితర నటవర్గం. ఎం. వి. ఎస్. హరనాథరావు రచన, రాజ్‌కోటి సంగీతం, కోడి లక్ష్మణరావు ఛాయ, బాలు

## సినిమా

(46 వ పేజీ తరువాయి)

శిల్పం, సూరపనేని రాధాకృష్ణ సంయుక్త దర్శకత్వం, బి. శ్రీధర్ ప్రొడక్షన్, శివసుబ్రహ్మణ్యం – శివశంకర్ నృత్యాలు, సురేష్ తాతా కూర్పు నిర్వహిస్తున్నారు.

## కొచ్చిన్‌లో "రక్తాభిషేకం"

"జూలై 18 నుండి 31 వరకు కొచ్చిన్‌లో మూడు పాటలు, పతాక సన్నివేశాన్ని చిత్రీకరించడంతో షూటింగ్ పూర్తయింది," అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. సుబ్బారెడ్డి సమర్పించే రాజీవ ప్రొడక్షన్స్ వారి పై సినిమాస్కోప్ చిత్రంలో బాలకృష్ణ, రాధ, జగ్గయ్య, సత్యనారాయణ, శరత్‌బాబు, వేలు, రంగనాథ్, సంగీత, మమత, బేబీ సుజాత పాల్గొన్నారు. యండమూరి వీరేంద్రనాథ్ కథకు జంధ్యాల సంభాషణలకర్త. వేటూరి గీతాలకు ఇళయరాజా స్వరకర్త. ఎన్. సుధాకరరెడ్డి ఛాయ. శ్రీనివాసరాజు శిల్పం, సదాశివరావు సంయుక్త దర్శకత్వం, తార నృత్యాలు, విజయన్ సాహసాలు, డి. వెంకటరత్నం కూర్పుతో కె. సి. రెడ్డి నిర్మాత.

## "ముద్దుల మాస్టారు"

"ఒక ఆదర్శవంతుడైన మాస్టారి కథ. 'నూట్రుకు నూరు' అనే బాలచందర్ తమిళ చిత్రం ఆధారం," అన్నారు ఎన్. గోపాలకృష్ణ. ఈయన దర్శకత్వంలో టి. సంబంధన్ నిర్మించిన లక్ష్మీకుబేరా ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో అశోక్ కుమార్, అనంత్, రమణమూర్తి, దేవదాస్ కనకాల, రావి కొండలరావు, పొట్టి ప్రసాద్, వినోద్‌కుమార్, మిఠాయిచిట్టి, రాధాకృష్ణ, శంకర్, భరత్, పిళ్ళై, మధు, సాగరిక, దేవి, కోమల, రాధాకుమారి, లక్ష్మీప్రియ, శిల్ప, జయశీల, విజయలక్ష్మి, సరోజ, యూన్సి నటించారు. మాటలు : జయశ్రీ మల్లిక్. ఛాయ : జె. పి. శెల్వం. ప్రొడక్షన్ : ఈశ్వరయ్య. విజయదశమి విడుదల. □